# రైతుల పాలిటి కల్పతరువు
# రామగుండం యూరియా




ఆంధ్రప్రదేశ్‌లో తయారు చేయబడుతున్న
యూరియా, రామగుండం యూరియా.
అన్ని పంటలకు, అన్ని కాలములకు అనువైన ఎరువు.

వాడండి
రామగుండం యూరియా.

## స్వస్తిక్ బ్రాండ్
## యూరియా




**ది ఫెర్టిలైజర్ కార్పొరేషన్**
**ఆఫ్ ఇండియా లిమిటెడ్**
అమ్మకపు విభాగము
6-2-30/C, లకిడి కా పూల్,
హైదరాబాదు-500 004.

Sobhagya



### ముఖచిత్రం

వజ్ర కిరీటాలంకృతుడైన వేంకటేశ్వరుని చూడగానే చేతులెత్తి నమస్కరించబుద్ధి పుడుతుంది.

ఎస్. సుజాత, సునీత (కమలాపురం)

### సీరియల్ నవలలు

''తిరుచరణాలు'' (లల్లాదేవి), ''జీవన్ మృతులు'' సీరియల్స్ నాకు చాలా నచ్చాయి.

వాగ్దేవి (బాపట్ల)

### ఆ క లి

''ఆకలి'' కథ చాలా బాగుంది. రావినూతల సువర్ణాకన్నన్‌గారికి నా అభివందనములు.

8 సం.ల పాప భోజనము చేయలేదు అని చెప్పి దొంగతనముగా ఒక్కరికి తెలియకుండా ఒక్కరితో భోజనము పెట్టించుకొని పేదవాళ్ళకు వేసే పద్ధతి, అలా వేసినప్పటికి పేదవాళ్ళు తినలేకపోవడము చాలా బాగుంది. అలాగే ఆ పాప అన్నట్లు డబ్బున్నవాళ్ళందరు పేదవాళ్ళను ముందు ముందుకు వచ్చేటట్లు చేయుట, వారి ఆకలి తీర్చే పథకము ఏర్పాటు జరిగితే దేశము బాగుపడుతుంది. దేశములోని ప్రజలకు ఉపయోగపడినట్లు కథలు క్రొత్త క్రొత్తవి ప్రకటించి, దేశము సర్వసంపద సౌభాగ్యముతో విలసిల్లినట్లు చేయవలెను. ఆకలి కథవలన ప్రతి మనిషి తనకున్న ఆకలి విలువ తెలుసుకొనినట్లు ఉపయోగపడుతుంది. చాలా బాగుంది.

డి. భాస్కరరావు (విశాఖపట్నం)

### న్యూఢిల్లీ లేఖ

'న్యూఢిల్లీ లేఖ'లో 'ఘనశ్యామ్‌దాస్ బిర్లా' గురించి డాక్టర్ జయ్‌దుబాషీగారు ఎన్నో విషయాలు తెలియచేశారు. మంచి భావాలుకలిగి, పరోపకార బుద్ధిగల ఒక ప్రముఖుడు జి–డి. ఇకలేనందుకు మనం ఎంతగా నోచింతించాలి.

జి. వి. కృష్ణారావు, జ్యోతి (రాజమండ్రి)

### విజ్ఞప్తి

నేను బి. ఎ. దాకా చదువుకున్నాను. నా ఎత్తు 5 అడుగుల 4 అంగుళాలు. బరువు 50 కి. గ్రా. నేను డిఫెన్స్ సర్వీసెస్‌కి అర్హుడను కాగలనా ? ఎవరయినా తెలుపగలరా ?

బి. వి. నాగభూషణరావు, బ్లాకు ఎల్/127/2, ఇంజనీరింగు కాలేజి, రాయగడ, కోరాపుట్ జిల్లా (ఒరిస్సా, 765007)

### నాటిక పోటీ

ఆంధ్ర ప్రజా నాట్యమండలి నాటిక రచనలో పోటీ నిర్వహిస్తున్నది. రచన ప్రదర్శనార్హమై వుండాలి. అవసరాన్నిబట్టి స్త్రీ పాత్ర ఒక్కరికన్న మించి ఉండరాదు. 45 ని.ల నుండి 1 గంట వరకు ప్రదర్శనలు రావాలి

సమకాలిన ప్రధాన సమస్య నేదైనా తీసుకోవచ్చు !

వస్తువుతోపాటు, శిల్ప ప్రాధాన్యత – రచనా చమత్కృతి ఉండాలి.

ప్రథమ బహుమతి ... రు. 1150/–
ద్వితీయ బహుమతి ... రు. 850/–
తృతీయ బహుమతి ... రు. 750/–

రచనలు అక్టోబరు 15 లోగా ఈ క్రింది అడ్రసుకు పంపాలి.

డా॥ ఎ. వి. విఠల్
అధ్యక్షులు, ఆంధ్ర ప్రజా నాట్యమండలి,
మార్క్సిస్టు కార్యాలయము,
విజయవాడ.

## ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

*శివలెంక శంభుప్రసాద్*

సంపాదకుడు :

[1938–1972]

శుక్రవారం : 5–8–'83

రుధిరోద్గారి నామ సం. ఆషాఢ బ. ఏకాదశి

**సంపుటము 75 సంచిక 49**

సంపాదకుడు :

*శివలెంక రాధాకృష్ణ*

విడి ప్రతి వెల రు. 1-50

ఆరు మాసాల చందా రు. 42-90

పోస్ట్‌లో ఏడాది చందా రు. 85-80

ఆంధ్రపత్రిక కార్యాలయము,

గాంధీనగరం, విజయవాడ-520 003.


## విషయానుక్రమణిక

# బాగుపడటం అంటే ఎందు కింత భయం?




మన పత్రికల తీరు కొన్ని సమయాలలో ఆశ్చర్యం వేసేట్టుగా ఉంటుంది. ఘనశ్యామ్‌దాస్ బిర్లా మరణిస్తే అంతగా పట్టించుకోవు. కాల్పాక్కమ్‌లోని అణుశక్తి 'రియాక్టర్' పనిచేసే స్థాయిని అందుకుంటుంది. దాన్ని గురించి రెండు పేరాలు వేస్తాయి. ఈ కాల్పాక్కమ్ రియాక్టర్ నిర్మాణం అంతా స్వదేశీ ప్రయత్నం. అలాంటిది ఇంకొకటి ఉండదు. అయినా దానికి లభించే ప్రాముఖ్యం (పత్రికలలో) అంతే. లండన్‌లో కపిల్‌దేవ్ గెలవనివ్వండి ఇక సంబరం పట్టలేము. నేనూ కపిల్‌దేవ్ విజయాన్ని అభినందించే వాళ్లలో ఒకడినే కాని సందర్భోచిత్యం ఉండక్కరలేదూ? కాల్పాక్కమ్ రియాక్టర్ పని చెయ్యటం, బిర్లా చనిపోవటం కన్నా అంత పెద్ద విశేషమా భారత దేశం ప్రమాదవశాత్తు ఒక విజయాన్ని సాధించటం?

ఒక జాతిగా మన భారతీయులకి విజయం అంటే భయం అనుకుంటాను. మనకి వైఫల్యమే ఇష్టమేమో! అదే మనకి గొప్పగా కనపడుతుందేమో? కాని, విజయావకాశాలు గోచరించనివ్వండి మనం భయంతో వణికిపోతాము. బిర్లానే తీసుకోండి—ఆయన జీవితంలో నెగ్గిన మనిషి; మతం, రాజకీయాలు, వ్యాపారం—ఏది తీసుకున్నా ఆయన కార్యసాధకుడే. అలాంటివాళ్లని చూస్తే కొంత భయం, కొంత అసూయ. ఈ రెండిటిలో భయం పాలే ఎక్కువ అనిపిస్తుంది. విజయం అనే దానిని చూస్తే మనికి భయం. కాల్పాక్కమ్ అణుశక్తి విద్యుత్ కేంద్రం పూర్తిగా మన ఇంజనీరులు, కాంట్రాక్టరులు నెలకొల్పిందే. అది పని చేస్తోందన్న వార్త సంచలనమే కలిగించలేదు. నాకు తెలిసిన ఇంజనీరులు ఎవరూ అంతగా దానిని గురించి మాటలాడలేదు.

మన భయం దేనికి? మార్పు అంటే భయం అనుకుంటాము. మనది "ఎలాగో కొట్టుకువచ్చే" మనస్తత్వం. మార్పులో ఏమేమి వత్తిడులు వస్తాయో! సుమారు 5000 సంవత్సరాలుగా భారతదేశంలో వచ్చిన మార్పులు సుఖశాంతులని తీసుకురాలేకపోయాయి. కాని, గత 30 సంవత్సరాలుగా వస్తున్న మార్పులు మన సుఖాన్ని పెంచగలుగుతున్నాయి.

"ఎలాగో అలాగ కొట్టుకువచ్చే" మనస్తత్వం అన్ని వర్గాల వాళ్లలోనూ ఒకే విధంగా ఉండదు. యూదులనే తీసుకోండి. వాళ్ళ ఎన్నో మార్పులు వచ్చినా "కొట్టుకువస్తూనే" ఉన్నారు. వాళ్ళ పడిన కష్టాలు ఇంకెవరూ పడలేదు. అయినా సరే యూదులు మార్పుని చూసి భయపడరు. 2000 సంవత్సరాలుగా ఇస్రాయిల్ దేశాన్ని స్థాపిద్దామనుకుని కలలుకంటూ ఉండే వాళ్ళు. చివరికి అనుకున్నంత పనీ చేశారు. ఒక ఏడాదిలో తమ దేశాన్ని నెలకొల్పుకున్నారు యూదులు పాశ్చాత్యదేశాలలో చాలా "పలుకుబడి" కలిగి ఉన్నారనే అనాలి. ఆ దేశాలలో వాళ్లకి వాణిజ్యం (అందులోనూ ఆర్థిక సంస్థల విషయంలో) మీద మంచి పట్టు ఉంది. మేధావులుగా కూడా యూదుల ప్రభావం చాలా ఎక్కువ పాశ్చాత్య దేశాలలో. వాళ్ళు ఇంత ఎలాగ సాధించారు? ఈ ప్రశ్నకి సమాధానం కొంత వరకు యూదుల మనస్తత్వంలోనే ఇమిడి ఉందనాలి. వాళ్లకి విజయం సాధింపుపట్ల సంకోచాలు ఉండవు. మనం విఫలులవుతున్నామంటే చాలావరకు దానికి కారణం మనకి గెలుపు అంటే ఉన్న భయమే!

ఈమధ్యనే నేను నా స్నేహితుడు ఒకాయనతో స్వరాజపాల్ వ్యవహారం గురించి మాటలాడుతున్నాను. ఎస్కార్‌టస్ సంస్థ తీసుకోండి – అది ఈనాడు ఇంత గొప్పస్థితిలో ఉందంటే దానికి నందా కృషే కారణం అనాలి. మా స్నేహితుడేమో నందా కుటుంబంవారు ఎంత వైభవంగా జీవిస్తారో; తరుచు విదేశాలకి ఎలాగ వెడతారో చెబుతున్నాడు. ఢిల్లీ బయట వాళ్లకొక పెద్ద భవనం కూడా ఉందిట. మా స్నేహితుడి అభిప్రాయంలో స్వరాజపాల్ చేస్తున్నది – అంటే నందా కుటుంబాన్ని ఎస్కార్‌టస్ కంపెనీ యాజమాన్యం నుండి తొలగించటానికి ప్రయత్నించటం – బాగానే ఉంది. నా అభిప్రాయం ప్రకారం స్వరాజపాల్ ఒక రకం దొంగ. కాని నందా చెడ్డ పని ఏమి చేస్తున్నాడు? ఆయన సంపాదించుకున్న డబ్బుని కర్చు పెట్టుకుంటున్నాడు. ఇది తప్పా? ఇంతకీ నందా సమాజానికి చేస్తున్న హాని ఏమిటి? ఆస్తి ఏమీ లేకుండా మొదలుపెట్టి, ఒక పెద్ద వాణిజ్య సంస్థని నిర్మించిన ఒక వ్యక్తి సమాజానికి సేవ చేసినట్లే కదా? అతని మూలాన ఎందరికి ఉద్యోగాలు వచ్చి ఉండాలి? తన డబ్బుని తన ఇష్టం వచ్చినట్లు కర్చు పెట్టుకొనడం తప్పా?

"పెట్టుబడిదారులు ధర్మకర్తలు" అనే వాదం కూడా భ్రశుతిమించినట్లు తోస్తుంది నాకు. గాంధీగారు ప్రచారంలోకి తీసుకు వచ్చిన ఈ సిద్ధాంతం ఫ్రాయిడ్ ఏదో ప్రతిపాదించిన సిద్ధాంతంలాగే ఉంటుంది. సంపదని సృష్టించటం ఒక నేరమా? (గాంధీ మహాత్ముడికి ఇలాంటి సంకోచాలు చాలా ఉండేవి. కామం

దొంగనోట్ల కుంభకోణంలో అరెస్టు చెయ్యటానికి ఎంతటి వాళ్ళనయినా వెనుదీయొద్దని చెప్పారుగా మీ పుత్రరత్నం ఎక్కడ సార్?



మరొకటి.) ఒక పెట్టుబడిదారుకి సయితం కర్తవ్యం అంటూ ఉంటుంది. ఆ కర్తవ్యాన్ని అతను నెరవేర్చినంత కాలమ్మూ అతను చేసిన కృషి యొక్కఫలితాలని అనుభవించే హక్కు అతనికి ఉంటుంది — ఒక కార్మికుడికి తన శ్రమఫలితాలని అనుభవించే హక్కు ఉన్నట్లే. అలాగని, పెట్టుబడిదారు చేసే పనులు ఇతరులకి హానికరంగా ఉండవచ్చునని నేను అనటంలేదు. ఒక సమాజం ఆరోగ్యంగా, క్రమ పద్ధతిలో నడవాలంటే కొందరికి కొన్ని హక్కులు ఉన్నాయన్న గుర్తింపు ఉండితీరాలి. ఒక రాజభవనంలో ఒక రాజకీయవాది నివసించటం కన్నా ఒక వాణిజ్యవేత్త నివసించటమే నయం అని నా అభిప్రాయం. ఒక వాణిజ్యవేత్త చేసేది సమాజానికి శ్రేయస్కరంగా ఉండగలదు; ఒక రాజకీయవాది ఒక రాజభవనంలో ఉన్నాడంటే అతను ఒక పరాన్నభుక్కుగా జీవిస్తున్నట్లే. ఒక సమాజంలో రాజకీయవాదులు లేకపోయినా ఫరవాలేదు. కాని, ఒక సమాజంలో సంపద సృష్టించేవాళ్లు లేకపోతే అది వేగంగా మరణిస్తుంది.

గొప్పగా ఆలోచించి సాదాగా జీవించటం మంచిది కాదనను. అలాగని గొప్పగా ఆలోచించి గొప్పగా జీవించటం తప్పు అంటే నేనుఒప్పుకోను. ఇక్కడ ఒక 'షరా'ని గమనించాలి. ఒక మనిషి గొప్పగా జీవించటానికి వీలు ఏర్పరిచే గొప్ప ఆలోచనలు ఆ మనిషికి కలగాలి. ఇదీ షరా! బ్రిటిషువాళ్లు గొప్పగా ఆలోచించి గొప్పగా జీవించాలని (అమెరికా వాళ్లలాగే) నమ్ముతారు. ఇది బాగానే ఉంది కాని, బ్రిటన్‌లో ఒళ్లువంచి పనిచెయ్యటం ఇష్టంలేదు చాలామందికి. ఇదే వచ్చిన చిక్కు! అమెరికాలో బాగా పనిచేస్తారు, గట్టిగా ఆలోచిస్తారు, వీలయినంత సుఖంగా జీవిస్తారు. సుఖంగా జీవిస్తున్నామనే సంకోచం వాళ్లకిలేదు. అమెరికా సమాజం ఒక స్వస్థ సమాజం కాదేమోకాని జీవించటానికే భయపడే వాళ్ల సమాజం కన్నా వాళ్ల సమాజమే నయమేమో! బిర్లా, తాతాలలాంటి వాళ్లు మరి కొందరు ఉంటే భారతదేశం బాగుపడుతుంది. మనకి కావలసినది కాల్పాక్కమ్‌లాంటి విజయాలు మరికొన్ని. జమ్‌షెడ్‌జీ తాతా బొంబాయిలో ఒక మురికివాడలో ఉండేవాడా? ఒక పెద్ద భవంతిలో ఉండేవాడు. బొంబాయిలో ఇంట్లో కరెంటు వాడినవారిలో మొట్టమొదటివాడు ఆయన. రాజనారాయణ, మధులిమాయె లాంటి మనుషులని సహించి వారితో జీవించవలసి రావటం భారతీయులకి పట్టిన దుర్గతి అంటాను నేను. వాళ్ళు ఏదిచేసినా విఫలమే అయింది. వాళ్లు దేనిని ముట్టుకున్నా అది నాశనం నాశనంచేసి తామేదో గొప్ప పని చేసినట్లు మురిసిపోతారు ఈ రకం మానవులు. 

లోకంపోకడ * ఊమెన్












# గుర్రాలూ-థరో బ్రెడ్‌లూ

* నేడు ప్రపంచంలో పరిగెత్తుతున్న అన్ని గుర్రాలూ మూడు గుర్రాల సంతతివే, ఇవి :

1. బయెర్లీ టుర్క్ : దీనిని 1690లో జరిగిన ఒక యుద్ధంలో బయెర్లీ అనే ఇంగ్లీషు కాప్టెన్ తన వాహనంగా వాడాడు.

2. డార్లీ అరేబియన్ : సిరియాలోని అలెప్పో అనే ఊరినుంచి 1704 లో డార్లీ అనే ఇంగ్లీషువాడు దీనిని దిగుమతి చేసుకున్నాడు.

3. గాడాల్ఫిన్ బార్బ్ లేదా ఆల్‌బియన్ : ఇది పారిస్‌లో ఒక బండీ గుర్రంగా ఉంటూ ఉంటే ఎడ్వర్డ్ రోన్ అనే ఇంగ్లీషు దేశస్తుడు 1730 లో కొని తెచ్చుకున్నాడుట.

* అమెరికా సంయుక్త రాష్ట్రాలలో సిగ్మండ్ సోమ్మర్ అనే అతనికి అతని గుర్రం 1972లో మాత్రం 1605936 డాలరులు సంపాదించి పెట్టిందట. (సుమారుగా ఒకటిన్నరకోటిరూపాయలు.) మంచి రేసుగుర్రాల మీద తలకి 10 లక్షల డాలరులు సంపాదిస్తూ ఉంటారుట.

* నిజిన్‌స్కీ అనే గుర్రాన్ని ఒక్కరు ఎవరూ కొనలేక (లేదా కొనటం ఇష్టంలేక) 35 మంది ఒక్కొక్కరూ 170000 డాలరులు వేసి కొన్నారుట.

* ఇంగ్లాండులో ఒక సుప్రసిద్ధ రేసు గుర్రం పేరు POTOOOOOOOO.

* అమెరికాలో ట్రిపుల్ క్రౌన్ గెలిస్తే 6080000 డాలరుల దాకా రావచ్చుట [ఆరుకోట్ల రూపాయల దాకా.]



ఈ అశ్వం యజమాని, దాని ట్రెయినరు దాన్ని తీసుకు వెడుతున్నారు.
గుర్రం మీద జాకీ

మానవులలోలాగే గుర్రాలలో కూడా 'అభిజాత్యపుజాతులు' ఉన్నాయి ఇంగ్లీషులో ''థరో బ్రెడ్'' అనే మాట అశ్వాలలో అభిజాత్యపు జాతికి చెందిన వాటికి వర్తిస్తుంది. జట్కా గుర్రాలు వగయిరాలు అనభిజాత్యపు రకాలన్న మాట.

అన్ని గుర్రాల దేహ నిర్మాణమూ ఒక రకంగానే ఉంటుంది — అందుకనే ఒక జంతువుని చూడగానే అది ''గుర్రం'' అని గుర్తుపట్టగలుగుతాము. కాని, థరో బ్రెడ్ గుర్రాల దేహాలు చాలా పెద్దవిగా ఉంటాయి. ఇంత పెద్ద గుర్రాలనీ అతి ముద్దుగా చూసుకుంటారు. చిన్న సాదారకం (అనభిజాత్యపు) అశ్వాలచేత తెగ చాకిరీ చేయిస్తారు.

ఒక జట్కా గుర్రానికి తిండి ఏమి పెడతారు ? ఉలవలూ, గడ్డి ! థరో బ్రెడ్‌కో ? ఓట్‌స్ ధాన్యం, కారట్‌లు, పాలు, టానిక్కులు, మందులు, కోడిగుడ్లు, ఇంకా ఇతర పోషక పదార్థాలూ ! గుడ్డు శాకాహారం కాకపోతే రేసు గుర్రం మాంసాహారే అవుతుంది మరి...

ఈ థరో బ్రెడ్ చరిత్రని పరిశీలిద్దాము. ఇది నిజానికి ఒక సంకర జాతి అశ్వం. ఎన్నో శతాబ్దాల వెనుక ఆఫ్రికా, పశ్చిమ ఆసియా, యూరోపు ఖండాలలో విచ్చలవిడిగా తిరిగే గుర్రాలని మానవులు పట్టుకుని సాకటం మొదలు పెట్టారు. వీటిలో కొన్నిటి సంతతే నేటి థరో బ్రెడ్‌లు.

[థరో బ్రెడ్ అంటే ''మంచి జాతిగా




పందెం ముగియబోతోంది ! గెలిచే గుర్రం ముందుకు వెళ్లిపోతోంది ....

రూపొందించబడిన'' అని అర్థం చెప్పవచ్చునా ? మంచి గుర్రాలేతప్ప వేరే కలవకపోతే రూపొందే గుర్రాలు మంచి జాతివి అనుకోవాలికదా ! ]

ప్రాచీన కాలంలోనే గుర్రప్పందాలు ఉండేవి. గ్రీసుదేశంవారు, రోమ్‌వారు, భారతదేశానికి చెందినవారు గుర్రప్పందాలని నిర్వహించేవారు. అదంతా పాత కథ.

ఆధునిక గుర్రపు రేసుల సంగతే వేరు. నేడు మనం చూసే గుర్రప్పందాల పద్ధతి ఇంగ్లాండులో ప్రారంభం అయింది. ఈ దేశం వారే థరోబ్రెడ్ జాతి గుర్రాలని రూపొందించారు. ఇంగ్లాండులో ''హార్స్ రేసింగ్''ని రాజుల క్రీడ అనేవారు.

భారతదేశంలో గుర్రప్పందాలని ప్రవేశపెట్టింది ఇంగ్లీషువారే అని వేరే చెప్పాలా ? మదరాసు, బొంబాయి, కలకత్తా ''టర్ఫ్ క్లబ్‌లు'' దేశంలోకెల్లా పాతవి.

1947 దాకా భారతదేశంలో ''రేసుల''ని తెల్లదొరలు, నల్లదొరలే అధికంగా పోషించేవారు. గుర్రాలు, జాకీలు, ట్రెయినరులు అందరూ సీమనుంచే దిగుమతి అయ్యేవారు. స్వాతంత్ర్యం తరువాత ధనవంతులలో అన్ని దినుసులవారూ ఇందులోకి దిగారు. థరోబ్రెడ్‌ల

ఋగ్వేదంలో ''ఆజి'' అనే మాటకి గుర్రపు పందెం అనే అర్థం ఉందిట. ''రేస్ కోర్స్''ని ''ఆజి'' అనీ ''కాష్ఠ'' అని కూడా పిలిచేవారుట. అథర్వవేదంలో కనిపించే వర్ణనలని పట్టి ఇది అర్ధచంద్రాకారం కలిగి ఉండేదని ఊహించవచ్చుట. అప్పటి రోజులలో బహుమతులని ''ధన''మనీ, గెలుపుని ''కార''మనీ, బహుమతిని ''భర'' మనీ పిలిచేవారని ఋగ్వేదాన్ని చదివినవారు చెబుతారు.

పందెంలో పరిగెత్తడాన్ని ''ఆజిమ్-, అజ్ –, ఇ– ధావ్ , శ '' అనే పదాలతో సూచించేవారని చెప్పబడుతుంది !

పందాలని నిర్వహించే వ్యక్తిని ''ఆజిశృత్'' అనేవారట. ఇంద్రుడికి ''అజిక్రృత్'' ''ఆజిపతి'' అనే పేరులు ఉండేవిట...

రేసుగుర్రాలని ''వాజి'' అనీ, ''అత్య'' అని పిలిచేవారుట ''విశ్పలా'' అనే పందెపు గుర్రం కాలు విరిగితే అశ్వినీదేవతలే బాగుచేశారుట !

వాజపేయి, రాజసూయ యాగాలలో పందాలు ముఖ్యమయిన అంశాలుట

[తిరుమల తిరుపతి దేవస్థానములవారు వెలువరించిన శ్రీ నేమాని లక్ష్మి నరసింహశాస్త్రిగారి శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితలో –

''విహగము వెంద్రుకల్ వలెను విశ్పల కాళ్లను తెగంగనాజిలో
మహిని నగస్త్యమౌని మిము మానుగ వేడంగనర్థ యామినిన్
బహుమతితోడ నిన్నవగు పాదములందవిలించి కాళ్లకున్
మహిదరణంబు జేయ నలమానిని బంపితి రశ్వినీదేవతల్''

అన్న పద్యం ఉంది.




## గుర్రాలూ ...

దిగుమతులు నిలిచిపోయాయి అందుచే, దేశంలోనే "గుర్రాల ఫారమ్"లు వెలిశాయి దేశవాళీ జాకీలూ, ట్రెయినర్‌లూ కూడా అవతరించారు అంతకిముందు జనసామాన్యానికి అంతగా అందుబాటులో లేని రేస్ కోర్సులు జనాదరణ పొందటం మొదలుపెట్టాయి హైదరాబాదు, బెంగుళూరు రేస్‌కోర్సులు బాగా ప్రసిద్ధి పొందాయి వీటిలోనూ ఇప్పుడు మేలురకం అశ్వాలే పరిగెడుతున్నాయి ఇం

ఇప్పుడు బొంబాయి, మదరాసు, కలకత్తా రేస్ కోర్సుల కన్నా ఇవే అధిక ప్రాముఖ్యం కలిగి ఉన్నాయి ఢిల్లీ, ఊటీ, మైసూరు కోర్సులు కూడా బాగానే జనాన్ని ఆకర్షిస్తున్నాయి

మంచి థరో బ్రెడ్‌ల ఖరీదు కోట్ల రూపాయలు ఉంటుంది భారతదేశంలో గుర్రాల ఖరీదు ఇంత ఉండదుకాని ఇక్కడ థరో బ్రెడ్‌లు మంచి ధరలే పలుకుతాయి

సరే, ఒక రేసుగుర్రం ఎంత వేగంగా పరిగెత్తగలదు? ఒక మైలు దూరాన్ని 92 సెకండులలో పరిగెత్తగలదు! అంటే గంటకి నలభయి మైళ్లు సుమారుగా

గుర్రాల ఎత్తులని "చేతుల" లేదా "హస్తాల"తో లెక్క వేస్తారు ఒక "చెయ్యి" 4 అంగుళాలు ఇంత దాకా అత్యున్నతమయిన అశ్వం ఎత్తు $19 \times 4 = 76$ అంగుళాలు సగటు ఎత్తు సుమారుగా $15 \times 4 = 60$ అంగుళాలు ఉంటుంది

ఒక రేసు గుర్రం సగటు ఆయుర్దాయం 20 సంవత్సరాలు ఉంటుంది 40 సంవత్సరాలు బతికిన గుర్రాలు కూడా ఉన్నాయిట

గుర్రప్పందాలకి వెళ్లేవారికి వచ్చేదాని కన్నా పోయేదే ఎక్కువ ఉంటుంది! ఇది జగమెరిగిన సత్యం వీటిలో ధనాన్ని అధికంగా కోల్పోయేది కూడా పేదవారే కాని ప్రభుత్వం వారు లెక్క చెయ్యరు వారికి రేసింగుమీద మంచి ఆదాయం వస్తుంది కదా? (తాగుడు, జూదం టిక్కెట్ల మీద వచ్చినట్లే)

గుర్రప్పందాలు ఒక "ఆట" లేదా "క్రీడ" అంటారు కొందరు ఇది నిజం కాదు ఇది ఒక పెద్ద జూదం

మీరొక రేసుకి వెళ్ళండి గుర్రాల అందాన్ని చూసి మురిసిపోయే జనాన్ని తిలకించండి గుర్రపు డెక్కల శబ్దాన్ని విని ఊగిపోయే మనుష్యులని పరిశీలించండి చివరికి ఆ రోజు రేసులు ముగిసిన తరువాత వే మొహాలు వేసుకుని ఇళ్లకి తిరిగి వెళ్లిపోయే వారిని గమనించండి

— అశ్వఘోష్

# వారఫలం

5-8-1983 శుక్రవారం మొదలు 11-8-1983 గురువారం వరకు

♈ **మేషం:** సభా రంగంలో పేరు ప్రతిష్ఠలు లభిస్తాయి. అధికారుల వలన జరుగవలసిన పనులు సుకరంగా నెరవేరుతాయి. ధనాదాయమున్నది. వ్యాపారం సుకరంగా సాగిపోతుంది. నూతన విషయాలు గ్రహింపగలరు. స్త్రీలకు: సుఖ శాంతులు, వస్తు సేకరణ, ఆదాయం ఉన్నది.

♉ **వృషభం:** శుభ కార్యానుకూలత, అధికారుల ఆప్యాయత, ఆరోగ్యంలో పెంపు, వ్యాపార రంగానుకూలత, నూతన మిత్రుల కలయిక సంభవం. చాలమందికి ప్రయాణానుకూల్యత చెప్పదగిన అంశం. స్త్రీలకు: కళా సాహితీ రంగాలలో, నటనలో, విద్యాభివృద్ధిలో అనుకూల వారం.

♊ **మిథునం:** మాటకు విలువ పెరుగుతుంది. సభా గౌరవం చేకూరుతుంది. ఉద్యోగ కోరకు చేసే ప్రయత్నాలు ఫలవంతం కాగలవు. ఒకానొక వ్యవహారంలో సర్వానుకూలత చేకూరగలదు. స్త్రీలకు: అధికారుల వలన గాని, రాజకీయంగా గాని జరుగవలసిన పనులు నెరవేరుతాయి.

♋ **కర్కాటకం:** ఉద్యోగ వృత్తులందు, ధనాదాయమందు, వ్యాపారమందు, గ్రామ వ్యవహారాలందు అనుకూల వారంగా చెప్పవచ్చు. అధికారుల వలన జరుగవలసిన పనులు సుకరంగా నెరవేరుతాయి. స్త్రీలకు: ధనాగమనం వృత్తిలో మేలు, పలు విధాల విద్యాభివృద్ధి అవకాశాలకు ఆస్కారమున్నది.

♌ **సింహం:** వ్యాపారానుకూలం, క్రయ విక్రయానుకూలం, ఇల్లు గాని, భూమి గాని, అభివృద్ధి చేసికొనుటకు, బంధు వర్గీయులతో శుభ కార్య ప్రస్తావనలకు అవకాశం గల వారం. స్త్రీలకు: విద్యాభివృద్ధి నిమిత్తం చేసిన ప్రయత్నాలు ఫలితానికి రాగలవు. అన్ని విధాలా లాభదాయకం.

♍ **కన్య:** మీ యాలోచనలు ఫలిస్తాయి. సాహిత్య రంగంలో సదవకాశాలుంటాయి. మాటకు విలువ పెరుగుతుంది. తెలివితేటలు రాణించే సన్నివేశాలుంటాయి. అధికార వర్గము వలన ఆశించిన మేలు చేకూరుతుంది. స్త్రీలకు: అన్ని రంగాలలో నూతనావకాశాలు, వ్యాపారంలో నూతన మార్గం, ధన లబ్ధికి అవకాశం గల వారం.

♎ **తుల:** చాల కాలంగా ఫలితానికి రాని విషయాలు ఫలిస్తాయి. ఉద్యోగ వృత్తులందు మీకు మేలు చేకూరుతుంది. వృత్తిలో వికాసం, నూతన సౌద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. స్త్రీలకు: మీరు ఉద్యోగ నిమిత్తం చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి.

♏ **వృశ్చికం:** అధికారుల వలన జరుగవలసిన పనులు సుకరంగా నెరవేరుతాయి. విలువగల వస్తువులు సేకరించుకొనుటకు అవకాశమున్నది. మీ ప్రజ్ఞ రాణించే అవకాశమున్నది. కొందరకు నూతన వ్యాపారానుకూలత గలదు. స్త్రీలకు: వస్త్ర వాహన సేకరణకు, ధన లబ్ధికి అవకాశమున్నది.

♐ **ధనుస్సు:** శుభ కార్యాలోచనలకు అవకాశం, నూతన మార్గంలో ధనాదాయం, విలువగల వస్తు సేకరణకు అవకాశం గలదు. కళా సాహితీ రంగంలో చెప్పదగిన అవకాశాలున్నాయి. స్త్రీలకు: అమూల్య వస్తు సేకరణకు అవకాశమున్నది. వృత్తిలో కొందరకు పెంపు కనిపిస్తుంది.

♑ **మకరం:** 'బ్యాంకుల్లో', దేవాదాయ ధర్మాదాయ శాఖలలో పని చేసే వారికి, రాజకీయ సంబంధంగా మేలు ఆశించిన వారికి ఈవారం విజయవంతం. మేలు సంభవం. ఆదాయం కూడా చెప్పదగిన అంశం. స్త్రీలకు: నూతనావకాశాలు వృత్తి ఉద్యోగాలలో చేకూరుతవి.

♒ **కుంభం:** ఆరోగ్య లోపం ఏర్పడుతుంది. పది విధాలా అవకాశాలు చిక్కి సాధారణపు ఆదాయాని కన్నా కొంత పెంపు కనిపిస్తుంది. విలాస వస్తు సేకరణకు, పెద్దల అనుభూతికి అవకాశమున్నది. స్త్రీలకు: విద్యార్జనలో సదవకాశాలు లభిస్తాయి. నాల్గు విధాల పంపు గలదు.

♓ **మీనం:** మీ తెలివితేటల వలన, పెద్దల పరిచయం వలన ధనాదాయం సమకూడే సన్నివేశాలు ఏర్పడుతాయి. పెద్దల సహకారం లభిస్తుంది. నూతన వృత్తిలో పెంపు కొందరు గమనింపనున్నారు. స్త్రీలకు: సుఖ శాంతులు, ఆరోగ్యంలో పెంపు, అధికార వర్గీయుల స్నేహం, తద్వారా మేలు సమకూరుతుంది.

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి ★

# వ్యక్తిగతం

ప్రూడెంషియల్ వరల్డ్ కప్ పోటీ గెలిచిన భారత క్రికెట్ బృందంలో ఆడి 'మాన్ ఆఫ్ ది మాచ్' అనిపించుకున్న మొహీందర్ అమర్‌నాథ్.



అమెరికాలో మొరార్జీ దేశాయి తరపున సేమూర్ హెర్ష్ మీద పరువు నష్టం దావా వేస్తున్న న్యాయవాది మహేంద్ర మెహతా మీదే ఆరోపణలు వస్తున్నాయి. ఆయనని స్థానిక న్యాయస్థానం వారు డిబార్ చేశారుట...

తన 87వ ఏట పరమపదించిన బక్‌మిన్‌స్టర్ ఫుల్లర్ వాస్తుశాస్త్రవేత్త, దార్శనికుడు. యంత్ర నిపుణుడు, సమాజ శాస్త్రవేత్త. ఎన్నో రకాల విశేషాలని కనిపెట్టినవాడు. స్తూపాకారంలో ఉన్న నిర్మాణం మీద గాలి పోయేందుకు ద్వారం వదిలితే ఆ స్తూపాకార నిర్మాణంలో చల్లగా ఉంటుందని కనిపెట్టాడు. ఇటువంటి నిర్మాణాన్ని ఇనప కడ్డీలతో కట్టవచ్చుననికూడా ఆయన నిరూపించాడు. దీనిని "జియోడెసిక్ డోమ్" అన్నాడు ఫుల్లర్ ఇంగ్లీషులో. ఆఫ్రికాలో ఇటువంటివి కట్టి వాటి ప్రయోజనాన్ని ఆయన ప్రదర్శించాడు. స్వంత దేశమయిన, అమెరికాలో మాత్రం దానికి అంత ఆదరణ లభించలేదు. ఎయిర్ కండిషనింగ్ యంత్రాలు తయారు చేసే వారే తమకి అడ్డుపడ్డారని ఆయన ఆరోపణ. బక్‌మిన్‌స్టర్ ఫుల్లర్ బహుముఖ ప్రజ్ఞాశాలి. జీవితాన్ని గురించి సమగ్రంగా ఆలోచించగలిగిన వ్యక్తి. [భారతదేశంలో కొన్ని ప్రాంతాలలోని గుడిసెలకి మీద ద్వారం ఉంటుంది.]

# నాగేశ్వరరావు ఎస్టేట్స్ ప్రైవేట్ లిమిటెడ్

రిజిష్టర్డు ఆఫీసు : 14 : 14 : 21, మల్లిఖార్జునరావు వీధి, విజయవాడ. 3.

## ప్రజలనుంచి, వాటాదార్లనుంచి ఫిక్సెడ్ డిపాజిట్లు/ఋణములు అంగీకరించుట/పునరుద్ధరించుట జరుగును

### ష ర తు లు, ని బం ధ న లు

I. కనీస మొత్తం రు. 2000 లు లేదా ఆపై రు.1000 తో హెచ్చింపబడు మొత్తమునకు డిపాజిట్లు అంగీకరించడం/—పునరుద్ధరించడం జరుగుతుంది.

II. డిపాజిట్లు / ఋణములు కనీస కాలపరిమితి 1 సంవత్సరమునకు, గరిష్ట పరిమితి 2 సంవత్సరముల కాలమునకు అంగీకరించ బడును.

III. దరఖాస్తు ఫారములో పేర్కొన్నటువంటి షరతులు, నిబంధనలకు లోబడి డిపాజిట్లు/ఋణములు అంగీకరించడం జరుగుతుంది. దరఖాస్తు ఫారములు విజయవాడలో గల రిజిష్టర్డు కార్యాలయంలోనూ, హైదరాబాదు నెం. 5—9—49, బషీర్‌బాగ్ లోని మా బ్రాంచి కార్యాలయమునందును లభ్యము కాగలవు.

IV. డిపాజిట్లు / ఋణములు తిరిగి చెల్లింపులు గాని, వడ్డీ చెల్లింపులు గాని,డిపాజిటు చేయబడిన ఆయా ప్రదేశముల లోని కంపెనీ బ్యాంకర్ల క్రాస్‌చేసిన చెక్కుల ద్వారా చెల్లించబడుతుంది.

V. కొత్తగా దరఖాస్తు పెట్టుకొని డిపాజిట్లు పునరుద్ధరించుకోవచ్చును.

VI. తిరిగి చెల్లించేగడువు ముగియక మునుపే, డిపాజిటు మొత్తాలను తిరిగి చెల్లించే హక్కు కంపెనీ కలిగియుంటుంది.

VII. వడ్డీని ప్రతి ఆరునెలలకు అంటే ఏప్రిల్30న మరియు అక్టోబరు 31 న ఈ క్రింది రేట్లపై చెల్లించబడుతుంది.

| | | |
|---|---|---|
| ఒక సంవత్సరానికి | సాలుకు | 13% |
| రెండు సంవత్సరాలకు | సాలుకు | 14% |
| (డైరెక్టర్లనుండి) | సాలుకు | 12% |

1956 కంపెనీల చట్టంలోని సెక్షన్ 58ఏ క్రింద సవరించిన 1975 కంపెనీల నిబంధనల ప్రకారం (డిపాజిట్లు అంగీకరించు విషయంలో) కంపెనీ యొక్క వివరాలు.

I. కంపెనీ పేరు : నాగేశ్వరరావు ఎస్టేట్స్ ప్రైవేట్ లిమిటెడ్, 14—14—21, మల్లిఖార్జునరావు వీధి, విజయవాడ—3

II. స్థాపించిన తేది : 4 మే 1955

III. వ్యాపారము : వార్తాపత్రికలు, ఇతర పత్రికలను అనగా ఆంధ్రపత్రిక, (దినపత్రిక), ఆంధ్రపత్రిక వారపత్రిక (వారపత్రిక) భారతి (మాసపత్రిక)లను విజయవాడ, హైదరాబాద్‌లలోని కంపెనీ స్వంత రోటరీ, మరియు ఆఫ్‌సెట్ ముద్రణ యంత్రములపై ప్రింటు చేసి ప్రచురిస్తున్నది.

IV. మేనేజిమెంటు బోర్డు ఆఫ్ డైరెక్టర్ల కంట్రోలు మరియు సూచనల మేరకు మేనేజింగ్ డైరెక్టరుచే కంపెనీ నిర్వహించబడుచున్నది.

V. బోర్డు ఆఫ్ డైరెక్టర్ల పేర్లు, చిరునామా, వృత్తి :

| | పేరు | చిరునామా | వృత్తి. |
|---|---|---|---|
| 1. | శ్రీమతి ఎస్. కామాక్షమ్మ | నెం. 1, లజ ఎవెన్యూ, మైలాపూరు, మద్రాసు—4. | డైరెక్టర్. |
| 2. | శ్రీ ఎస్. రాధాకృష్ణ (మేనేజింగ్ డైరెక్టర్) | నెం. 1, లజఎవెన్యూ, మైలాపూరు, మద్రాసు—4. | డైరెక్టర్ |
| 3. | శ్రీ ఎస్.నాగేశ్వరరావు | నెం. 1, లజ ఎవెన్యూ, మైలాపూరు, మద్రాసు—4. | డైరెక్టర్. |
| 4. | శ్రీ సి.హెచ్. పూర్ణచంద్రరావు | కేరాఫ్ విజయ పిక్చర్స్, గాంధీనగరం, విజయవాడ—3. | డైరెక్టర్. |

VI గడచిన మూడు ఆర్థిక సంవత్సరములలోని వస్నులు, డివిడెండ్లు కేటాయింపులకు ముందు / తర్వాత కంపెనీ లాభాలు (ఆడిట్ కాబడిన బ్యాలెన్స్ షీట్సు నుండి అంకెలు)

| 1 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|
| షేర్ కాపిటల్ | 2,55,000 | 2,20,000 | ఫిక్స్‌డ్ అసెట్స్ | 12,53,786 | 13,67,727 |
| రిజర్వులు & సర్‌ప్లస్ | 5,91,356 | 5,55,234 | పెట్టుబడులు | 11,545 | 11,545 |
| సెక్యూర్డ్‌లోన్స్ | 13,99,931 | 15,17,165 | కరెంటు అసెట్స్ | 48,22,867 | 41,58,947 |
| అన్‌సెక్యూర్డ్‌లోన్స్ అండ్ డిపాజిట్లు | 2,77,000 | 5,01,000 | లోన్స్ అండ్ అడ్వాన్సెస్ | 1,94,541 | 1,30,248. |
| వర్తమాన అప్పులు కేటాయింపులు | 37,59,452 | 28,75,068 | మిసలేనియస్ ఖర్చులు, లాభాలు. నష్టం అకవుంటు | | |
| మొత్తం | 62,82,739 | 56,68,467 | మొత్తం | 62,82,739 | 56,68,467. |

VIII కరెంట్ లయబిలిటీస్ 30—4—1982. నాటికి 30—4—1981 నాటికి

కేటాయించ బడలేదు.

లెటర్ఆఫ్ క్రెడిట్‌ద్వారా కొనుగోలుచేసినముడిపస్తువులు రు. 5,29,000 రు. 31,79,750

IX డిపాజిట్ల ద్వారా కంపెనీ సేకరించ గల మొత్తం రు. 2,96,000.

X ఆర్థిక సంవత్సరమునకు ముందు రోజున (30—4—1982) ఉన్నటువంటి సగటు డిపాజిట్లు. రు. 1,19,000.

XI ఈ ప్రకటన తేదీనాటికి, అన్‌క్లెయిమ్డ్ డిపాజిట్లు మినహా వోవర్‌డ్యూ డిపాజిట్లు కంపెనీ కలిగియుండట లేదని ఇందు మూలంగా కంపెనీ తెలియ జేస్తున్నది.

XII కంపెనీ ఇందు మూలంగా ప్రకటించు చున్నది.

1. 1975 సవరించిన కంపెనీ నిబంధనలను డిపాజిట్లు (అంగీకరించుటకు) కంపెనీ గౌరవిస్తున్నదని 31,మార్చి 1983వ ఆలోగా డిపాజిట్లు గడువు పూర్తయ్యేలోగా తిరిగి చెల్లించడానికి ఒక జాతీయ బ్యాంకులో అవసరమైన మొత్తం జమ చేయబడినది.
2. డిపాజిట్ల మొత్తాలు తిరిగి చెల్లించే విషయంలో కేంద్రప్రభుత్వం హామీ ఉంటుందనే నిబంధన ఇందులో లేదు.
3. కంపెనీ అంగీకరించిన డిపాజిట్లు అన్‌సెక్యూర్డ్ లోన్స్ ఇవి ఇతర అన్‌సెక్యూర్డ్ లయబిలిటీస్‌తో పాటు పరిగణించ బడతాయి.
4. డిపాజిట్లద్వారా, పునరుద్ధరణ ద్వారా వచ్చిన మొత్తాన్ని కంపెనీ వర్కింగ్ కాపిటల్ క్రింద ఉపయోగించు కొనవచ్చును.

XIII 1. ఈ ప్రకటన, కంపెనీ బోర్డుఆఫ్ డైరెక్టర్ల ఆమోదము మేరకు ఇవ్వబడు చున్నది.
2. ప్రకటన అంశము,కంపెనీయొక్క బోర్డుఆఫ్‌డైరెక్టర్లచే 25.11.1982న జరిగిన సమావేశంలోఆమోదించబడినది.
3. బోర్డుఆఫ్ డైరెక్టర్లచే ప్రకటన అంగీకరించు నపుడు మెజారిటీ సంఖ్యలో డైరెక్టర్ల సంతకంగల ఈ ప్రకటన కాపీని రిజిస్ట్రార్ ఆఫ్ కంపెనీస్, ఆంధ్రప్రదేశ్, హైదరాబాద్‌వారికి రిజిస్ట్రేషన్ కోసం దాఖలు చేయబడినది.

ఫర్ నాగేశ్వరరావు ఎస్టేట్స్ ప్రైవేట్ లిమిటెడ్,

మద్రాసు,

తేది : 25—11—1982.

(సం.) ఎస్. రాధాకృష్ణ

మేనేజింగ్ డైరెక్టర్.

ఝుక్ ... ఝుక్ ... ఝుక్ ... ఝుక్ ... ఝుక్ ...

ప్యాసింజరు రైలు నెమ్మదిగా వంతెన మీద పోతున్నది. వంతెన కింద నీళ్ళు సాయంకాలపు ఎండకు తళతళ మంటున్నాయి.

దూరంగావున్న కొండ, కదుల్తున్న పెట్టెలోంచి దగ్గరకు, కదిలి వస్తున్నట్టుగా కనిపిస్తున్నది. పేరు తెలీని పిట్టలేవో టెలిఫోను తీగలమీద పల్లటీలు కొడుతున్నాయి.

**అటు పక్కవున్న జొన్నచేలో మంచెమీద నిలబడి వడిసెలతో పిట్టలవదిలిస్తూ వయసుకత్తె ఒకతె కూనిరాగం తీస్తోంది.**

మురళీకృష్ణ రైలు పెట్టెలో కిటికీ పక్కగా కూచుని కంటికి కనిపిస్తున్న మనోహర దృశ్యాన్ని చూస్తున్నాడు. ఆ దృశ్యంలోంచి చీల్చుకు వస్తున్నట్లుగా మెల్లగా వో తీయని పాట వచ్చి అతని మనసును తాకింది.

ఎవరా పాట పాడుతోంది ? జొన్నచేను వయసుకత్తె కాదు గదా ? ఉహూ, కానేకాదు, ఆమె నుంచి ఆ కూనిరాగం నుంచి, ఆ జొన్న చేన్నుంచి, ఆ రైలు వంతెన నుంచి, ఆ జీవనది నుంచి అప్పుడే ఆ రైలు ఎంతో దూరం వచ్చేసింది. మరి ఆ పాట పాడుతున్న దెవరూ? కిటికీలోంచి తల వీలయినంత బయట పెట్టి, మువ్వల బయటకు చూశాడు. ఆ సెకండు క్లాసు రైలు పెట్టెలో ఆ పక్కనుంచి వినిపిస్తోంది పాట. రైలు చక్రాల్తో జత కలిపి, బయట పిట్టల గొంతులతో స్వరం కలిపి, కవ్విస్తూ, మురిపిస్తూ, లాలిస్తూ, ఇంతలో ఆరోహణలో, అంతలో అవరోహణలో పాట పాడుతున్న ఆ మనిషి ఆ పక్కనుంచి ఇవతలకు వచ్చింది. వంటిమీద మొలకో చిన్న గుడ్డ చుట్టుకుంది. వయసు పొంగు దాచుకోవడం కోసం వుత్తరీయాన్ని పమిటకొంగుగా కప్పుకుంది. చిక్కు పడుతున్న జుట్టు. ఆ సెంకడ్ క్లాస్ టూటయర్ పెట్టెలో రైలు కుదుపుకు తట్టుకుంటూ, పై బెర్తులను చేతుల్తో పట్టుకుంటూ, వొంటి వంపులను అలవోకగా విరుచుకుంటూ, అలలు అలలుగా పాడుకుంటూ, ఆమె అడుక్కుంటోంది. పై బెర్తు మీద పడుకుని వో చౌకబారు డిటెక్టివ్ నవల చదువుకొంటున్న ఇంద్రసేన్ తన దగ్గరకు వచ్చిన ఆ పాటగత్తె గుండె లోతుల్లోకి చూశాడు. నాలికతో పెదవులను తడి చేసుకున్నాడు. త్రిబుల్ ఫైవ్ సిగరెట్టు పొగను నోటినిండా పీల్చి ఆమె మొహం మీదకు విలాసంగా వూదాడు. "ఇదిగో ! ..." అంటూ వో రూపాయి నోటు ఆమె మీదకు విసిరేసి, కొంటెగా కన్నుకొట్టాడు. అదిచూసి ఆ పాట కత్తె పకపక నవ్వింది. "రసికులే బాబుగోరు !" అంటూ ఉత్తరీయాన్ని దులిపి వక్షస్సుపై కప్పుకుంది.

కింద బెర్తు మీద వున్న మురళీకృష్ణ వాళ్ళిద్దరి చౌకబారు శృంగారమూ చూసాడు. "పాటకత్తె సుమారైన వయసు బిగువులో వుంది. ఆమె కడుపులో ఆకలి వుంది. ఆమె ప్రవర్తనలో ఆశ్చర్యంలేదు" అనుకున్నాడు. "కానీ పై బెర్తు పెద్ద మనిషికేంవచ్చిందీ వేషం చూస్తే చదువుల దొరలా వున్నాడు బుద్ధిచూస్తే పందుకోతిలా వుంది."

"టికెట్ ప్లీజ్ ... టికెట్" టీ. టీ. సీ. తెల్లవేషం వేసుకుని, రసీదు పుస్తకం చేత బుచ్చుకుని, ఒక్కొకరినీ చెక్ చేసుకుంటూ వస్తున్నాడు.

అతణ్ణి చూసి ఆ పాట పాడే బిచ్చగత్తె

గొంతు తడబడింది. ఆమె పాట ఆగిపోయింది. అక్కణ్నుంచి తప్పించుకుని దూరంగాపోబోయింది. కానీ ఆమెను చూడనే చూశాడు టీ. టీ. సీ. అతని దగ్గర ఆదర్శాల లగేజేమీ లేదు. అసలు సిసలు సాదా సీదా మనిషి.

''ఏవే — ఇంకా రాలేదా బుద్ధి నీకు ? — కిందటిసారి వారం రోజులు కటకటాల వెనక్కు తోయించాను కదుటే ! పచ్చి మంచినీళ్లు దొరక్క నకనకలాడిపోయావ్ — బయట పడేసరికి వొళ్లంతా పులిసిపోయిందన్నావ్ — మళ్లీ తయారయ్యావా, సరేలే నువ్వెట్లాచస్తే నాకేం గానీ, ఏదీ నీ టిక్కెట్టు... ? '' అంటూ చెయ్యి చాచాడు. కొంచెంసేపు ఆ చెయ్యి నట్లాగేవుంచి, ''ఇయ్యవేమిటే గుడిసేటిదానా ? — నా చెయ్యి పీక్కుపోతోంది ! '' అన్నాడు కర్కశంగా.

''నా దగ్గర టిక్కట్టు నేదయ్యా – ఇంకా బోణీ కాలేదియ్యాళ ...''

''ఈ రైలుబండీ నీ అబ్బగాడి స్వంతం కాదే, నీ టక్కు టమారాలు నా దగ్గర కాదు, తియ్యి ... తియ్యి ... ! ''

ఆమె ప్రాధేయపడుతోంది. అతను విసుక్కుంటున్నాడు. ఆమె ఏడుస్తున్నది. అతను అధికార దర్పం చూపిస్తున్నాడు. పెట్టెలో వున్న మిగిలిన ప్రయాణీకులకు ఆ దృశ్యం వినోదంగా, విషాదంగా, ఆశ్చర్యంగా, సామాన్యంగా వుంది. ఇంతవరకూ వోపికపట్టిన ఇంద్రసేన్ ఇహ వూరుకోలేకపోయాడు.

''ఆవిడకు రసీదు రాయండి. ఇదిగో డబ్బు!'' వంద రూపాయల నోటును విలాసంగా అందించాడు.

''ఎందుకుసార్ మీరిస్తారు ? '' టీటీసీ వ్యగ్యంగా అన్నాడు.

'' సలహాలనవసరం. ఇయ్యదల్చుకున్నాను ఇస్తున్నాను, రసీదు రాయండి ''

'ఏవే పాటలదానా, ఎక్కడికి రాయమంటావ్ ?'

''బాబుగోరిట్టం !''

ఇంద్రసేన్ కళ్ళు మెరిశాయి. అతని పెదిమలమీద చిరునవ్వు మొలిచింది.

''వచ్చే స్టేషన్లో నేను దిగుతున్నాను. అక్కడికే రాయండి !''

టీటీసీ టిక్కట్టు రాసిచ్చి ''ఆ మూలకు పోయి కూచో'' అన్నాడు కటువుగా. ఆ పాటకత్తె అవతలకు కదిలింతర్వాత, ఇంద్రసేన్ కు చిల్లరిస్తూ, ''బజార మనుషుల్ని గురించి జాలి పడితే రోగాలంటుకుంటయ్ ! '' అన్నాడు అన్యాపదేశంగా.

''ఏవిటంటున్నారు ?'' అన్నాడు ఇంద్రసేన్ కోపంగా.

''మిమ్మల్ని గురించికాదు బాబూ ! నా అనుభవంలో జరిగింది ఒకటి జ్ఞాపకంవచ్చి సేపట్నా అనుకున్నాను !''



ఆ మాట విన్నవాళ్ళల్లో ఆసక్తి పెరిగింది. ''ఏవిటేవిటి ఆ అనుభవం ?'' అంటూ ''చెప్పి తీరవలసిందే''నంటూ అతణ్ని బలవంతపెట్టారు.

టీటీసీ జర్దాకిళ్ళీ వేసుకున్నాడు. ఓ చోట సర్దుకుని కూచుంటూ అన్నాడు.

''రెండేళ్ళ క్రితం తుఫానొచ్చింది జ్ఞాపకం వుంది కదా ?''

''వుంది వుంది !''

''అబ్బో, ఏం తుఫాను, ఏం తుఫాను !''

''ఇళ్ళకు ఇళ్లే కొట్టుకుపోయాయి.''

''ఆ! ఆ తుఫాన్‌లో ఈ రైళ్ళేనాలుగైదు స్టేషన్లవతల ఆపేశారు—నడిపిస్తే ప్రమాదమని. ఆ స్టేషనుకు ముందు స్టేషన్లో నేను దిగిపోయాను; రైలును ఆపేసిన స్టేషను పెద్ద స్టేషను నేను దిగింది చిన్న స్టేషను !''

''మీరెందుకు దిగిపొయ్యారు ముందుగా?'' ఎవరో వింటున్న వాళ్లలో ఒకరడిగారు.

''మా సొంతూరు ఇక్కడికి దగ్గరకాబట్టి, ఎట్లాగో అట్లా మా స్వంత వూళ్ళోకి వెళ్ళ గలిగితే, వెచ్చగా ఆ రాత్రికి పడుకోవచ్చుకదా అని. పైగా ఆ రైలును అవతల స్టేషన్లో ఆపేస్తున్నారని ముందుగానే తెలిసిపోయింది గాబట్టి !''

''ప్యాసింజర్సును వాళ్ళ మానానికి వాళ్ళను వదిలి మీ సంగతి మీరు చూసుకోవడం తప్పు కాదూ ?'' ఇంద్రసేన్ అన్నాడు పరుషంగా.

''ఆపదలో ఆత్మరక్షణ ఆ సమయంలో ఇంకొకర్ని గురించి ఆలోచించే వ్యవధానం ఎక్కడుంది ? ఒకచెంప వురుములు, మరోచెంప మెరుపులు. కుండపోతగా వాన. నేల ఫెటిల్లు మంటూ బద్దలవుతున్నట్టుగా వుంది. స్టేషన్ గజగజ వణుకుతోంది.''

''సరే, సరే. ఆ తర్వాత ఏం జరిగిందో చెప్పండి !'' వో యువకుడడిగాడు.

''ఆ స్టేషన్లో నేను దిగానా ?... ఆ రాత్రికి ఇహ ముందుకి పోలేక అక్కడ తలదాల్చు కున్నాను, వెయిటింగ్ రూంలో ! కటిక చీకటి. గుంయ్ మంటూ గాలి. ఆ సమయంలో ఓ మనిషి ఆకారం లోపలకు వచ్చింది. ''మూసేయ్ మూసేయ్'' అంటూ నేను తలుపుల్ని మూసే మన్నాను. ఆ మనిషి తలుపుల్ని మూసేస్తుండ గానే విస్సురుగా ఓ గాలి కెరటం వచ్చి ఆ మనిషిని ఒక్కతోపు తోసింది. ఆ మనిషి నా మీద వచ్చి అమాంతం పడిపోయింది.''

''ఆవిడ ఆడమనిషా ?'' రెండు నోళ్ళు ఆశ్చర్యంతో తెర్చుకున్నాయి.

''ఆడమనిషి అని మీద పడేదాకా నాకు తెలీలేదు సుమా ! ఇంతలో గాలికి తలుపులు మూసుకుపోయాయి చీకటి. చలి. మీదపడ్డ శరీరం వెచ్చదనం.''

ఆ మాటలు విని కిసుక్కున నవ్వారు కొందరు. ఆడవాళ్ళు మొహాలు అవతలకు తిప్పు

# జీ వ న ము ర ళి

కున్నారు. వయసు మళ్ళినవాళ్ళు, ''సరే, సరే... ఆ తర్వాతేం జరిగిందీ ?'' అంటూ అడిగారు.

''జరగడానికి ఏముందీ?'' టీటీసీ మొదలంకించాడు. ''మెళకువొచ్చింతర్వాత చూసుకుంటే గాలీ, వానా తగ్గాయి. విరిగిన చెట్లూ, కూలిన షెడ్లూ, పడిపోయిన స్తంభాలూ. గదిలో ఆడ మనిషి లేదు. నా జేబులో పర్సులేదు.''

''అయ్యయ్యో!'' అన్నాయి కొన్ని కంఠాలు సంయుక్తంగా.

''అంతేకాదు. ఓ నెల రోజులపాటు డాక్టరు చుట్టూ తిరిగి నేను ఇంజెక్షన్లు చేయించు కోవాల్సివచ్చింది. నాలుగైదు నెలలపాటు నేనూ మా ఆవిడా వేరు వేరు గదుల్లో పడుకోవల్సి వచ్చింది !''

టీటీసీ తన కథనం పూర్తిచేసి, ''దీని నీతి ఏవిటంటే ... '' అంటూ ఏదో చెప్పబోయాడు. ''తెలుస్తూనే వుంది కదా !'' అంటూ వింటున్న వాళ్ళు తమ తమ స్థానాల్లోకి వెళ్ళిపోయి, తమ పనులు తాము చూసుకోవడం మొదలెట్టారు.

టీటీసీ మళ్ళీ తన చెకింగ్‌ను ఉపక్రమించాడు. టిక్కట్ ... టిక్కట్ టికెట్ ప్లీజ్ ...

మురళీకృష్ణ ప్రక్కన వో ముసలాయన కూచునివున్నాడు. ఆ ముసలాయన గడ్డం బాగా పెరిగివుంది. కళ్ళల్లో ప్రాణాలున్నట్టున్నాయి. మాసికలు పడ్డ చొక్కా. మాసిపోయిన ధోవతి. కాళ్లకు టైరు చెప్పులు. చేతికి మురుగు, కాలికి కడియం అతణ్ని పల్లెటూరివాడిగా ప్రకటిస్తున్నాయి. వయసు అంతగా ముదిరిపోక పోయినా, అనుభవాల ముడతలు అతని నుదుటిపై చోటు చేసుకోవడం అప్పుడే ప్రారంభించాయి.

''ఏదయ్యా నీ టిక్కట్ . . ?'' టీటీసీ అతన్ని అడుగుతున్నాడు.

''నేదు బాబూ !''

''అంటే ? ... ''

''కొన్నేకపోయినా తండ్రీ !''

''అయితే పెనాల్టీ కట్టు !''

''డబ్బు నేదు నాయనా !''

టీటీసీకి వొళ్ళు మండిపోయింది. రూక్షంగా అతణ్ని దబాయిస్తూ, డబ్బుకోసం వత్తిడి చేయడం మొదలెట్టాడు. టీటీసీ తనను అంటున్నవన్నీ వింటున్న ఆ ముసలాయన కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి.

''నాను డబ్బెగ్గొట్టేవోణ్ని కాను బాబూ ! టిక్కెట్టులేని ప్యాసింజెర్ని కానేకాను. మా అబ్బాయి హైదరాబాదులో వున్నాడు. 'అరజెంటుగా వొచ్చిపోవాలే నువ్వు' అంటూ కార్డుముక్క రాయించేడు. సేతుల్లో డబ్బుల్లేక పోయినా, నా ఆడదాని మంగళసూత్రం తాకట్టెట్టి, టిక్కట్టు కొనుక్కోని బయల్దేరినా. కానీ నాకన్నా నిష్టదరిద్రుడెవడో వున్నాడు.

ఆడికి నా డబ్బులే కావాల్సివొచ్చినయ్—డబ్బులూ, టిక్కట్టూ కొట్టేసినాడు. సూడు తండ్రీ !'' అంటూ అతను తను ధోవతికి నడ్డిదగ్గర కట్టుకున్న ముడిని చూపించాడు. ''ఈ ముడికే వుందా మూట. మూట పోనాది, ముడి మిగిలి పోనాది !''

''ఇటువంటి కథలు చాలా విన్నాం ముసిలయ్యా — తీ — తీ — డబ్బులు — నాకు అవతల పనుంది'' టీటీసీ తన దబాయింపూ, జబర్దస్తీ మానలేదు. ఆ వృద్ధుడు బతిమాలు తున్న కంఠంతో తన దీనావస్థను వివరించడమూ ఆపలేదు. టీ టీ. సీ. కి విసుగెక్కువైంది, కోపం ముసుగేసింది. ''అయితే నీ ఖర్మ. వొచ్చే స్టేషన్లో నిన్ను దింపేస్తా !'' అన్నాడు కర్కశంగా.

''బాబ్బాబు ! అంతపని సేయమాకు. నచ్చి నీ కడుపున పుడతా. నగరంలో నా కొడుకు వొచ్చే పేణంతో, పోయే పేణంతో ఆసుపత్రిలో అట్టెట్టుగా వున్నాడు. నానెళ్లాల, ఆడికి మందూ మాకూ సూడాల, ఆడు బెతకాల. ఆడునేకపోతే, మా ముసిలోళ్ల బెతుకులకు అర్థమే వుండదు తండ్రీ ! '' ఘొల్లుమన్నాడతను.

''అయితే నన్నేం చెయ్యమంటావ్ — నా జేబులో నుండి పెట్టుకోమంటావా ? లేకపోతే టిక్కట్టు లేకుండా నిన్ను తీసుకెళ్లి స్పెషల్ స్క్వాడ్ వస్తే నా ఉద్యోగం వూడగొట్టుకో మంటావా ?''

''బాబూ, బెర్తు మీది బాబూ, ఆ ముక్కూమొహం తెలీని పాటలు పాడే ఆడకూతు రుకు టిక్కట్టు డబ్బులిచ్చి సాయం చేసిన దర్మాత్ముడివి. నా గోడు కాస్త ఇనుకో బాబూ!''

ఇంద్రసేన్ ఆ మాట విని సరదాగా నవ్వాడు. ''ఊఁ! విన్నాను. ఏం చెయ్ మంటావ్ ?''

''కసింత సాయంసెయ్ తండ్రీ !''

''నువ్వేచెప్పావ్ కదుటయ్యా, ఆవిడ ఆడకూతురని — అందుకని సాయం చేశాను. నీకేం, మగవాడివి, ఎక్కడ దింపేస్తే అక్కడ దిగిపోయి, మరో బండెక్కు.''

''ఈ రూట్‌లో రోజుకంతా ఇదొక్కటే బండి తండ్రీ ! — నన్ను కాపాడు.'' ఆ ముసలి గుండె, ఆసుపత్రిలో దిక్కులేకుండా పడివున్న కన్నకొడుకును చూసుకోడానికి హడావిడిగా బయల్దేరిన ఆ ముసలి ప్రాణం, కట్టుకున్న దాని మంగళసూత్రాలను తాకట్టుపెట్టి ఆ తాకట్టు సొమ్మును పోగొట్టుకున్న ఆ ముసలి మనిషి, దీనంగా ''నన్ను కాపాడు తండ్రీ !'' అన్న కేక ఇంద్రసేన్‌కు నవ్వు తెప్పించింది, వింటున్న వాళ్లను తమను కాదన్నట్లు తలల్ని అవతలకు తిప్పుకునేట్లు చేసింది. అతణ్నిలాగి నుంచోపెట్టి 'పదపద' అని టీటీసీ చేత అనేట్లు చేసింది

అప్పుడు కలగజేసుకున్నాడు మురళీకృష్ణ.

పర్సుతీసి మూడు పదులనోట్లు చేత్తో పట్టుకున్నాడు "టీటీసీగారూ! ఈ డబ్బు తీసికుని, అతనికి హైదరాబాదుకు రసీదు రాసివ్వండి !"

టీటీసీ మురళీకృష్ణ వేపు 'ఎవరీ చాదస్తుడు ?' అన్నట్టుగా చూసి మళ్ళీ 'నా కెందుకులే!' అన్నట్టుగా రసీదు రాసి చింపి ముసలాయనకిచ్చి ముందుకు కదిలిపోయాడు.

అనుకోని చోటునుండి, వూహించని మనిషి దగ్గరనుంచి వచ్చిన సానుభూతికీ, సహాయానికీ ఆ ముసలాయన గుండె ద్రవించింది. "నిన్ను ఆ రామయ్య తండ్రి సల్లగా సూత్తాడు బాబూ ! దేవుళ్ళా వొచ్చావ్, ఏ సల్లని తల్లి కన్నదో నిన్ను— పది కాలాలపాటు పిల్లాపాపల్తో భద్రంగావుండు నాయనా !"

అతని పొగడ్త తనకంతగా రుచించ దన్నట్టుగా మురళీకృష్ణ ఆ సంభాషణను తుంచేశాడు. "జాగర్త తాతా ! నేనీ పక్క స్టేషన్లో దిగిపోతున్నాను. నా సీట్లో కూర్చో!"

"ఎవురి బిడ్డవో సెప్పునాయనా, మా అబ్బాయికి నయమైం తర్వాత పంపించేత్తాడు!"

"పంపించడం గురించి దిగులు పెట్టుకోకు. అసలు ఆ ఆలోచనే వద్దు. ఇదేం వందలా, వేలా – మనిషికి మనిషి సాయం. అంతే! ముందు మీ అబ్బాయికి జబ్బు నయం చేయించుకో !"

ఆ ముసలాయన రెండు చేతులూ ఎత్తి నమస్కారం చెయ్యబోయాడు. మురళీకృ అవి రెండూ దగ్గరకు చేరకుండా పట్టుకున్నాడు. "నువ్వు పెద్ద వాడివి, నాకు నమస్కారం చెయ్య కూడదు."

"నువ్వు వయసుకు సిన్నవోడివే కావచ్చు, బుద్ధికి దొడ్డవు బాబూ, దణ్ణం పెట్నా తప్పు నేదు !"

రైలు కూతపెట్టుకుంటూ తన వేగం తగ్గించుకుంటున్నది. మురళీకృష్ణ తన పెట్టే, హోల్డాలూ చేతిలోకి తీసుకుంటూ లేచి నుంచున్నాడు. పైనుంచి ఇంద్రసేన్ కూడా కిందకు దిగాడు. తన వీఐపీ చేతబట్టుకుంటూ ద్వారం దగ్గరకు నడిచాడు. అక్కడే పాటకత్తె నిలబడివుంది. ఆమెను చూస్తూ నవ్వాడు. "నే దిగుతున్నా !" అన్నాడు అర్థవంతంగా. "నానూ ఇక్కడే దిగుతున్నా !" అన్నదా పాటకత్తె వొళ్ళంతా విరుచుకుంటూ.

## 2

రైలు వచ్చి ఆగినా ఆ స్టేషనుకు చైతన్యం రాలేదు. తాతల నాటి చింతచెట్టు కింద చీకటీ, ప్లాట్‌ఫారం సిమ్మెంటు బెంచీల మీద దుమ్మూ అలాగే వున్నాయి. ఆకాశంలో పక్షులు అస్తమిస్తున్న సూర్యకాంతిలో గుంపులు గుంపులుగా ఎగిరిపోతున్నాయి— నిశ్శబ్దంగా. స్టేషన్లో నుంచి కూలీ బయటకు వచ్చి నింపాదిగా నడుస్తూ వెళ్ళి లైన్ క్లియరెన్స్ ఇంజను డ్రైవరుకు అందీ బోతున్నాడు. ఏ. యస్. యమ్. బద్ధకంగా వొళ్ళు వొర్చుకుంటూ బయటికి వచ్చి పచ్చజెండా వూపబోతున్నాడు.

"ఓయ్యోయ్ కూలీ! కొంచెం ఆగు. కొంచెం ఆగు, బండీనెల్లనీమాక !" కొందరు పరుగెత్తుకుంటూ స్టేషన్లోకి వచ్చేసేరు.

"ఎసిస్టెంటు స్టేషను మాష్టరుగారూ! మా దొరబాబు గారొచ్చేసేరు ఈ రైలు బండీలో! ఎక్కడ, ఎక్కడున్నారండీ ?" – అంటూ మరికొందరు వగరుస్తూ అడిగారు, హడావిడి పడుతూ వచ్చి.

"అరుగోరా, దొరబాబు గారల్లదిగో, ఆ పెట్టెకాడ నిలబడ్డారు గుమ్మంలో కనపడ్డం లేదెహె !" వగరుస్తున్న వాళ్ళ గుంపులో ఒక డరిచాడు సంతోషంతో.

అందరూ అటు పరిగెత్తారు. వాళ్ళ చేతుల్లో దండలున్నాయి. కొందరి దగ్గర బుకే లున్నాయి. అందరి మొహాల్లోనూ భయభక్తులు న్నాయి. మొదటి గుంపు మనుష్యులు ఏం చేద్దామా అని ఒక్కక్షణం తటపటాయించారు. ఉన్న నలుగురూ వొకరి మొహాలొకరు చూసు కున్నారు.

"నువ్వెల్లి వెతుకు. వాడటు, నేనిటు." అన్నాడు వాళ్ళలో బట్టతల పెద్దమనిషి. అతని పెద్ద బొజ్జ ఆయాసంతో ఎగిరెగిరి పడుతోంది మెళ్ళో వున్న పులిగోరు అటూ యిటూ కదులు తోంది. చెవుల దుద్దులు ఎర్రగా మెరుస్తు న్నాయి అతని నాలుగు వేళ్ళకూ ఉంగరాలున్నాయి. సిల్కు చొక్కా చెమటకు తడిసిపోయి వంటికి అతుక్కుపోయి, పల్చబడ్డ అతని గుండెల్ని బయట పెడుతోంది. కట్టుకున్న పొందూరు ఖద్దరు ధోవతి సాయంకాలపు ముదురు గాలికి గరగర మంటోంది. అతని కంఠం గరుగ్గా, కరుగ్గా వుంది. చేతుల్లో క్రరలున్న వాళ్ళిద్దరూ వెనక పెట్టెల వేపు పరుగెత్తారు.

"నేను ఇంజనుదాకా వెళ్ళి ఆ ముందు పెట్టెల్లో వుందేమో చూసొస్తానండి !" అన్నారు నాలుగో ఆయన, సరిగ్గా, తప్పుచేసిన వాడిలాగా తలవొంచుకొని.

"చూడ్డంకాదు, వుంటే చెవులట్టుకుని లాక్కురండి !" బట్టతలాయన ఏం చెయ్యాలో సూచించాడు. ఆ సూచన ఆజ్ఞగా వుంది.

"లాక్కు రావడమేకాదు, నరికి పోగులు పెడతాను !" అన్నాడతను తల వొంచుకునే.

"ఆ పోగులూ, బుద్దులూ ఇంట్లో చూసు కుందాం, ముందు వెళ్ళి వెతకండి మామగారూ, రైలు వెళ్ళిపోతుంది !"

"అల్లాగే !" అంటూ తనకన్నా పెద్ద వాడైన 'అల్లుడి' ముందు గొర్రెలా తలవూపి ఆ మావగారు ఇంజను దిసగా తడబడుతూ, గడబిడగా నడిచాడు. ఆ నడవడంలో తన కెదురుగా వస్తున్న మురళీకృష్ణను ఢీకొట్టాడు.

"అయ్యయ్యో, పొరపాటైపోయింది, క్షమించండి బాబూ !" అన్నాడు క్షమాపణగా.

"ఫర్వాలేదులెండి!" మురళీకృష్ణ ముందుకు సాగిపోబోయాడు.

"చూడు బాబూ!" ఆ కంఠం విహ్వలంగా వుంది. ఆ విహ్వలతకు చలించిపోయి మురళీకృష్ణ ఆగిపోయాడు.

"ఎవరన్నావో ఇరవై ఏళ్ళమ్మాయి నీ






పెట్టెలోగాని నీకు కనిపించిందా బాబూ!— అయిదువేలు కట్టుకోవాలి నేను— ఈ వయసులో ఇంత దెబ్బకు నేను ఎల్లా తట్టుకోగలను బాబూ, నువ్వే చెప్పు!''

ఆయన మాటల్లో ఒక్క వాక్యంకూడా మురళీకృష్ణకు సరిగా అర్థంకాలేదు. వెతికితే ఇరవై ఏళ్ళ అమ్మాయిలు తను దిగిన పెట్టెలో చాలామంది వుండొచ్చు. అసలు లేకపోవచ్చు కూడా! అయినా వాళ్లల్లో ఒకర్ని, అథవా వుండివుంటే, తను చూడాల్సిన అవసరం తన కేమిటి? ఇంత దెబ్బకు నేనెట్లా తట్టుకోగల నంటూ విలవిలలాడిపోతున్నాడు, పాపం, ఎంత పెద్ద దెబ్బ తగిలిందో, మరి, ఎక్కడ తగిలిందో! ఈ ఆలోచనలతో అతను ముందుకు వెళ్ళలేక ఒక్కక్షణం అక్కడే నిలబడిపోయాడు. అది అవకాశంగా తీసుకునే ఆయన డగ్గుత్తికతో, "కొంచెం సాయం చేసిపెట్టు నాయనా! నాకు చూపు సరిగా ఆనదు. ముసురుకొస్తున్న చీకట్లలో ఒకవేళ నా కూతురు కనిపించినా నేను కనుక్కోలేకపోవచ్చు!''

ఓహో — అదాసంగతి. మురళీకృష్ణకు కొంత అర్థమైంది. ఆయన తన కూతురు కోసం వెతుక్కుంటున్నాడు!

వీళ్ళిద్దరూ మాట్లాడుకొంటున్న స్థలానికి కొంత దూరంలో, రైలుపెట్టె తలుపు దగ్గర నుంచున్న ఇంద్రసేన్ దగ్గరకు మొదటి గుంపు మనుష్యులు పరుగెత్తారు. ఆయన మెళ్ళో దండలు వేశారు. జేజేలు కొట్టారు. ఆయన సామానులను అతి భక్తితో చేతుల్లోకి తీసుకున్నారు.

"ఏం దొరా, ప్రయాణం సుఖంగా జరిగిందా?

"సెకెండు కళాసులో వచ్చినారేటి దొరా, ఫస్టు క్లాసులో రానేకపోనారా?''

"సదువైపోనాదా దొరా, ఇంక మల్లెక్కడా తమరు పట్నం ఎల్లిపోతాం అనరు గందా?''

వాళ్ళను చీల్చుకుంటూ కర్రపట్టుకున్న మొరటు మనిషి, ఇంద్రసేన్‌ను తోసుకుంటూ, ఆ పెట్టెలోకి గెంతి, లోపలంతా కలియ దిరిగి కళ్ళతో సీట్లకిందా పైనా వెతికి, ధూత్— ఈడానేదు, ఏడకు తప్పుకుందో పిట్ట!'' అంటూ కిందకు దూకాడు.

"ఏరా, కళ్ళు కనబడడం లేదేటి, దొరగార్నే తోసుకు దూసుకు పోతుండావ్?'' గుంపులో ఒకడు రూక్షంగా అడిగాడు, అతని కర్రని పట్టుకుని ఆపుచేస్తూ.

"మీకు దొరైతే నాకేటిగానీ, ఆడపిల్ల ఎవతైనా కనిపించిందేటి?''

"ఆహా కనిపించింది!'' ఇంద్రసేన్ చిలిపిగా అన్నాడు.

"ఎక్కడ, ఎక్కడ కనిపించిది?''

"ఇగో...!''

# జీవన మురళి

ఇంద్రసేన్ ఆ పాటకత్తెను చూపించాడు.

"ఓస్ ఇదా, ఈ పాటల మాలచ్చి మాకు తెలీదేటి?— ఇది కాదు!!''

అతను తన కర్రను లాక్కుని అవతలకు దూసుకుపోయాడు.

"పదండి దొరా, పోదాం!''

"పాటల మాలచ్మి కూడా మనతో నే వస్తుంది, పదండి!'' ఇంద్రసేన్ ముందు నడిచాడు.

గుంపు మొహ మొహాలు చూసుకుంది, ఏదో అర్థమైనట్టు కిసుక్కున నవ్వుకుంది.

"అది మాతో వత్తుంది కాన్దొరా, ముందు మీరు కార్లో ఎల్లడి, ఆ అందరూ మీ కోసం ఎదురుసూత్తన్నాను!''

"ఇంద్రసేన్ పాటల మాలచ్మి వేపు చూశాడు. "రాత్రికి కలుసుకుందాం!'' అన్నాడు హుందాగా.

"దొరా, మీ బంగాళాలో సిగురు దొరుకుద్దా!'' మాలచ్మి అడిగింది లేచి నిలబడి.

"చింత చిగురు ఇప్పుడెందుకూ?'' అన్నాడు ఇంద్రసేన్ అయోమయంగా.

"అది సింత సిగురు కాదు బాబూ, మారాజుల నాటుసారా! తాగితే నాసామిరంగా ..''

ఆ మాట అన్నవాడు పెదాలు తడుపుకున్నాడు.

"ఒంట్లో వగరుకు, పెదిమల మీది చిగురు తోడన్నమాట!'' ఇంద్రసేన్ గలగల నవ్వుతూ ముందు నడిచాడు. వెనగ్గా గుంపు. ఆ గుంపుకు దగ్గరగా పాటల మాలచ్చి. వాళ్లు స్టేషను ప్లాట్‌ఫారం దాటారు. గేటుదగ్గర టిక్కట్టందుకున్న మనిషి "నమస్కారం సార్!'' అన్నాడు ఇంద్రసేన్‌తో వినయంగా. ఆ నమస్కారం అందుకున్నట్టు అతను వొక్కసారి తల పంకించాడు హుందాగా. వాళ్లు స్టేషను బయటకు వచ్చారు. అక్కడో ఇంపాలా కారు వుంది. కారు పక్కనే డ్రయివరు యూనిఫారంలో వున్నాడు.

"నమస్కారం సార్, నా పేరు కోడె నాయుడు. డ్రయివర్ని'' అన్నాడు అతను చేతులు కట్టుకుని.

"ఇక్కడే నిలబడ్డావేం?''

"అందరూ దొంగెదవల్సార్! కారెక్కే వోళ్లంటే రోడ్డుమీద నడిచేవాడికి కళ్లమంట. ఏ ఎదవన్నా ఇట్టా అన్నాడంటే కారు మీద గీతలడిపోతాయ్. ఆ గీతలు కారు మీద కాద్సార్, నా గుండెమీదే అనుకుంటాన్నేను. అందుకే ఇక్కడే నిలబడ్డాన్సార్ — మీ కోసం ఎదురు చూస్తూ!''

"ఎవరో ఒకరు ఉండేవాళ్లు కాదుటోయ్, నువ్వే కాపలా కాయాలేపేటి?''

"అమ్మమ్మా!—అట్లా అనకండి బాబూ! ఎవడో వుంటాడిక్కడ, కారెక్కలేని ఎదవ! దమ్ము పీలుస్తూ ఆ చెట్టుకాడ తొంగుంటాడు అంతలో జరగరాని ఘోరం జరిగిపోతుంది. ఎవరో తుంటరెదవ కారుమీద రాయి ఇసిరేస్తాడు. కారుకు మచ్చొతుంది. ఆ మచ్చ కారుకు కాద్సార్, నా బతుక్కు!''

డ్రైవరు కోడె నాయుడు కారు తలుపు తెరిచాడు. ఇంద్రసేన్ లోపల కూచోబోయాడు

"ఉండండుండి సార్! మొదటిసారిగా మీరీ కార్లోకి అడుగు పెడుతున్నారు. చదువులు ముగించుకుని స్వంత ఇంటికి తిరిగొస్తున్నారు అందుకని కుడికాలు ముందుపెట్టి ఎక్కండ్సార్, వర్జ్యం రాకుండా ఇంటికి తీసుకువెళ్లిపోతాను!''

"ఇల్లా?!''

"అదేసార్ — బంగళాకి!!''

"సరే పోనీ!''

ఆ పాత మోడల్ ఇంపాలా ముందు కొంత మారాంచేసినా తర్వాత బుద్ధిగానే దార్లోకి వచ్చింది. అడవి దారి గుండా ముందుకు దూసుకుపోయింది, వెనగ్గా దుమ్ములేపుతూ.

"నేనెట్టా?'' అన్నది మాలచ్మి విసుగ్గా "కార్లో ఎడితే సరిపోయేది! నే నడవలేను.''

"నడవకపోతే మా బుజాల మీద కాకో — బుద్ధిగా తీసుకపోతాం!'' అన్నాడు గుంపులో ఒకడు. మాలచ్మి నవ్వింది. "మీరూ రసికులే! ఒయబ్బో!'' అన్నది.

గుంపు ముందుకు నడిచింది.

లైన్ క్లియర్ ఇచ్చినా, పచ్చజెండా వూపినా రైలింకా కదలదేమిటి చెప్మా అని ఏ. యస్. ఎం. బద్ధకంగా ఇంజను దగ్గరకు నడిచి "ఏమైంది శ్యామ్యూలా?'' అని అడిగాడు ఆవులిస్తూ.

"గఫూర్ కిందికి దిగెల్లాడు సార్ — ఇంకా రాలేదు!'' అన్నాడు శామ్యూల్ మండుతున్న పొయ్యిలో పారతో బొగ్గు వేస్తూ.

"అవున్లే — నాడికి ప్రతి స్టేషన్లో వో స్టెపినుంటగా, మర్చిపోయ్యాను. ఈ పెద్దిల్లు— చిన్నిల్లు మనుష్యులతో ఇదేనయ్యా చిక్కు!''

ఆ మాటలు పూర్తి కాకుండానే గఫూర్ వచ్చాడు, చేతిలో వో కుందేలును పట్టుకుని.

"ఇదెక్కడిది భాయ్?''

"బీబీ నాంచారిచ్చిందిలే! రాత్రికి ముంతాజ్ ఇంట్లో ఖుషీ!''

ఇంజనుచేత కూతవేయించాడు గఫూర్ బ్రేకులు వదులు చేశాడు. మీట లాగాడు.

చుక్ ... చుక్ ... చుక్.... రైలు బయల్దేరింది.

"రావయ్యా మావయ్యా, మీ కూతురు ఈ బండ్లోలేదు!'' ఉంగరాల అల్లుడు బట్టతల గోక్కుంటూ, కళ్ళు చికిలిస్తూ అన్నాడు.

"ఇంకా వెతుకుదాం అల్లుడుగారూ, ఈ అడవిదాటి ఎక్కడికిపోతుంది?'' అన్నాడు పిల్ల తండ్రి దీనంగా.

"దీన్నే దింపుడు కళ్ళాం ఆశంటారు!" బట్టతల ఉంగరాల అల్లుడు మెల్లగా, నిరాశగా అన్నాడు. "పదండి. ఇంకా ఎందుకూ ఇక్కడ?"

కర్రలున్న ఇద్దరు కూడా వాళ్ళదగ్గరకు వచ్చారు. "కనబడలేదయ్యా!"

"ఎగిరిపోయిన పిట్ట కంటికి కనిపిస్తే ఇంక ఆ పిట్ట గొప్పదనం ఏముందిరా?"

"ఎగిరిపోయిన పిట్టను పట్టలేకపోతే మన గొప్పదనం ఏముందయ్యా?"

"పిట్టపోయింది సరే, పంజరం కోసం ఎంత ఖర్చుపెట్టాన్రా!"

"పిట్టలేని పంజరానికి మనకెందుకూ ఆముదం? పిల్లతండ్రినే ఇచ్చుకోమనండి!" కర్ర ఝాడించాడు ఆ కర్రను పట్టుకున్నవాడు.

ఆ మాట విని పిల్లతండ్రి వణికిపోయాడు. "మీరిచ్చిన అయిదువేలతో నా ఇంటి తనఖా తీర్చేసుకున్నానల్లుడుగారూ! కొంచెం ఓపిక పట్టండి. పిల్లది ఎక్కడ దాక్కున్నా, రెక్కట్టుకు లాక్కొచ్చి మీ కాళ్ళదగ్గర పడేస్తా. నా మాటను నమ్మండి. నన్ను కాపాడండి!"

"స్టేషన్లో ఈ భాగోతం ఎందుకు మామగారూ, అవతలకు పోదాం పదండి!"

ఘర్షణ పడుతూనే, బతిమలాడుకొంటూనే, విసుక్కొంటూనే, ఝడిపిస్తూనే వాళ్ళు స్టేషను బయటకు వెళ్ళిపోయారు. కొద్ది సేపట్లోనే ఎడ్లబళ్ళ చప్పుళ్ళు వినిపించాయి. మువ్వలు గణగణమన్నాయి. ఛొ... ఛొ... ఛొ... బళ్ళ వాళ్ళ కేకలు. వయసు గిత్తలు రంకెలు వేశాయి చక్రాలు సుళ్ళు తిరిగాయి.

వెళ్ళిపోయిన ఇంపాలా కారువేపు, వెళ్ళి పోతున్న రెండెడ్ల బళ్ళ వేపు, సాగిపోయిన గుంపుల వేపు, ముందుకు దూసుకుపోతున్న రైలువేపు చూస్తూ ముందుకడుగు వేసిన మురళీకృష్ణను గేటు దగ్గర టోకాయించాడు అసిస్టెంటు స్టేషను మాష్టరు.

"ఏం బాబూ, ఎక్కడికి వెళ్ళాలేమిటి తమరు?"

"ఆనందపురమండీ!"

"అబ్బో, చాలా దూరమేనే!" ఆయన పెదివి విరిచాడు.

"బస్సులు లేవాండీ?"

"ఇవ్వాళ ప్యాసింజరు బండి లేటు బాబూ! అందుకని, చీకటడిపోతోందని, రైలు కోసం చూడకుండా బస్సెళ్ళిపోయింది, లాస్ట్ బస్!"

"మరెట్లాగండి!"

మురళీకృష్ణ కళ్ళముందు తనకోసం ఎదురు చూస్తున్న తండ్రి కనిపించాడు. గడప లోకి రాగానే దిష్టి తీయడం కోసం పళ్ళెమ్మూ, ఎర్రనీళ్ళతో సిద్ధంగా వున్న బామ్మ కనిపించింది. తన ఆలస్యానికి బామ్మమీద తండ్రి విసుక్కుంటాడు. తండ్రి మీద బామ్మ విసుక్కొంటుంటుంది. ఎట్లాగైనా సరే తను ఇంటికి వెళ్ళి తీరాలి! రెండేళ్ళ తర్వాత తను వెళ్తున్నాడు. తీరా వూరి సాలిమేర దాకా వచ్చి చెరువుకట్ట దగ్గర చిక్కడిపోయినట్లు, ఇన్ని వందల మైళ్ళూ వచ్చి ఈ రాత్రి వృధాగా ఇక్కడ, ఈ స్టేషన్లో, ఈ అడవి మధ్య, చీకటి చలిగాలుల మధ్య చిక్కుపడిపోతే ఎట్లా?

"పోనీ లారీలేవన్నా వుండవండీ?"

ఏ. యస్. యమ్. వేదాంతిలా నవ్వాడు. "లారీలా?... ఈ వంటరి రోడ్డుమీద చీకటి పడ్డదంటే కాకులు గూడా కనిపించవు. ఇది పనిష్మెంట్ స్టేషను బాబూ! నా ఆనెస్టీకి, పెద్దవాళ్ళ కాళ్ళకు వంగివంగి దణ్ణాలు పెట్ట నందుకు, నాకు రైలు వారిచ్చిన బహుమానం!! ఈ రాత్రికి నువ్విక్కడ వుండక తప్పదు కాదంటే నడక తప్ప మరో మార్గం లేదు. పది మైళ్ళలో వో జంక్షనుంది. అక్కడికి వెళ్తే, నీ అదృష్టం కలిసొస్తే, ఏదన్నా బండి ఆ దారిన వొస్తే, ఆనందపురం వెళ్ళగలవేమో! ట్రై యువర్ లక్!"

"థ్యాంక్యూ సర్, ఫర్ యువర్ ఎడ్వైస్!"

ఒక చేత్తో పెట్టెనూ, మరో చేత్తో హోల్డాల్నూ పట్టుకుని ముందుకు నడిచాడు.

"ఉండగలిగితే నాతో ఈ రాత్రికి వుండి పోవచ్చు. నాకేం అభ్యంతరం లేదు. ఇన్కన్వీనియన్స్ కూడా లేదు!" స్టేషను మాష్టరు మాటలు వెనగ్గా వినిపిస్తున్నాయి.

"అక్కర్లేదండీ — వెళ్ళిపోతాను!" మురళీకృష్ణ బయటకు వచ్చేశాడు.

**(ఇంకా ఉంది)**

---

(1)





ఇటీవల వెల్లటూరు నవరంగ్ చిత్రకళా నికేతన్ నిర్వహించిన చిత్రకళ పోటీలలో స్వర్ణపతకాలు పొందిన చిత్రాలు. 1. 'కామపిశాచి' (శ్రీ టి. వెంకట్రావ్, విజయవాడ.) 2. 'ఋష్యశృంగుని రాగోదయం' (శ్రీ పి. ఆర్. కుమార్, రాజమండ్రి.) 3. 'దీపావళి సంబరం' (కుమారి బి. వందన, గోల్కొండ.)






## కె.సి.ఆర్.ఎస్. — మైదుకూరు

ఈ సృష్టి పుట్టి ఎన్నివేల సంవత్సరాలైంది ?

★ ఏమో తెలియదయ్యా కాని ఒక్కటి చెప్పగలను — నేను పుట్టినప్పుడూ వుందట !!

## ఎమ్.వి.ఆర్. — సుల్తానాబాద్

నీ కన్ను నిన్ను మోసం చేయవచ్చుగాని మనోనేత్రం మటుకు మోసం చేయలేదంటారు. ఎంతవరకు నిజం ?

★ రోజులు మారాయి. ఇప్పుడు మనోనేత్రాలుకూడా తప్పుదారి పట్టిస్తున్నాయి.

## జె. కె. — సుల్తానాబాద్

మంచితనంకూడా వ్యసనంలాంటిదంటారు నిజమా ?

★ నిజమే — మంచితనం చేతకానితనం అనుకునే యీ రోజుల్లో.

## ఎస్. కె. — సునాబేడ

కులమతాలకు ప్రాధాన్యం యిచ్చే మనిషికి దూరంగా వుండడమే మంచిదని నా అభిప్రాయం.

★ అప్పుడీ మానవ సమాజానికే దూరంగా పోవాలయ్యా — యీ రోజుల్లో బ్రతకనేర్చిన వాళ్ళ ఆయుధాల్లా వాడేది — వీటినే !

## ఎమ్.వి. — హైదరాబాదు

ఎదుటివారిని తప్పు పట్టుతూ అవే చేస్తారు కొందరు

★ అంతే. ఎవరినైతే హేళన చేస్తామో— అలాగే మనం తయారయ్యే ప్రమాదం ఎప్పుడూ వుంటుంది

## ఎ. వి. బి. ఏ. — ఏలూరు

దేవాలయంపై బూతు బొమ్మలెందుకు ?

★ మీ భక్తి — రక్తిలలో ఏది బలమైనదో తేల్చడానికి. బొమ్మలు చూస్తూ వుండిపోతారా? ముందు దైవదర్శనానికి ఆత్రపడతారా?! అన్నది తేల్చడానికి.

## ఎస్. కె. ఆర్. — శృంగవరపుకోట

ఈ శతాబ్దంలో తెలుగు సాహిత్యాన్ని ప్రభావితం చేసి సామ్యవాదం వైపు నడిపిస్తున్నది శ్రీరంగం శ్రీనివాసరావు అని సాహిత్య అభిమానులు అంటూంటే— శ్రీ రోణంకివారు గురజాడ ఎప్పుడో సామ్యవాదానికి పూలబాట వేశారంటున్నారు. మీరేమంటారు ?

★ అసలు సామ్యవాదం ఎటుందంటాను ! పుంతదారంటూ ఏర్పడ్డాక రోడ్డువేయడానికేం ఏ కూలీలైనా వేస్తారంటాను. కొత్త దారిన నడవడం ప్రారంభం చేసినదెవరన్నది ముఖ్యం అందుకే.

మీరు ప్రశ్నలు వేస్తే నాకు జవాబులు చెప్పాలని వుంది కోరిక తీరుతుందా ?

★ మీరు సొంత పత్రిక పెట్టుకున్నా తీరదు ! నాకు ఉత్తరాలు రాయడానికే బద్ధకం, ఇక మీకు ప్రశ్నలెక్కడ రాస్తాను ? !

## ఎస్. ఎన్. ఆర్. — బైపల్లి

రోజుకొక కొత్త పత్రిక పుట్టుకొస్తున్నా కొత్త రచయితలకు అవకాశాలెందుకివ్వరు?

★ కొత్త పత్రిక ముందు బ్రతికి బట్ట కట్టాలికద

## ఎమ్. ఎమ్. ఎల్. — మార్టేరు

కొందరు పైకి గర్వంగా కన్పిస్తారు. కొందరు పైకి మెత్తగా కన్పిస్తారు ఎందుకు?

★ అది వారివారి తత్వం. అందుకే నిజ తత్వం గ్రహించడానికి పైపై లక్షణాలు చూసి అంచనా వేయకూడదు

## ఎన్. ఏ. — ఆదోని

మగవాళ్ళలో ప్రేమ స్వార్థంతో మొదలై ద్వేషంతో ముగుస్తుంది — మరి స్త్రీలో ?

★ పొరపాటు వారిలో ప్రేమ స్వార్థంతో ప్రారంభించి పరమ స్వార్థంగా ముగుస్తుంది స్త్రీలో మొదటి నుంచీ ప్రేమ జాగ్రత్తతో మొదలై పరమ త్యాగంగా సాగుతుంది.

## ఎన్. ఎన్. ఎమ్. — ఆదోని

స్త్రీ కూడా సమాజంలో ఒక ప్రాణి ఆమె యితరులతో మామూలుగా మసలవచ్చు అనేమాట ముఖ్యంగా సాటి స్త్రీల నుంచే యీ యుగంలో వినగలమా ?

★ ఇతరులతో అంటే మగవారితోనా ? స్త్రీలు మామూలుగానే మసులుతారు. కాని దానికి వేయి అర్థాలు కల్పిస్తారు చుట్టూవాళ్ళు దీనిలో ప్రత్యేకంగా—సాటి స్త్రీలనే అనక్కరలేదు

## ఆర్. బి. కె. — రాజమండ్రి

ప్రేమ అతి ప్రమాదకరం అయినది దానికి దూరంగా వుండాలి అంటాను. దానికి మీరేమంటారు ?

★ ఏమంటాను, ప్రేమ యాసిడ్ లా కాల్చనూ కలదు, తల్లిలాగా ఓదార్చనూకలదు — అయితే యిది మీమీ బుద్ధులను పట్టివుంటుంది !

## టి. ఎస్. ఆర్. — ధర్మవరం

ఇటీవల తెలుగులో రాష్ట్ర, కర్చు లాంటి పదాలు చేయి తిరిగిన రచయితలే వాడుతున్నారు. ఇలాటి భాష రచనలో చోటు చేసుకోవడం మీరు హర్షిస్తారు ?

★ అర్థం మారనంతవరకు ఎలా రాస్తే నేం ? ఇది యాంత్రిక యుగం. మానో మిషను సౌకర్యార్థం మనం రాయాలి — అమ్మకైతే. రాసి చదువుకుందుకైతే — మీ యిష్టం అరసున్నలు, బండిరాలతో సహా రాసుకోండి—ఎవరూ కాదనరు.






# మీ స్నానమునందు ఒక క్రొత్తదనము నిచ్చు

## సబ్బు- ప్రేమ్




సుకుమారమైన మీ చర్మ సౌందర్యమునకు ప్రేమ్.
దీని పరిమళము స్వచ్ఛమైన నురగ మీ శరీరమును
ఆహ్లాదింపజేయును

మీ శరీరమునకు మృదుత్వమునిచ్చు సబ్బు-ప్రేమ్.

Imageads-M-1564





జయలక్ష్మి
గుంటూరు వారి తయారీ




ప్రేమ్ - తాజాతనము నందించు సబ్బు.

# చిట్కా




ఆ కాలనీలో ఎవరికి కాలక్షేపం కావాలన్నా, తీరుబడిలాన్నై, తోచకున్నా, అవ్వగారి దగ్గరకు వచ్చేవారు. గంటలు క్షణాల్లా గడిచేటట్టు చెయ్యగలశక్తి అవ్వగారి కబుర్లకున్నది అవ్వగారు గ్రాడ్యుయేటూ, గొప్ప రచయిత్రీ కాదుగాని మంచి సంభాషణా చాతుర్యమున్న మనిషి. తన కాలంనాటి కబుర్లు వినేవారికి ఆ ఆసక్తి కలిగించేట్టు ఎంత అందంగా కథల్లా మలిచి చెప్పేదనీ. గంటల తరబడి చెప్పేది.

"పన్నెండేళ్ళ వయసు. అందులో ఇప్పట్లా బుడబుడక్కల పెండ్లా. మహరాజు రోజుల కదూ ఆ రోజులు. ఎన్ని నగలు ఎన్నిచీరలు పాతికసవర్ల కాసులపేరు. ముప్ఫై కాసుల వడ్డాణం. పన్నెండు కాసుల గజ్జెల ఎట్టెడ." ఇప్పటికే వింటున్న శ్రోతలకు వళ్ళు గగుర్పొడుస్తున్నది.

ఇంకా ఏం వినగలరు, ముప్ఫై కాసుల ఒడ్డాణం. వళ్ళంతాసేగాదు, ఇల్లంతా వూడ్చి నేలం వేసినా ఈ కాలంలో ఈ మధ్యతరగతి కాపరాల్లో ఎవరిదగ్గరున్నదంత బంగారం. మూడేండ్ల కింద పక్షవాతంతో మంచాన పడ్డప్పటినుంచీ సుబ్బమ్మవ్వ హరికథ ఇది. రోజు కోసారైనా తల్చుకుంటుందా యిల్లాలు. మిగిల్న అన్ని కబుర్లూ మామూలుగా నవ్వుతూ చెప్పే సుబ్బమ్మవ్వకు తన పెండ్లి, ఆ నగలు, ఆ వైభవం, ఆ వేడుకలూ తల్చుకుంటే పల్నాటి వీరచరిత్రలో బాల చంద్రుని యుద్ధ ఘట్టం వర్ణించే బుర్రకథ వాండ్లలా వళ్ళు పరవశమయ్యేది.

"అంతేనా. బారెడు బంగారు జడ కూచుంటే నేలతాకేది జడ..."

"మరిప్పుడానగలన్నీ ఏమైనాయవ్వగారూ" వింటున్న శ్రోతల్లో ఒకావిడకు నోరువూరుకోదు మరి ఆరా తియ్యందే. అందులో ఇది బంగారం విషయం.

"అయ్యో తల్లీ ఇంకా యెక్కడున్నదే అమ్మా. రెక్కలొచ్చి అంతా ఎగిరిపోయింది. సామాన్యమా అమ్మా! ముగ్గురు కూతుండ్ల పెండ్లిండ్లు చేశాను. తలోనాల్గు పురుళ్ళూ పోశాను. ముగ్గురు కొడుకుల చదువులాయె. కోడండ్లకు తలో పది కాసుల బంగారం పెడ్తినాయె. మాటలా అమ్మా పిల్లలుగల కాపరమాయె. అంతా ముగిసిపోయింది. ఇక మిగిలిందొకే ఒకటి. ముప్ఫై కాసుల ఒడ్డాణం"

శ్రోతలందరూ వులికిపడేవారు. ముప్ఫై కాసుల ఒడ్డాణం. ఎంత లేదన్నా ఈ ధరల్లో అందులో పాతకాలపు నగ. మంచి బంగారం. ఎంతవుతుందో!

"ఎక్కడున్నది మామ్మగారూ" అడగ్గానే సుబ్బమ్మవ్వ బోసినవ్వు నవ్వేది.

"బాంకీలో వేశానే అమ్మా. ఇంట్లో ఎలా

వుంచటం. అసలే పిదపకాలం'' నిజమేమరి. పట్టపగలే ఇండ్లల్లో జొరబడి దోచుకుపోతున్న ఈ పాడు రోజుల్లో, అంత బంగారం ఇంట్లో వుంచుకోవటం అవివేకమే.

''ఎవరికిస్తారో మామ్మగారు చివరికది'' అనేవారందరూ నవ్వుతూనే.

''ఎవరికో ఎందుకిస్తానే అమ్మా. నా వాండ్లకే. నా పిల్లలకే. ఎవరీ కట్టెకింత గంజి పోసి, ఏగి, ఎత్తిపోస్తారో వాండ్లకే యిస్తాను. పై వాండ్ల కెందుకిస్తానమ్మా''

అవ్వగారు చెప్పింది బాగానే వున్నది వినటానికికాని, ఆ నా అనే వాండ్లెవరూ అని. ముగ్గురు కోడండ్లున్నారు చాకిరీ చేస్తూ. ఎవరికిస్తుందో ముసల్ది.. అందులో అచ్చం కోడండ్లే కాదాయె, ఆడపిల్లలున్నారు ముగ్గురు. ఆడప్రాణం. తల్లి సొమ్ము తలో కొంచెమన్న దంటె...ఇంత చాకిరీ దండగే అయిపోదూ మరి.

ఈ అనుమానంతోనే ముగ్గురుకోడండ్లూ తామడగటం భావ్యం కాదని, ఒకవేళ అడిగినా ముసల్ది మనసులో మాట బయటకు రానివ్వదని తెలుసుగనక బాగా మొహమాటస్థుల ద్వారా అవ్వగారు మూడ్‌లో వున్నప్పుడు లాలనగా అడిగించారు కూడానూ... ఆ ఆడపిల్లలున్నారు నిజమేగాని ఇవ్వనే తల్లీ. ఇచ్చేదంతా ఇప్పటికే యిచ్చాను. ఇన్నాళ్లన్నాన. అనుమూ అక్కరా చూచాను. ఇహ వాండ్ల కిచ్చేదేంలేదు. కొడుకు లకూ ఆడపిల్లలున్నారా. చిన్నా చితకా అంతా సైజువారీగా ఎదిగేవస్తున్నారా. వాండ్లుమాత్రం పరాయివాండ్లా అమ్మా. వాండ్లకే ఆ కాస్తా...

అమ్మయ్య, కోడండ్ల ప్రాణాలిప్పటికి కుదుటబడ్డాయిగాని, ముగ్గురు కోడండ్లలో ఎవరికిస్తుందీ అని. అది తేలాలి ముందు. కోడండ్లు వంతులు వేసుకుని చెయ్యసాగారు అత్తగారి పరిచర్య. అవ్వగారు గుట్టుమనిషి, గట్టిమనిషి కూడానూ. ఇంత బంగారం వంటిన వున్నప్పుడూ ఎవర్నీ తాకనివ్వలేదు. అమ్మినప్పుడూ ఎవరికీ తెలియనివ్వలేదు. అలాగే ఎంత వున్నదో? ఎంత ఖర్చయిందో? నరుడన్నవాడెరక్కుండా జరుక్కొచ్చిందిన్నాళ్లూ కాదు. ఇన్నేండ్లూ. ఆమె చేత్తో ఆమె ఇచ్చిందే దక్కుడు కూతుండ్లకైనా, కోడండ్లకైనా. కూతుండ్లకేమోగాని కోడండ్ల కిది లోలోపల మంటగానే వుండేది. ''తగని బంగారం వుండేదిటగా మీ అమ్మగారి వంటి మీదా ఏదీ కనిపించదేం. ఏం చేసిందంతా...''

కాపరాని కొచ్చిన కొత్తల్లోనే ప్రతి కోడలూ భర్తను వేసిన మొట్టమొదటి ప్రశ్న యిదే. కాపీ కొడ్తున్న విద్యార్థుల్లా ముగ్గురన్నదమ్ములూ ఒకటే మాట... ఏమో అవన్నీ ఎవరికి తెలుసు. ఆడదాని వంటిమీద, అందులో అమ్మ వంటిమీద బంగారంతో మాకేం పని. అయినా కాకున్నా మా పసితనంలోనే ఏ బాధ్యతలూ తీరకుండానే పోయినాడాయె నాన్న. అమ్మే అన్నిటికీ దిక్కయింది. మా ముగ్గురన్నదమ్ముల చదువులు, మా ఆర్గురి పెండ్లిండ్లు అన్నీ ఆమే చూచు కుంది. ఇంకా వుంటుందా బంగారం? నీకూ ఏదో పెట్టిందిగా అందులో. ఇంకా యెందుకీ ఆరాలన్నీ ఇప్పుడు?

వాజలు. ఏరి వాజలు. తల్లి దగ్గర ముప్పై కాసుల బంగారముంటే ఏంజేస్తా వమ్మా! ఎవరికిస్తావ్? అని ఒక్క మాట అడగలేక, ఇలా నిమ్మకు నీరెత్తినట్టు కూచుంటారేం మనుష్యులు, చచ్చుమొహాలు గాకుంటే. ముగ్గురు కోడండ్లూ విసుక్కున్నారు మనసులోనే. అయినా పైకనేను అంత బాగుండదు గదూ. రోజులు జరిగిపోయినా యలాగే. ఎవరి సంసారం వారిదయింది. సంతానం కలిగింది, పెరిగింది. ఖర్చులూ పెరిగాయి దానితోనే.

అవ్వగారేనాడూ ఏ స్థితిలోనూ ఒడ్డాణం బయటపెట్టలేదు. ''అదొక్కటే మిగిలిందమ్మా చివరకు. ఏమో ఎన్నాళ్లుంటానో, ఏ స్థితిలో రాలిపోతానో, కడుపున పుట్టిన పిల్లలున్నారు నిజమే. నాకు చేసి వాండ్లెందు కుసూరుమనాలి. ఎవరు చేస్తారో, కాచిపోస్తారో వాండ్లకేయిస్తా. దేవుడూ మెచ్చుతాడు. ఆత్మకూ శాంతి. ఇహమూ పరమూ కూడా.''

కోడండ్లు ముగ్గురు పైకొక్కమాట అనలేదు. కాని పోటీలుపడి చెయ్యసాగారు అత్తగారి పరిచర్య. అన్నట్టే అవ్వ మంచానపడి మూడేండ్లు వేలాడిందలాగే. అయినా ఏ కోడలూ నోరు జారలేదు. పెదవి దాటితే పృధివి దాటుతుంది. తాను విసుక్కున్నట్టు తెలిస్తే, మిగిల్న యిద్దరూ ఆ వార్త అత్తకు జారేస్తే ఇంకేమైనావుందా! ఇంతా చేసి ముగ్గురూ ఒకరిమీద ఒకరు సి.ఐ.డి. లైనారు. ఏనాడూ ఎవరూ ఒక్క పొల్లు మాట అనలేదు అత్తగారిని.

చివరికేలాగైతేనేం ఆ రోజు వచ్చింది. అవ్వగారు కన్నుమూశారు. ''మహరాజు చావు చచ్చింది. ఆ మూడేండ్లూ మంచాన పడ్డదంతే. ఆ బాధంతా అప్పడే అయింది. చావు మాత్రం. సులభ సూక్ష్మం నిద్రపోయినట్టే. ఎందరి కొస్తుందలాంటి దేవతా చావు. అత్తగారైనా తల్లిలా వుండేది గదూ మాకు. మంచంలో వున్నా, ఎంత నిండు ఇంటికి. ఎంత అండ మాకు.''

ముగ్గురు కోడండ్లూ అత్తనాకాశాని కెత్తేశారు. అవ్వ కూతుండ్లు ముగ్గుర్లో ఇద్దరు దగ్గర వూర్లవాండ్లే. ఒకామె వూళ్లోనే వున్నది. వార్త అందగానే అందరూ వచ్చి చేరారు.

వేళ పొద్దున పోయింది. సహస్ర మాస జీవి. పండు పండి రాలిపోయింది. అయిన వాండ్లంతా వచ్చారాయె. వైభవంగానే జరిగి పోయింది అవ్వగారి అంతిమయాత్ర.

అన్నట్టింతకూ అవ్వగారెవరికిచ్చారు మువ్వల వడ్డాణం... పరామర్శ కొచ్చినవారికిదీ అసలైన విషయమనిపించింది. అప్పుడందరికీ తోచిందీమాట.. అవునన్నట్టు మువ్వల వడ్డాణం అసలింతకూ లాకర్లో ఎవరిపేర వున్నట్టూ... అని ఆరా వచ్చింది ముందు

అంతవరకూ మౌనంగావున్న పెద్దకూతురు రంగంలోకి వచ్చింది. ఆమె అవ్వగారికి తొలి చూలుబిడ్డ. పిల్లలందర్లోకి పెద్దదేకాదు, తల్లి కెంతో ఇష్టురాలూ. కడుపులోమాట చెప్పకునే దిక్కు కూడానూ ఆమె మెల్లగా అన్నది ... అమ్మకు చదువొచ్చా. సంతకం చెయ్యనొచ్చా. నన్ను బతిమాలితే నేనే వేసివచ్చాను బ్యాంకులో నా పేరటే వున్నదది ...

పెద్ద కొడుకెలాగైనా ఒక తరహా మనిషి అంత కుటిలబుద్ధి కాదతనిది.

మరిహనేం అక్కయ్యా. ముప్పై కాసుల ఒడ్డాణమంటుందెప్పుడూ అమ్మ. ముగ్గు రాడపిల్లలూ, ముగ్గురు కోడండ్లూ తలో అయిదు కాసులూ వస్తాయి తీసుకుంటే సరీ...

కూతుండ్లు పలకలేదు గానీ కోడండ్లు గొణిగారు 'అలా అనలేదు' అత్తయ్యగారెప్పుడూ. ఆడ పిల్లలకిచ్చేదేదో మొదటే ఇచ్చేశాను పేచీ లేదన్నారు. ఇక మిగిలిందీ

మిగిల్న యిద్దరాడపిల్లలూ ముఖాలు నల్లగా పెట్టుకున్నా, పైకేమనలేదుగాని పెద్ద కూతురు మాత్రం ప్రశాంతంగానే. సరే పోనీ ఆమె ఇష్టమెలాగైతే అలాగే చేద్దాం. అన్నది. అన్నదంతే చాలు అలస్యమైతే మళ్లీ ఏం గొడవలొస్తాయోనని వెంటనే తెప్పించేశారు ముప్పై కాసుల బంగారం అంతా కలిపి ఒక్కటే నగ. ఈ కాలంలో మధ్యతరగతి కుటుంబాలలో ఎవరిదగ్గరున్నదంత బంగారంతో ఒక్కటే నగ?

అందరూ ఆశ్చర్యంగా చూశారు. మరి ఇదెలా ఎంచటం. మూడు ముక్కలైయ్యాలా..

''అట్టే ఇలా ముక్కలేస్తే ఏమవుతుంది. వస్తువు సొగసు పోదూ. బాగుంటుందా.''

''పోనీ కావల్సినవారెవరూ ఒకర్తీసుకుని మిగిల్న ఇద్దరికి చెరో పది కాసుల బంగారమివ్వచ్చు వస్తువూ వుంటుంది. పేచీ వుండదు'' ఈ సూచనైతే బాగుందిగాని ఆచరణ యోగ్యం మాత్రం కాలేదు. ఎవరి దగ్గరుంది? ఇరవై కాసుల బంగారం ఉన్నదనుకో. చిన్నం చితకా అంతా వూడ్చి ఇవ్వాల్సివస్తుంది. అలా యిస్తే వాండ్లకు దక్కేది ఒక్క వడ్డాణం. మెళ్లోనూలేక, చేతులకూలేక, మరే నగలూ ఎక్కడాలేక, నడుముకో వడ్డాణం. ఛ. ఏం బాగుంటుందనీ ఎవరు చూచినా నవ్విపోతారంతే

''ఏం లాభంలేదు. ఇవేవీ కుదిరే పద్ధతులు కావు. నే చెప్పిందే రైటు. మూడు ముక్కలు చేసి తలో ముక్కో పంచుకోండి'' అందరూ సరే నని తలూపారు.

# చిట్కా

"అసలు ముందు వీరాచార్ని పిలిపించి చూసిద్దాం. దీని విలువెంతో, ఎంత బంగారముందో, ఎంతైనా పాత నగకదా. కొంతకొంతైనా అరిగివుండదా."

వీరాచారి క్షణాలమీద పిలిపించబడ్డాడు. వడ్డాణంవైపు ఎగాదిగా చూశాడు. చేతికి తీసుకుని పరీక్ష చేశాడు. అందరూ ఊపిరి బిగబట్టి చూడసాగారాతని ప్రతిపనీ. చివరకు అటూ ఇటూ ఒకసారి తిప్పి... గీటు పెట్టి చూడమంటారా. . అన్నాడు.

"అదేమిటి వీరాచారీ. ఏమిటనుమానం" వీరాచారి పలక్కుండా గీటుపెట్టాడు.

"నా అనుమానమే నిజం. ఇది నేను చేసిందే, అయిదారేండ్ల కామాలు మామ్మగారు చేయించారు. పద్దెనిమిది తులాల వెండితో చేసి పావుకాసు బంగారం నీరూది యిచ్చాను..." వీరాచారి వివరిస్తుంటే అందరూ తెల్లబోయి చూచారు.

పెద్ద కోడలు గొంతు పెగల్చుకుని.. నిజంగానేనా. ఇది బంగారం కాదా...

వీరాచారి పెదవి విరిచి గీటుపెట్టిన చోటు చూపించాడు. తెల్లగా మెరుస్తున్నది వెండి. ఎవర్నేమనేట్టు. వీరాచారి వెళ్లిపోగానే పెద్ద కొడుకు విరగబడి నవ్వసాగాడు, అందరూ ఆశ్చర్యంగా చూస్తుంటే. చిన్న కొడుకు అన్నవైపు చూచి అర్థమైనట్టు తనూ నవ్వి... మొత్తానికి ముగ్గురు కోడండ్లకూ భలే టోపి వేసిందన్నమాట అమ్మ. మువ్వల ఒడ్డాణమో అని తెగ మురిసి చేశారీ మూడేండ్లూ అత్తగారికి చాకిరీ. వూరకగాదు. వంతులు వేసుకుని మరీ పాపం. చివరకు చూస్తే ఇదీ...

"మేమేం మురిసిపోలేదు. ఇస్తానన్నారు గనుక ఎవరికన్నా ఆశ వుంటుందంతే. లేకుంటే మాత్రం మంచానబడ్డ అత్తగారికి చాకిరీ చెయ్యక వదిలేస్తామా ఏం... " పెద్ద కోడలు లోలోపల బాధ పడ్డా పైకి మాత్రం గుంభనగా అన్నది. మిగిల్ని ఇద్దరు కోడండ్లూ వంత పలికారు. సొమ్మూ దక్కలేదు. చాకిరీ చేయించుకున్న అత్తగారూ లేదు. ఒకమాట అని కసి తీర్చుకుందామన్నా వీలూ లేదు. ఇకనెందుకు కనవసరంగా నోరు పారేసుకోవటం. కనీసం చేశారన్న కీర్తయినా వుండనీ అనుకున్నారు ముగ్గురూ.

"ఇహనేం వాదులాట ముగిసింది ఆడపిల్లలకు మెట్టెలు పుట్టింటి వారే చేయించాలట అమ్మ అనేదెప్పుడూ. ఒడ్డాణం చెరిపించి ముగ్గురూ మెట్టెలు చేయించుకోండి..." పెద్ద కొడుకు ఆగబడుచులకు సలహా యిచ్చాడు. చిన్న వాండ్లిద్దరే వద్దన్నారు.

"అక్కర్లేదులే అన్నయ్యా. బంగారానికి లేని తెగువతనం ఇప్పుడొచ్చిందా ? కోడండ్లనే తీసుకోమను." పెద్దకూతురు మాత్రం వద్దనకుండా అందుకున్నది వడ్డాణం.

"పెద్దదీ, తల్లీనూ. ఆమె వస్తువు తృణమైనా, పణమైనా, మంచిదే గదా." కర్మకాండలన్నీ ముగిసి ఎవరిండ్లకు వాండ్లు వెళ్లిపోయారు. పెద్దల్లుడు నవ్వుతూ "మీ చెల్లెండ్లిద్దరూ వద్దన్నారు గదా ! నీవెందుకు తీసుకున్నావూ ? నీవూ ఏదన్నా ప్లాను వేద్దామనుకుంటున్నావా" అని భార్యను జోక్ చేశాడు. ఆమె కూడా నవ్వింది.

"ప్లాను వేసినా ఇక పారదులెండి. రహస్యమందరికీ తెల్సిపోయిందేనాయె ... అవును ఈ ప్లానందరికీ తెల్సిపోయింది. మరొకటి వెతుక్కోవాలి అనుకున్నదామె మనసులో. ఆరేండ్ల కింద మామ్మగారు పెద్దకూతుర్తో తన బాధ చెప్పుకుంది రహస్యంగా" "ఉన్నదంతా వాండ్లకే పెట్టాను కండలు కరిగేట్టు చాకిరీ చేశాను గదా. ఉడిగికూచున్న ముసలిదాన్ని. ఎవరికీ అభిమానం లేదు. ప్రేమగాదు గదా కనీసం జాలన్నా చూపరు. కాస్త తిరుగుతూ నా పనులేగాదు, వాండ్లకూ సాయమవుతున్నాను.

ఇప్పుడే ఇట్లా వున్నారు గదా. ఖర్మగాలి మంచానైనా పడితే నాగతేమిటి . కూతురు ఓదార్చింది "ఎందుకే అమ్మా అంత భయం నేనింకా బతికే వున్నాను గదే. నాతోపాటు మాకు కలిగింది కలో, గంజో తాగుదువుగాని రామ్మా, నా దగ్గరకు ..."

అన్నది గాని అమ్మగారి మనసు వప్పలేదు. "ముగ్గురు కొడుకులు, కోడండ్లు, మనవలు, మనవరాండ్లు అందరున్నారు. అల్లుడు యెక్కువైన మనిషే కాదనను. మనసులోనైనా ఏమీ అనుకునేవాడు కాదనుకో. అయినా నా మనసుకే నాకు అనిపిస్తుందలా ..."

ఆలోచించి కూతురు సలహా యిచ్చింది. "నేను కొత్తగా కాపరానికి వెళ్లేటప్పుడు నీవిచ్చిన వెండి గ్లాసు, నీ పుట్టింటారు నీకిచ్చిందని చెప్పావు, గుర్తుందా. నీ జ్ఞాపకార్థం దాచుకున్నాను. ఎన్ని పాట్లుబడ్డా మార్చకుండా. ఇరవై తులాలన్నావు. కనీసం పద్ధెనిమిదన్నా వుండకుండా వుండదు. నీ వేలికున్న ఉంగరం ఏ నాటిదో. పాతిక్కాసైనా వుండదూ ! ఏం చేద్దామంటే..."తల్లి చెవులో రహస్యం చెప్పటమ్మే గాదు, చేయించిన మువ్వల వడ్డాణం బ్యాంకు లాకర్లో పడవేసి వచ్చింది కూతురు రెండో చెవికి వార్త అందకుండా.

"అమ్మ ప్రేమ అంత గాఢమైంది కనకే మళ్లీ అందరూ వద్దన్నారు. నా వస్తువు నాకే వచ్చింది ఏ రూపంలోనైతేం..." అనుకున్నదామె మనసులో తల్లి మెదిలి కండ్లు తడి అవుతుంటే.



# కొత్తగొంతులు

— టి.యల్.కాంతారావు

**అరణ్య వృక్షం నీడన**
**అలనాటి సిద్ధార్థుని జ్ఞానోదయం**
**జీవితాల్లో జీవించిన**
**నేటి అర్థుడికి అరణ్య**
**జ్ఞానోదయం**
**నేను సిద్ధార్థుణ్ణీ కాను, —**
**అర్జుణ్ణీ కాను**
**నేను చార్వాకుణ్ణీ కాను —**
**గాంధీనీ కాను**
**నేను మార్క్సునీ కాను —**
**మావోనీ కాను**
**నేను —**
**అందరినీ అర్థం చేసుకొని కొత్త**
**పిడికిలి బిగిస్తున్న వాణ్ణి**
**— జయధీర్ తిరుమలరావు**

1970 తరువాత తెలుగు కవిత్వానికి విప్లవ పదం ప్రాణం పోసింది. మూడు దశాబ్దాల దేశ స్వాతంత్ర్య పాలన సామాన్యుణ్ణి మాన్యుణ్ణి చెయ్యలేక పోయింది. న్యాయం, ధర్మం, చట్టం, సమభావం పేర్లతో స్వాతంత్ర్యం ఉన్నవాడికి ఊడిగం చేస్తూ లేని వాణ్ణి అంపశయ్య నెక్కించింది. నక్సల్‌బరీలో, శ్రీకాకుళంలో, సిరిసిల్లాల్లో, జగిత్యాలలో, గోదావరీ లోయలో ఎక్కడ పడితే అక్కడ అన్నార్తుల, అశాంతుల అసంతృప్తి సాయుధ రూపాన్ని పొందింది. ఆ మార్గంలోనే కవులూ, కళాకారులూ కూడా తమ సాంస్కృతిక వ్యాసంగాన్ని విప్లవ పోరాటాల ఉపరితల కార్య క్రమంగా భావించి ప్రస్థానం సాగిస్తున్నారు.

తిరుమలరావుగారి అరణ్య నేత్రం కావ్యం విప్లవ భావం నేపథ్యంగా, కవితా విష్కృతి వాచ్యంగా పుట్టిన కావ్యం. అరణ్య నేత్రం అని తన కావ్యానికి ఆయన పేరు పెట్టడంలోనే భావ ధ్వని స్పష్టమవుతోంది. కవిత్వం పేరుతో వీరావేశంలో నినాదాలు పాఠకుల నెత్తిని రుద్దటం ఏ ఉద్యమంలోనైనా ఆరంభ లక్షణం. తిరుమలరావుగారు ఈ లక్షణాన్ని అధిగమించి తన భావానికి ఎఫెక్టివ్‌గా ఉండే కవితాత్మకతను ప్రదర్శించారు. ఈ కవితాత్మకత అనేది ఆయన ఉపయోగించిన ఉపమల్లో, రూపకాల్లో, భావచిత్రాల్లో, శబ్ద ప్రయోగంలో అడుగడుగునా కనబడుతుంది. 1970 నుండి 80 వరకూ గల కాలాన్ని దందహ్యమాన దశాబ్దం అన్నారు పెద్దలు. ఈ దశాబ్దాన్ని తిరుమలరావుగారు చూసిన తీరు గమనిస్తే వారి కావ్యోద్దేశం సులువుగా అర్థం అవుతుంది. ఈ దశాబ్దం జన నీరసాన్ని కాల్చి గత శతాబ్దాల చీకటిని వెలిగించి, అరణ్యాల్ని అంటించి, పల్లెల్లో, ఫ్యాక్టరీల్లో వేడి గుప్పిస్తోందని, ప్రపంచ జన అణగారిన తనాన్ని రేపు కాలుస్తుందనీ, ఖండ ఖండాల ఎల్లల్ని మాపి చీకటి జన జీవితాల్ని వెలిగిస్తుందని ఈ దశాబ్దం కాలేది కాదని, కాల్చేదని ఆయన భావిస్తున్నారు. కవితా సందేశం, పంచీకరణీయ నిర్జీవ జడత్వం కాదనీ, కవితలో ప్రతి అక్షరం జీవం కలిగిన జీవ పదార్థమనీ, ప్రతి వాక్కు చేతగా బతికేవాడే కవి అని, కలంలో కర్తవ్యం నింపుకొని, కాళ్ళు ధ్యేయంవైపు మలుచుకొని జన జీవితంలోకి నడవాలని తిరుమలరావుగారి ఆశయం. జాతిపిత వీలునామా లో గాంధీజీ సిద్ధాంతం దేశాన్ని ఏవైపుకు నడిపించిందో వ్యంగ్యంగా చెప్పారు. గాంధీ వేసిన ఖద్దరు నాజీలకు, ఆయన రాట్నం కాళ్ళ ఉరితాళ్ళు వడికేందుకు, సామాన్యుడి మెడలో అహింసా మంగళసూత్రంగా మాత్రమే పనికి వచ్చిందని చెప్తారీయన.

ఇక్కడ — కాలుతున్న కళ్ళు, కాలడం ఆగిన కడుపులు, దారాల నరాల్లో దావాలనంతో ఆకలి అన్వేషణ, తుపాకి బాయినెట్ల మడతల పొట్లకు చితికిన గర్భాలు, దోచుకొని విసిరి వేయబడ్డ ఎదలు, ఒక్కో చెమట చుక్క ఒక్కో ఉక్కు ముక్కగా మారుస్తూ పస్తులుంటున్నవాళ్ళు, అధికార రాజముద్రల పక్కన, అనధికార పేపర్ వెయిట్ గుండాల మధ్య జీవశ్చవాలుగా బతుకుతున్న వాళ్ళు ఎందరో, ఎన్ని దృశ్యాలో కనబడతాయి. ఈ దృశ్యాల మధ్య ఉపన్యాసం అరుపుల్తో జన జాగృతిని నిద్రపుచ్చుతూ, శాసనాల దండాలతో తిరుగుబాట్ల నణుస్తూ, చొంగ కార్చిన పెదాలతో, నిమీలించిన నేత్రాలతో ఓట్లు అడుక్కుంటూ పదవుల నాక్రమించడానికి పాటు పడుతున్న వాళ్ళు, వేళ్ళను తెగ్గొట్టి కాళ్ళకు బేడీ లేసే వాళ్ళు, కాల్లియాన్ని చితగ్గొట్టి చీకటి బట్టీలోకి తోసేవాళ్ళు.



తుమ్మితే పని ఆగిపోయిందని ఫ్యూనుని ఊడబెరికే అధికారులు, బావమరది ఫీస్‌కెళ్ళేవు చెయ్యలేదని టైపిస్ట్ పోస్టే ఎత్తేయించే ఆఫీస రాధములు, శ్రమ ఫలితాన్ని ఇనుప బీరువాల్లోకి నెట్టే వ్యాపారస్తులు ఇంకా ఇంకా అనేకరకాలుగా దేశాన్ని, దాని సౌభాగ్యాన్ని తమ సొంతం చేసుకున్న మహానుభావులు ఎందరో కనబడతారు. ఈ అసమస్థితిని తొలగించడానికి, అన్యాయాలను అరికట్టడానికి, అక్రమాలను ఆపుచెయ్యడానికి ఒక్కొక్కరూ ఒక్కొక్కఅగ్ని శిఖగా జ్వలిస్తే తప్ప సాధ్యం కాదని తిరుమల రావుగారు హృదయంలోంచి నమ్ముతున్నారు. ''ఈ పదేళ్ళ కాలంలో — పార్లమెంటరీ రాజకీయాల, సంస్కరణ వాదాల, భ్రష్టు కమ్యూనిస్టు సంధాల, గరీబీ హటావో మోసాల, జనరహిత జనతా రిక్త హస్తాల దృశ్యాలకు భిన్నంగా — కార్మిక వర్గం నాయకత్వాన కార్మిక వర్గ — రైతాంగ — మధ్య తరగతి ప్రజల సంఘీభావం పునాదిగా నూతన ప్రజాస్వామిక విప్లవోద్యమం మొదలై సాగుతోంది'' అన్నారు రమణారెడ్డిగారు ఈయన కవితా సంకలనానికి పీఠికలో. ఈ నూతన ప్రజాస్వామిక విప్లవోద్యమానికి మోరల్ సపోర్టుగానే కాకుండా ప్రజలను కర్తవ్యోన్ముఖులను చెయ్యడానికి కవులు కావ్యగానం చేస్తున్నారు. ఇది రెండు మార్గాల్లో ప్రయాణం చేస్తున్నది. ఒకటి వచన కవితా మార్గం; రెండు జనం పాటల మార్గం. ఈ రెంటిలో దేన్నీ కాదనటానికి అవకాశంలేదు. దేని ప్రయోజనం దానికున్నది. పాటలు మాండలికంలో కొంత మంది మధ్య తరగతి వాళ్ళకు అర్థంకావు. అట్లాగే వచన గేయాలు శ్రామిక జనుల్లో చాలా మందికి అర్థం కావు. కనుక ఈ రెండు ప్రక్రియలకూ దేని శ్రోతలు దానికున్నారని, దేని పాఠకులు దానికున్నారని భావించటం ఉత్తమం. తిరుమలరావుగారు వచనగేయాన్ని ఎంపిక చేసుకున్నారు. ఆచారాల నకిలీ అలంకారాల, ఖద్దరు రాజకీయాల చెలియలి కట్టల్ని తన్నడానికి శ్రామిక పాద సముద్రాలు బురదకాళ్ల అలలతో ముందుకురుకుతున్నాయని ఆయన వచనగేయంలోనే చెప్పటం మంచిది. వ్యవస్థపై మతం మొండి పాదం, రాజ్యాంగంపై ఇనుపనాడాల స్టాంపు ముద్రలు, ఉక్కు యంత్రాలపై కొజ్జా పాదాల పిచ్చిగీతలు ఉన్నంతకాలం తమ గీతం సాయుధ గీతాన్నే పాడుతుందని, మహావృక్షాలు మండుతున్న తమ అంతరంగాల్ని, అంగాల్ని, అణువుల్ని అగ్గిపుల్లలుగా మార్చి ఈ అసమ వ్యవస్థను దగ్ధించి మహోన్నత మానవతా వ్యవస్థను నిర్మించాలని తిరుమలరావుగారు తిరుగులేని విధంగా చెబుతున్నారు. ★

సీరియల్

# మూగ ముత్యాలు

## యలమంచిలి ఝాన్సీలక్ష్మి

(గత సంచిక తరువాయి)

ఎంతటి దుఃఖాన్నయినా గుండెల్లో యిముడ్చు కోగల శక్తిని అలవరచుకుంది విజయ. తాతగారు చెప్పే పురాణాల్ని శ్రద్ధగా విని సహనాన్నీ, విజ్ఞానాన్నీ తోడుగా తెచ్చుకుంది. ఆ యింట మరో పెద్దదిక్కు లేక పదవ ఏట నుంచే సంసార భారాన్ని నెత్తిన వేసుకుంది. తాత గారికి రెండు మూడు సార్లు పెద్ద జబ్బుజేసినా చలించలేదామె.

"తాతయ్యా! నిన్న మా నుంచి ఆ భగవంతుడు వేరుచేయడు! చేయలేడు! ఏ పాపమూచేయని నిన్ను ఆ దేవుడు నూరేళ్ళు బ్రతకమని ఆశీర్వదించి పంపాడు!" అనేది.

ఆ మాటలు విన్నవారు ఆశ్చర్యపోయేవారు. "గుండె ధైర్యం గలది!" అన్నారు బంధువులు.

"తల్లిలేని బిడ్డలై పోయారమ్మా నా తల్లు లిద్దరూ! పెదనాన్నా! మా చిన్నవాణ్ణి యిల్లరికం తెచ్చుకో! విజయనిచ్చి... ఈ వూరికో కరణమూ దొరుకుతాడు. ఈ యింటికో అండా లభిస్తుంది." అన్నది మేనత్త వరుసైన భద్రమ్మగారు.

సోమయాజులుగారు విజయ నడిగారు.

విజయ పెదవుల పైన చిత్రమైన నవ్వు మెరిసిందొక్క క్షణం —

"అత్తయ్యా! ఇల్లరికం రావడానికి బావ సిద్ధపడినందుకు నాకెంతో సిగ్గుగా వుంది. మనుషులు అభిమానాన్ని చంపుకుని ఆస్తికోసం బానిసలై పోవడం నాకసలు నచ్చదు. తాతయ్య తరువాత కరణంగా రావలసిందెవరో వూరి వాళ్ళు నిర్ణయించుకుంటారు. తాతయ్య ఆస్థి మీకు మాత్రం రాదు. బావని మరో వూరి కరణంగా వేయించు. ఈ వూళ్ళో అలాంటి కరణాలకి చోటు లేదు." అన్నది విజయ సౌమ్యస్వరంతో.

"దీనికి పిచ్చెక్కింది!" అన్నదామె. ఆ మాటే నలుగురితో కూడా చెప్పింది. బంధువు లందరి చెవినీ వేసె వచ్చింది పనిగట్టుకు వెళ్ళి.

"లంకంత కొంపలో ఆ ముసలివాణ్ణి పెట్టుకుని వుండడం మాటలా వదినా! పైగా మా మరదలు చచ్చి దెయ్యమై ఆ యింటే చుట్టూ తిరుగుతోందట! అర్ధరాత్రి 'అంబా' అని ఆవులా అరుస్తుందట! అప్పుడే పిచ్చిది లాంతరు పట్టుకుని చావిట్లోకి పరుగెడు తుందట! ఇంకా నయం నా కోడల్ని చేసుకుని నా బిడ్డ బ్రతుకులో నిప్పులు పోయలేదు!" అని చెప్పింది ఒకరింట్లో.

ఆ మాటే సారధి తల్లి అరుంధతమ్మగారి క్కూడా తెలిసింది.

భద్రమ్మగారు పనులన్నీ మానుకుని అరుంధతమ్మ గారింటికి వెళ్ళింది. పిచ్చిని మరి కాస్త పెంచి చెప్పింది.

"పిల్లక్కాస్త పిచ్చి వున్నా అందాలబొమ్మ! చెంపకు చారెడేసి కళ్ళు! కోటేరులాంటి ముక్కు! బంగారువు ఛాయ! ఆపైన లంకంత యిల్లు! రెండెకరాల పొలం! సారధికి తగిన జోడు!" అనుకున్నది అరుంధతమ్మ భద్రమ్మగారి మాటలు విన్నతరువాత.

అందుకే హైద్రాబాదులో వున్న సారధికి కబురంపకుండానే లగ్నాలు పెట్టించింది.

"అమ్మా! అబ్బాయిని వచ్చి ఒక్కసారి విజయని చూసివెళ్ళమని రాయి! అది వుభయు లకూ మంచిది." అన్నారు సోమయాజులుగారు లగ్నాలు పెట్టేముందు.

"తాతగారూ! మీరలాంటి అనుమానాలేవీ పెట్టుకోకండి! మావాడు నా మాటని కాదనడు. వాడు అపర శ్రీరామచంద్రుడు. ఫోటో చూపించుతాను గదా! అయినా యీ బంగారు బొమ్మని కాదనే బుద్ధిహీనుడెవరండీ! వాడు యమ్. ఏ. పరీక్షలు వ్రాస్తున్నాడు. మధ్యలో కబురెడితే వాడి ఏకాగ్రతకి భంగం కలుగుతుందని యిలా చేశాను. ఆపైన ఉద్యోగం కూడా రెడీగా వుంది. మా పెదనాన్నగారే ఓ కాలేజీ నడుపు తున్నారు! వారే లెక్చరర్‌గా వేసుకుంటానని వ్రాశారు! ఏమ్మాత్రం వీలున్నా మీ సంతోషం కోసం పంపించుతాను! ఏమ్మా! విజయా!

ఫోటో చూశావుగదా! మీ తాతగారిలాగే వాడూ ఆజానుబాహువు! నీ అంతటి ఛాయ లేకపోయినా కనుముక్కుతీరు వాణ్ణి మన్మథుడని ఒప్పించి తీరుతుంది!" అరుంధతమ్మగారి వాక్చాతుర్యం విజయని నోరు మెదపనీయలేదు. సారధి ఫోటోని చూసీచూడనట్లు నటించింది. "నాకన్నా అందమైనవారీయన! ఆ కళ్ళల్లో నవ్వు ఎంత తీవిగా మెరిసిపోతోందో! తాతయ్యకి తగిన మనుమడు!" అనుకున్నది విజయ మనసు.

సారధి రాగానే చెప్పింది ఆ సంబంధం గురించి. యమ్. ఏ. ఫలితాలు తెలిసినతరువాతే పెళ్ళి అన్నాడు. 'కాదు పొమ్మన్నదామె.'

"నువ్వు పాసవ్వకపోతే యీ జిల్లాలో పాసయ్యేవాడే లేడు పొమ్మ"న్నది అరుంధతమ్మ గారు కట్నం తాలూకు పాతికవేలు గుర్తుకువచ్చి!

"సీతా! ఆ అమ్మాయి ఫోటో చూపిం చమ్మా!" అన్నది కూతుర్ని పిలిచి. అప్పుడే ఆమెకు అన్నవరుసైన కృష్ణశాస్త్రిగారొచ్చారు. ఆయన మరో సంబంధం తెచ్చారు. కట్నం అరలక్ష దాటుతుందనగానే సీత చేతిలో వున్న ఫోటోని గభాలున లాక్కుందామె.

"ఈవేళ వర్జ్యంవుంది! రేపు చూస్తాడులే" అని శాస్త్రిగారితో మాట్లాడడం మొదలెట్టింది.

సారధి 'ఆ బెడద తప్పిందనుకుని సంతో షించాడు. సీత విజయ గురించి చెప్పింది. మేనత్తకొడుకుని తిరస్కరించిన విధానం కూడా వివరించింది. సోమయాజులు గురించి అతనికి లోగడే తెలుసు. ఓసారి దూరపు బంధువుల పెళ్ళిలో పరిచయమయ్యారాయన.

"మళ్ళీ మళ్ళీ చూడాలనిపించేంత అందం వుంది విజయలో" అన్నది. సారధి మనస్సులో అనురాగం సన్నాయిలా మ్రోగింది. ఆ సంగతి గమనించింది సీత —

"అందంతోపాటు మంచి మనస్సున్న మనిషి! నువ్వుచూస్తే మళ్ళా అగ్రహారం వచ్చే వాడివిగాదు!" సీత పెదవులపైన చిలిపినవ్వుల కాంతులు తళ తళ మెరిశాయి.

సారధి వూహాలనిండుగా విజయ రూపమే! 'ఫోటో తీసుకురా!' అనబోయి నిగ్రహించు కున్నాడు.

సీత నవ్విందీసారి — కిలకిలా నవ్వుతూనే వుంది ఎంతోసేపటివరకు.

సిగ్గుతో సారధి నోరెత్తలేకపోయాడు. అతని వూహలన్నీ కలిసి తీయని పులకింతలా మారి మనసుని ఝల్లుమనిపించాయి.

"ఆ మహాసుందరి నీ గురించి వేయిసార్లు డిగింది!" అన్నగారిని ఆటలు పట్టించింది మళ్ళీ.

సారధి ఏదో అనబోతూండగా అరుంధతమ్మ గారొచ్చింది.

"ఒరే! సారధీ! యాజులుగారమ్మాయికి పిచ్చివుందట. శాస్త్రిగారు మరో సంబంధం తెచ్చారు. ఒక్కతే కూతురట. అరలక్షపైగా ముడుతుందట. ఆపైన మువ్వయ్యారు కాసుల

---

**జరిగినకథ — 1:** సోమయాజులు గారి మనుమరాళ్ళు విజయ, రాజ్యలక్ష్మి. సారధితో విజయ పెళ్ళి ఆగిపోయింది. సోమయాజులుగారు ఇచ్చిన డబ్బులో 5 వేలు తక్కువగా సారధి సోమయాజులుగారికి తెచ్చి ఇస్తాడు. అతని ప్రవర్తనకు ముగ్ధులయ్యారు సోమయాజులుగారు. సారధి విజయ, రాజ్యలక్ష్మిల బాధ్యతను స్వీకరిస్తాడు.

---

బంగారం వుందట. మన సీతక్కూడా మంచి వరుడున్నాట్ట వాళ్ళ తరవున! హైదరాబాదులో ఓ పెద్దడాబా వున్నదట. ఆ డాబా అమ్మి వచ్చిన డబ్బుతో సీత పెళ్ళిచేసుకోమన్నారుట. లక్షణంగా వుందట పిల్లకూడా — కాకపోతే కాస్త మెల్ల వుందట. ఓ కాలు పోలియో వచ్చి సన్నబడి పోయిందిట. అయినా చక్కగా కర్ర సాయం లేకుండానే నడుస్తుందట. ఎర్రగా సూర్య బింబంలా వుంటుందట. శాస్త్రిగారితో చెప్పేశా నందుకే, ఖాయం చేసుకురమ్మని!''

''అమ్మా!'' సీత బాధగా అరిచింది.

సారధి నిశ్శబ్దంగా ఆమె చేతిలో ముక్కలై పోతూన్న విజయ ఫోటోవైపే చూస్తూండి పోయాడు.

''ఒరే! సారధీ! ఇంద, ఈ డబ్బు ఆ యాజులుగారిదే! వాళ్ళ మొహాన విసిరికొట్టేయ్. పిచ్చిదాన్ని కట్టుకునే ఖర్మ మా కెందుకని ముఖాన్నే అడిగిరా!''



''నేనివ్వనమ్మా !'' సారధి నిర్భయంగా అన్నాడు.

అరుంధతమ్మగారు నిర్ఘాంతపోయింది.

''అయితే ఆ పిచ్చిదాన్నే కట్టుకుంటావా?''

''పిచ్చిదని నీ కెవరు చెప్పారమ్మా ?''

''స్వయానా ఆ పిల్ల మేనత్తే వచ్చి చెప్పి వెళ్ళిందిరా !''

''మరెందుకు వెళ్ళి చూసివచ్చావ్ ?''

ఒక్క క్షణం తడబడిపోయిందామె — ఆ తరువాత సంబాళించుకుంది.

''లగ్నాలు పెట్టిన తరువాత తెలిసిందా సంగతి !''

''కానీ సీతతో చక్కగా మాట్లాడిందటగా!''

''పసిపిల్ల దానికేం తెలుస్తుందిరా ? ఆ పిల్ల రాత్రిళ్ళు లేచి 'అంబా' అని అరుస్తూ చావిట్లోకి పరుగెడుతుందట. పగలు మామూలుగానే వుంటుందట ! మొన్ననో రోజున వాళ్ళ పాలేరుని గొంతుపిసికి చంపబోయిందట ఆ పిచ్చిలో ! ఇరుగు పొరుగు వాళ్ళొచ్చి విడిపించారట ! స్వంత చెల్లెళ్ళే చావబాదిందట అయిదారుసార్లు ! అందుకే ఆ పిల్ల చదువు మిషతో హైద్రాబాదులో వుంటోందట !'

సీతకి 'తల్లి' చెబుతూన్న అబద్ధాలు వింటూంటే తనకి పిచ్చెక్కిందన్పించింది. ఆశ్చర్యంతో నోరెత్తలేక పోయింది.

''నేను వెళ్ళి చూసివస్తానయితే !'' అన్నాడు సారధి.

''ఏం నా మాటలపైన నీకు నమ్మకంలేదా? వీళ్ళు మన సీత పెళ్ళికోసం కావలసిన డబ్బిస్తా

ఇటీవల గుంటూరుజిల్లా గ్రంధాలయ భవనంలో ఏర్పాటు చేసిన ప్రముఖ చిత్రకారుడు శ్రీ తులసీరాం కార్టూన్ల, వర్ణ చిత్రాల ప్రదర్శనకి గుంటూరు ఏ.ఎస్.పి. శ్రీ డి. టి. నాయక్ ప్రారంభోత్సవం చేశారు. ఆయన సతీమణి డా. ఇందిర చిత్ర కారునికి మొమెంటో బహూకరిస్తున్న దృశ్యం.



## మూగ ముత్యాలు

న్నారు. పైగా ఆ అబ్బాయి బ్యాంకులో ఆఫీసరట ! అంత మంచి సంబంధం మనం సీతకి తీసుకు రాగలమా ?''

''కాన్నీ నువ్వు లగ్నాలు పెట్టించావమ్మా ! ఆ మాట మర్చిపోకు !'' సారధి కోపాన్ని దిగ మ్రింగాడు.

''అయితే సీత పెళ్ళి గావడం నీ కిష్టం లేదుటరా ?''

''నా పెళ్ళి మానేసి సీతకి చేద్దాం !''

''నలభైవేలెక్కడ నుంచి తెస్తావురా ? ఈ పూరికొంప తప్ప మరే ఆధారమూ లేకుండా చేసి పోయారాయన. నిన్ను యమ్. ఏ. చదివించితే మమ్మల్ని అందలా లెక్కించుతావని వున్నదంతా నీకే వూడ్చిపెట్టి పోయారు. ఇపుడే వీధిలో భిక్షం ఎత్తి దాని పెళ్ళి చేయాలో కాస్త చెప్పు.''

''అలాంటి మాట లెందుకమ్మా ? ఆ డబ్బిలా యివ్వు. వాళ్ళకిచ్చి వస్తాను. ఆ శాస్త్రి గారితో చెప్పు, నే నిప్పట్లో పెళ్లికి సిద్ధంగాబోవడంలేదని, అసలు నాగురించి పెళ్లి ప్రయత్నాలే చేయవద్దనిచెప్పు ! ఎవరో డబ్బు యిస్తున్నారని అమ్ముడు బోవడంకన్నా చావడం మేలు !''

సారధి గుండెల్లోని తీయతీయని వూహలన్నీ క్షణంలో కరిగిపోయాయి నిశ్శబ్దంగా.

''నేనెవరికీ ఏమీ చెప్పను ! నాకేంఖర్మరా ! నేనెందుకు చెప్పాలిరా ? వెళ్లు ! వెళ్లి ఆ యాజులుగారి కాళ్లమీదపడి ఆడదానిలా ఏడువు ! ఈ డబ్బివ్వన్నేను ! దయదలిచి వదిలేయమని ఆ పిల్ల కాళ్లట్టుకోపోయి !''

'రాక్షసురిలాగే మాట్లాతారేమో' సీత మనస్సు గొణిగింది.

''అమ్మలో ... రాక్షసి వుంది !'' కక్షగా లోలోన తిట్టుకుంది.

''నేను నీ కొడుకునని గుర్తుంచుకోమ్మా ! నా కవమానం జరిగితే నీకు గాదా ?'' సారధి గుండెల్లో చెలరేగుతూన్న ఆగ్రహాన్ని అణిచి పెట్టాడతిప్రయత్నం మీదట

''ఎవ్రరా నీకమ్మ ! నీ కసలు కులమే లేదురా ? నీ అమ్మకి పెళ్లిగాక ముందే నువ్వు పుట్టావ్ ! దయదలిచి . చావుబతుకుల్లో వుంటే మేము కాదనలేక పెంచాం ! ఆ మోహాన్ని చంపుకోలేక ఉన్నదంతా నీకు తగలబెట్టి స్వర్గం చేరుకున్నారాయన !'' నిజంగా రాక్షసిలాగే విరుచుకు పడిందామె

సారధి నిశ్చేష్టుడైపోయాడు అతనికి 'ఆ మాట్లాడుతున్నది 'దెయ్యమో, భూతమో' అన్నట్లుంది ఆమె ఏం మాట్లాడిందీ అర్ధం గాలేదతనికి చాలాసేపటివరకు —

''అమ్మా ! .'' నిర్విణ్ణుడై నోరు తెరిచాడు.

'అమ్మా !' అన్న మాట అన్నదీ లేనిదీ కూడా విన్పించనంత నెమ్మదిగా కదిలాయి అతని పెదవులు.

''ఛా! ఫో! నీ చెల్లెలు ఆ హైదరాబాదులో వీధుల వెంట రోజకొకణ్ణి వేసుకుని అచ్చోసిన ఆంబోతులా తిరుగుతోందట ! ఫో ! పోయి దాన్నుద్ధరించు !''

ఇంకా ఏమేమో అనబోతూంటే సారధి చేతులెత్తి దండం బెట్టాడు. అతని కంఠం దుఃఖంతో జీరపోయింది.

''చాలమ్మా ! చాలిక ! ఇంకా చెప్పకు ! నా గుండెలు పగిలిపోతాయేమో ! ఇక్కడే! నీ కళ్ళ ముందే ప్రాణం పోతుందన్పిస్తుందిప్పటికే! నన్ను వెళ్లనివ్వు !... ఆ తరువాత నీ యిష్టం వచ్చినట్లు శపించు! నేను చచ్చాననుకొని శ్రాద్ధకర్మలు కూడా జరిపించు! అమ్మా ! సీతా! వస్తానమ్మా! యాజులుగారికి యివ్వవలసిన డబ్బివ్వాలి ముందు! ఆ తరువాత చచ్చినా నాకు బాధ వుండదు !. నీ కోసం . ఎన్నో కలలు కన్నానమ్మా . ప్చ్! పోనివ్వు ! '' సారధి చెక్కిళ్ళు కన్నీటితో పూర్తిగా తడిసి పోయాయి. పసివాడిలా సీత చేతుల్లో ముఖం దాచుకుని వెక్కివెక్కి ఏడ్చాడు ఎప్పటికో తలెత్తి 'నన్ను వెళ్ళనివ్వు !' అంటూ లోపలికి వెళ్ళి తన సూట్‌కేస్ తీసుకుని బయటికి వెళ్ళిపోయాడు రెండడుగుల్లో.

సీత గుండెలు పగిలిపోయేట్టు ఏడుస్తున్నా వెనుదిరిగి చూడకుండా పరుగెత్తినట్లే ఆ వీధి దాటి వెళ్ళిపోయాడు

''అన్నయ్యని పిలువమ్మా ! అమ్మా ! . అమ్మా!'' సీత గుండెలు కరిగిపోయేట్టు ఏడ్చింది అయినా అరుంధతమ్మగారు కూర్చున్న చోటు నుంచి కదలనే లేదు

''పీడ విరగడయ్యింది !'' హాయిగా నిట్టూర్చిందామె.

''లే ! లోపలికి పద ! ఇక్కడ నునకి అగ్రహారాలేమీ లేవు ! వాడికి కొల్లగొట్టి మేపడానికి ! నలుగురిలో తలెత్తుకు తిరగలేక ఛస్తున్నాను వాడిమూలాన!'' అంటూ సీత నోరు మూయించింది. భయంతో నిశ్శబ్దంగా ఏడవడం తప్ప ఏమీ చేయలేక పోయిందామె.

''అన్నయ్యా ! అమ్మ నీ కింత అన్యాయం చేస్తుందని కలలో కూడా అనుకోలేదురా ! నా కెవరున్నార్రా యిక్కడ ? ఎవరికి చెప్పుకోనురా ఈ గుండెలోని వూహల్ని ? ఒక్క క్షణంలో ఈ అనుబంధాన్ని ఎలా త్రెంపుకుని వెళ్ళిపోగలిగావురా? నువ్వు !? నా ఏడుపు నీకు విన్పించనేలేదా ? ఈ ... సీత ... కి ... యిక ... అన్నయ్య ... మళ్ళీ కన్పించుతాడా ?'' సీత గుండెల్లో దుఃఖం మహాసముద్రంలా ఘోష పెట్టసాగింది. కళ్ళు జ్యోతుల్లా ఎర్రబడిపోయాయి. సారధి పడుకునే మంచంమీదే పడుకుని దుఃఖాన్ని అణుచుకోలేక సతమతమైపోసాగిందామె.




ఏలూరు,
మార్చి–25.

ప్రియమైన అన్నయ్యకి,

నీకిప్పటికి మూడు జాబులు వ్రాశాను. జవాబు మాత్రం ఏ ఒక్కదానికీ రాలేదు. ఆఖరికి నీకీ సీతపైనకూడా కోపం వచ్చిందా? పోనీ ఆ మాటయినా వ్రాయకపోయావా?

నాన్నగారు పదిరోజులకి చనిపోతారనగా ఓనాడు నిన్ను పిలిచి 'సీత బాధ్యత నీది బాబూ!' అన్నారు. అప్పుడు నువ్వు 'సీత నా ఆరోప్రాణం నాన్నగారూ!' అన్నావు. కానీ ఈ నీ ఆరో ప్రాణానికి 'వివాహం జరిగినా' నువ్వు రాను పొమ్మన్నావు! నీ కోసం రాత్రింబవళ్ళు నిరీక్షించాను. సిగ్గు విడిచి ఆయన క్కూడా వ్రాశాను 'అడ్రసు పంపిస్తున్నాను. మా అన్నయ్యని కలుసుకోండి!' అని. కానీ ఆ వుత్తరం అమ్మ చేతుల్లో పడి ముక్కలై పోయింది. ఎవరు మాట్లాడించినా కన్నీళ్ళే వచ్చేవి నాకా నాలుగు రోజులు. "అన్నయ్య రాలేదామ్మా?" అని అడగ్గానే పెదవులు దుఃఖంతో వణికిపోయేవి. కన్నీటి తెరల్లోనుంచి చూస్తోంటే నా కందరూ 'నీలాగే' కన్పించారన్నయ్యా. ఆ మధుర క్షణాలు నా మనసులో నే వూహించినంత ఆనందాన్ని నింపలేక పోయాయి.

ఓ ప్రియ స్నేహితుడ్ని పోగొట్టుకున్న నా మనస్సు ఎంతగా ఏడ్చిందో నీకు చెప్పలేను. నాకు ఊహ తెలిసిన క్షణం నుంచి నా మనస్సుకి నచ్చిన అనుబంధం – నీ స్నేహ మొక్కటే!

నీ మెడచుట్టూ చేతులు పెనవేసి హాయిగా కలలుగంటూ నిదురలోకి జారిపోయేదాన్ని. అమ్మ అయినదానికీ కానిదానికీ పెద్దగా అరుస్తుంటే నాకు భయం వేసేది. 'మా అమ్మ కాదేమో' అన్పించేది. చిన్న తప్పు చేసినా చెంపలు కంది పోయేట్టు కొట్టే అమ్మ అంటే నాకు రానురాను భయంకరమైన స్వప్నంలా కన్పించేది. నాన్ననీ నిన్నూ తిట్టిపోస్తుంటే నా మనస్సు అమ్మని శపించేది. అన్ని తిట్లు తిని కూడా 'అమ్మా' అని ప్రేమగా పిలిచే నిన్ను చూసి ఆశ్చర్యపోయేదాన్ని.

ఆ వయస్సులో నాకు అమ్మవి 'నువ్వేమో' అన్పించేది. అందుకే నీతో నాలోని వూహ లన్నిటినీ విప్పి చెప్పుకునేదాన్ని.

అంత అభిమానంగా ఆరాధించింది నా మనస్సు నిన్ను. నువ్వూ నన్నల్లాగే చూస్తున్న ట్లన్పించేది. 'అమ్మా! సీతా!' అని నువ్వు పిలుస్తూంటే ఆనందంతో నా మనస్సు పురి విప్పిన మయూరమే అయ్యేది. నీ ప్రాణంలో ప్రాణంలా బ్రతుకుతున్నా నన్పించేది నీ ఆప్యాయత తలుచుకుంటూన్నకొద్దీ. కానీ నా పెళ్ళి నిన్నలా నా నుంచి దూరం చేస్తుందని నే నేనాడూ వూహించలేదన్నయ్యా. నీ ఆశ యాలకి విరుద్ధంగా అమ్మ సోమయాజులుగారి డబ్బుతో నా పెళ్ళి జేసింది. నీ ఆనందాన్ని బలి జేసి నా జీవితాన ఆనందం నింపాలనుకుంది. కానీ... అదే...నాకు శాపమైపోయిందని అమ్మ కింకా తెలియదు.

శ్రీనివాసుడిలా, సుందరంగా వున్నారని అమ్మ మురిసిపోయింది. కానీ ఆయన... నిజంగా జలంధరుడు నా మనస్సు ఏడ్చినా, నవ్వినా ఆయనకేం పట్టదు. అసలు నేను అన్న మనిషిని ఆ యింట్లో వున్నాననే ఆయనకు గుర్తుండదు.

ఈ సీత ఆ మనిషికి ఏమీ గాదని నాకు మొన్ననే తెలిసిపోయింది పెళ్ళయి అయిదు నెలలు దాటిపోయ్యాయి!

"ఈవేళ అమ్మాయీ నువ్వూ సినిమా కెళ్ళండి బాబూ!" మా అత్తగారు ఓనాడు కొడుకుని పిల్చి చెప్పింది.

వారాని కోసారి వచ్చి వెళ్ళేవారు. పొద్దున్నే వచ్చి సాయంత్రం బయల్దేరి వెళ్ళిపోయేవారు. ఆ రోజున వెళ్ళకుండా వుండిపోయారు! అంతవరకూ నేనూ ఆయనా మాట్లాడుకునే ఎరగం? నాకోసమే వస్తున్నారనుకునేదాన్ని అప్పటివరకు! కానీ 'నన్నెందుకు మాట్లా డించరు?' అన్న ప్రశ్న వేసుకుని విసుగెత్తి పోయాను. ఆ మనిషి నాకోసంగాదు వచ్చేది! మా యింటికి ఎదురుగా వున్న మాష్టరుగారి చిన్నమ్మాయికి మావారి ఆఫీసులోనే వుద్యోగమట! పేరు నీరజ! ఆ అమ్మాయి కోసం యీ రాకపోకలు! వాళ్ళ మేనమామగారికి యిక్కడ రెండు మిల్లులున్నాయి! వాళ్ళ కారొస్తూంటే యిద్దరూ అందులోనే వచ్చేవారు! ఓనాడు ఆ కారు డ్రైవరు మా యింటికొచ్చి మా అత్త గారికి యీ కధంత చెప్పివెళ్ళాడు

నీరజగాక యింకెందరో స్నేహితులున్నారు మావారికి! అందులో చాలామంది ఆడపిల్లలే! అందుకే యీ సీత ఆయనకి గుర్తే లేదు.

వాళ్ళింటి ఖర్చులకి డబ్బు కావాలట! వాళ్ళమ్మగారికో పనిమనిషి కావాలి! అందుకే పెళ్ళి జేసుకున్నానని చెప్పారు నేనడిగితే. "నాకు పల్లెటూరి గబ్బిళాల్ని చూస్తే అసహ్యం! మళ్ళీ నాతో మాట్లాడకెపుడూ!" అంటూ వెళ్ళిపోయారోజున. ఆ రోజునుంచి యింటికే రాలేదు.

ఇదంతా నీ మూలానే జరిగిందిరా! నువ్వు నాకండగా వుంటే యీ పెళ్ళికి నేను అంగీక రించేదాన్నేగాదు. నా మనస్సు ఆందోళనతో, భయంతో వణికిపోయి అమ్మ నుంచి పారిపోవాలని అలా ఒప్పుకున్నాను.

"ఈ యింట్లో నీకు లోటేమిటమ్మా! సిరిసంపదలతో కళకళ లాడుతోంది సంసారం! అబ్బాయికి హైదరాబాదులో పెద్ద వుద్యోగం! ఇల్లు దొరగ్గానే నిన్ను తీసుకు వెళ్తాడు!" అని అమ్మ మురిసిపోతుంది! కానీ ఆ యిల్లు ఎప్పటికీ దొరకదని అమ్మకి తెలియదు నాకిక్కడ సుఖ మన్నదే లేదని తెలిస్తే గుండెలు పగిలేట్టు ఏడు స్తుంది! ఒక విధంగా అమ్మకి యిది శిక్ష!

అన్నయ్యా! ఇంత దుఃఖాన్ని మనస్సు విప్పి పంచుకోడానికి నాకు నువ్వు తప్ప ఎవరున్నారా? ఒక్కసారి నిన్ను చూడాలనుంది! ఈ జీవితంలో రవ్వంత ఆనందం నువ్వు తప్ప నాకెవ్వరూ అందించలేరేమో! ఓసారి వచ్చి వెళ్ళరా? ఈ నరకం నుంచి ఎలా బయటపడాలో చెప్పి వెళ్ళే బాధ్యత నీదేనన్నయ్యా!

మరిచే పోయాను! విజయ నా పెళ్ళికి వచ్చింది. మగ పెళ్ళివారి తరపున! శ్రీనివాస్ ఆమెకు అన్నగారవుతారట! నేను మాట్లాడించాను. నవ్వింది సన్నగా. తాతగారి ఆరోగ్యం బావుండక పోవడం చేత వచ్చానన్నది. నీ గురించి చెప్పబోతూంటే నన్నాపివేసింది.

## ఇవేమన పద్యాలు




ఎంత తడుగ నోటి యెంగిలి పోవునే
నెల్ల కాలమునను నెంగిలియగు
అనుదినంబు జూడ ననృతమాడెడు నోరు
నోరుగాదు క్రింది నోరు వేమ.

"దయచేసి ఆ విషయం గురించి మాట్లాడకండి! నాకే విధంగానూ ఏమీగాని మనుష్యుల గురించి నేనెప్పుడూ ఆలోచించను!" అని లేచి వెళ్ళిపోయింది.

కానీ ఆమె గొంతు సన్నగా వణికింది! ఆ గుండెల్లో ఎంత గాయం అయ్యిందో ఆ వణుకులో ఒదిగిన బాధే చెప్పింది నీ గురించి శ్రీనివాస్ గారికి ఎవరో చెబుతూంటే శ్రద్ధగా వినడం గమనించాను! విజయ మనస్సు నీ గురించి తీయని

## మూగ ముత్యాలు

కలలు కన్నదని ఆమె కళ్ళు చెప్పాయి! ఓ స్నేహితుడి దగ్గర నుంచి పదిహేను వేలు అప్పుగా తీసుకుని సోమయాజులుగారికి యిచ్చావని చెబుతూంటే విన్న విజయ కళ్లల్లో ఆరాధన మెరిసిందొక్కక్షణంపాటు! ఆ పైన నిట్టూరుస్తూ నా దగ్గరకొచ్చింది.

"వెళ్తాస్తాను సీతగారూ! అదృష్టం మనల్ని మళ్లీ వంచించకుండా వుంటే కలుసుకుందాం!" అని చెప్పి వెళ్లిపోయింది.

శశిరేఖ కన్పించిందా? నిజంగా ఆ అమ్మాయి నీకు చెల్లెలేనా? అలా అనుకుంటూంటే నాకెందుకో దిగులుగా వుందిరా! నువ్వునాకు దూరమైపోయినట్లు నా మనస్సు విలవిలలాడిపోతోందేమిటి?

అమ్మ అన్నట్లు ఆ శశిరేఖది అంత విశృంఖలమైన జీవితమా? నిన్నసలు గుర్తుపట్టిందా?

నీ కోసం 'విజయ' దగ్గరకెళ్ళి మనస్సు విప్పి చెప్పాలనుంది! నా మనస్సు 'విజయ'ని పోగొట్టుకోలేనంటోంది!

అన్నయ్యా! ఒక్కసారి వచ్చి వెళ్లరా? ఎందుకురా నాపైన నీకంత కోపం?

ప్రతిక్షణం నా కళ్ళు నీ కోసమే ఎదురు చూస్తున్నాయన్నమాట గుర్తుంచుకో!

వుంటాను మరి –
నీ ప్రాణంలో ప్రాణంలా పెరిగిన
నీ చెల్లాయి—సీత "

సారథి కన్నీళ్లతో అభిషేకించాడాలేఖని. ప్రతిఅక్షరాన్నీ పదేపదే చదువుకున్నాడు.

"అమ్మా! సీతా! నేను ... రాలేకపోయానమ్మా! రాకుండా వుండడానికి నా మనస్సుతో యుద్ధం జేశానని నీకు తెలియదు ఆ రోజంతా నా మనస్సుని రాక్షసుడిలా శాసించాను! ఉపవాసంతో వాలోని అహాన్ని శిక్షించాను!

"ఎవరు నువ్వు?" అన్ని నన్నెవరైనా అడిగితే ఏం చెబుతావని నా మనస్సు నోరు నొక్కేశాను." కన్నీటి తెరల్లోనుంచి సీత నూహించుకుంటూ సమాధానం చెప్పుకుంటూన్న క్షణం శశిరేఖ వచ్చింది—

"ఏమైంది? మళ్ళీ ఏ ద్పు మొహం పెట్టావ్? ఐ హేట్ దట్ బ్లడీ క్రయింగ్!" అన్నది.

ఆ వుత్తరాన్ని మడిచి జేబులో పెట్టుకున్నాడు.

"మనస్సున్న మనిషికి దుఃఖమూ, ఏకాంతమే స్నేహితులమ్మా!"

"అదుగో. మళ్ళా అమ్మా అంటావేమిటి? రేఖా అని పిలవలేవూ. అమ్మా, బొమ్మా అని పిలిచాడిలాగే ఓ పల్లెటూరివాడు. ఒంటరిగా వున్నపుడు 'డార్లింగ్! ఐ లవ్ యూ' అన్నాడు. ఆ తర్వాత మృగంలా ప్రవర్తించాడు. వుత్తపిరికి రాస్కెల్! ఇనస్పెక్టరుకి చెప్పి ఒళ్ళు హూనం చేయించి జైల్లో వేయించాను మళ్ళీ నా జోలకి రాలేదిక."

"వాడెవరో నాకు తెలియదు. నువ్వుకాదన్నా 'అమ్మా' అనే పిలుస్తాను. నేను నీకు అన్నయ్యని. ఆ మాట గుర్తుంచుకో,,' సారథి శాంతంగా జవాబిచ్చాడు.

"మరి యిన్నాళ్ళూ ఎక్కడ దాక్కున్నా




### పి. జె. ఎల్. — గుడివాడ

నాకు మెన్సెస్ అయినప్పుడు చాలా తక్కువ అవుతుంది. ఒక్కరోజు మాత్రమే అవుతుంది.

★ మీరు లేడీ డాక్టర్లను కలిసి గర్భకోశం ప్రమాణమూ, స్థితీ, పరీక్ష చేయించుకోవలసి ఉంటుంది. వారు పరీక్షానంతరం రోగ నిర్ధారణ ప్రకారం మందులు వాడతారు.

ఈలోగా శరీరంలో రక్తలేమి (హీమోగ్లోబిన్ ప్రమాణం పరీక్షించిన తర్వాత) ఉన్నప్పుడు ఇనుప ధాతువు ఉన్న మాత్రలు వాడటం మంచిది.

### డి. ఎస్. ఆర్. సి. — రాజమండ్రి

నా వయస్సు 23 సం॥లు. నాకు ఎడమ వైపునగల వృషణం పరిమాణంలో మార్పు రాలేదు. కుడివైపు వృషణం పెరిగింది. దీనివలన వైవాహిక జీవితానికి ఆటంకం ఉంటుందా? ఆపరేషను ద్వారా సరిచేయవచ్చునా?

★ మీకు ఉన్న లక్షణం హైడ్రోసీల్ అని గాని హెమటోసీల్ అని గాని నిర్ధారణ అయితే తప్పక ఆపరేషన్ చేయించుకోవచ్చును. పై రోగాలు ఉన్నవారు మామూలుగా వైవాహిక జీవితాన్ని కొనసాగించవచ్చును.

### ఎస్. ఎ. జె. వి. — జె. జె. పాడు

నా వయస్సు 23 సం॥లు. నాకు నెల నుండి కడుపులో మంటగా ఉంటుంది. ఈ మంట అన్నం తిన్న తర్వాత కొద్దిగా ఉంటున్నది కపుడు బిగతీసినట్లుగా ఉండి, తరచు గాస్ పోతున్నది. మోషన్ టెస్ట్ చేయిస్తే అమీబియాసిస్ ఉందని తెలిసింది. మందులు వాడినా ఉపయోగం కనిపించలేదు.

★ అమీబియాసిస్ ఉన్నవారు జాగ్రత్తగా క్రమబద్ధంగా చికిత్స చేయించుకోవలసి ఉంటుంది. మెట్రోనిడజాల్, క్లోరోక్విన్ మొదలయిన మందులను వైద్యుల సలహా ప్రకారం కనీసం 15 రోజుల పాటు వాడవలసి ఉంటుంది.

చికిత్స పూర్తయిన తర్వాత వరుసగా మూడుసార్లు (ప్రతిసారీ ఒక వారం వ్యవధిలో) మలపరీక్ష చేయించుకొని అమీబాలు లేవని నిర్ధారణ చేసుకోవలసి ఉంటుంది.

### కె. ఎస్. ఆర్. — విజయవాడ

తక్కువ పరిమాణంలో ఆల్కహాలు రోజు కొకసారి తీసుకొంటూ ఉంటే శరీర ఛాయను పెంపొందిస్తుందా? లావుకూడా అవుతారా? నేడు దొరికే టానిక్కులలో ఆల్కహాలు ఎందులో ఎక్కువగా ఉంటుంది?

★ ఆల్కహాల్ వల్ల శరీర "ఛాయ" పెరిగే అవకాశం లేదు. ఆల్కహాల్ తీసుకోవటంవల్ల రక్తనాళాలలో కంజెషన్ ఏర్పడి ఛాయ వచ్చినట్లుగా కనబడవచ్చును. ఆల్కహాల్ తీసుకొన్న తర్వాత అధికంగా "బలమైన" ఆహారం పడటం వల్ల కొద్దిగా లావయ్యే అవకాశం ఉంది తప్పిత్రాగే వారికి శరీర క్షీణత్వం ఏర్పడుతుంది.

దాదాపు అన్ని టానిక్కులలోను ఒకే మాదిరిగా ఆల్కహాలు పర్సంటేజ్ ఉంటుంది

### ఎ. కె. ఆర్. — బలాసోర్

నా వయస్సు 22 సం.లు. నా పురుషావయవము చివర శిశ్నము గంటునందు పెసల బద్దంత ప్రమాణంలో బుడిపె లేసి 40 రోజులయింది. అది వచ్చిన 20 రోజులకు దానికి ఒక సెం. మీ. దూరంలో మరియొకటి లేచింది. తర్వాత మళ్ళీ రెండు అలాగే వచ్చాయి. ఇవి గరుకుగా స్పర్శ తక్కువగా ఉన్నాయి. 8 నెలల క్రితం పురుషాంగం నుంచి చీము లాంటి ద్రవం కారింది.

★ వీటిని వెనీరియల్ వార్ట్స్ అని అంటారు. రోగగ్రస్తులయిన వారితో లైంగిక కలయిక జరపటం వల్ల ఇలా ఏర్పడతాయి పై పూతగా పోడోఫిల్లం రెసిన్, వైద్యులు వాడటం జరుగుతుంది. లోనికి టెట్రాసైక్లిన్ కాప్స్యూల్స్ వాడటం మంచిది. ●

---

రన్నగారూ?" ఆమె స్వరం నిండుగా హేళన, కక్ష!

"ముందా బెల్ బాటమ్ విప్పేసిరా చెబుతాను. చీరలో నువ్వు లక్ష్మీదేవిలా వుంటావు."

"నాకు చీర కట్టుకోవడం రాదు. అసలు అసహ్యం కూడాను. కావాలంటే నీ పాంటూ షర్టూ వేసుకుంటాను!" ఆమె కళ్ళనిండుగా కొంటెదనం మెరిసింది.

"సీతకి బొమ్మలపెళ్ళి చేసేప్పుడు నాతోనే చీర కట్టించుకునేది. సూట్‌కేస్‌లో ఓ చీర వుంది. పట్టుకురా. చెబుతాను ఎలా కట్టుకోవాలో!"

"నీ స్నేహితులందరూ ఆడవాళ్ళేనా అన్నగారూ?" మళ్ళీ హేళన ఆమె కనుల చివరన.

## మూగ ముత్యాలు

"సీత నా చెల్లెలు! నువ్వు పుట్టాక అమ్మా, నాన్నా, నన్ను చిన్నాన్నగారికి పిల్లలులేరని దత్తత యిచ్చారు!" సారథి ఆమె హేళనని గమనించనట్లే సౌమ్యంగా చెప్పాడు.

"ఎందుకిలా కథలల్లి నా చుట్టూ ఓ అనుబంధాన్ని సృష్టిస్తున్నావ్? ఇదుగో! సారథీ! నాకు బాగా గుర్తు! అమ్మ దాదా కూతురు! దాదా ముస్లిమ్ అని నీకు చెప్పనక్కర్లేదనుకుంటాను! నువ్వు బ్రాహ్మణ దేవతవి! నాకు పదేళ్ళప్పుడు అమ్మ నన్ను దాదాకి అప్పగించి మళ్ళీ వస్తానని చెప్పి ఏడుస్తూ వెళ్ళిపోయింది. నేను దాదా గుండెలపైన వాలిపోయి 'అమ్మ కోసం' ఎన్నో రాత్రుళ్ళు ఏడ్చేదాన్ని. కోపంతో చిందులు వేసేదాన్ని. కానీ అమ్మ తిరిగిరాలేదు. అమ్మ, నాన్న గురించి నాకెప్పుడూ చెప్పిన గుర్తులేదు. నీ పేరెప్పుడూ నేను వినలేదసలు. అమ్మ ఫోటో తీసి చూశాను. నువ్వు అమ్మకి ఏమీగావు. కాదని నాకు తెలుసు. నీలో ఎక్కడా అమ్మ పోలికల్లేవు! నీకేం కావాలో చెప్పు ఎందుకు నా వెంట పడుతున్నావో చెప్పు. దాదా తమ్ముడి దగ్గర కెళ్ళి నా వివరాలన్నీ అడిగి నా దగ్గరకెందుకు వచ్చావో చెబితే మంచిది. నా అందం చాలామందిని ఆకర్షించింది. నన్ను కొందరు మోసం జేస్తే - నేను కొందరిని మోసం జేశాను. కానీ నీలాంటి వింత మనిషి నాకింత వరకూ ఎదురవ్వలేదు. మిస్టర్ సారథీ! నీకేం కావాలో చెప్పు!" శశిరేఖ కోపాన్నంతా అతని పైన విసిరికొట్టింది.

**ఇంకా వుంది**

# ఫాలాక్షుని డైరీ



## అగ్నిపరీక్ష !

అరూర్ అనే వూరుకు చెందిన పెంగోడు వేల్ అనే ఆయన తోటలో వున్న యింట్లో పెట్టుకున్న డబ్బులు పోయాయని తన తోటలో పనిచేస్తున్న 14 ఏళ్ళ ఇంద్రాణి, 8 ఏళ్ళ అంశవేణి అనే యిద్దరాడపిల్లల్ని పట్టుకుని వారి కుడిచేతిలో కర్పూరం పెట్టి, వెలిగించాడట. దాంతో వారి చేతులు కాలిపోయేసరికి విషయంలో పోలీసు కలుగజేసుకుని ఆతన్ని, ఆతని భార్యనూ అరెస్టు చేశారట.

## భగ్నప్రేమికుని ఆత్మహత్య !

కేరళ మూణారుకు చెందిన 25 ఏళ్ళ జాన్సన్ అనే యువకుడు కుట్టి అనే వో మళయాళీ అమ్మాయిని ప్రేమించి, ప్రేమింపజేసుకుని, ఆ ప్రేమను పెళ్ళి స్థితికి యిద్దరూ కలసి, పెంచుకున్నారట. కానీ యీ సత్సంకల్పానికి ఆ జాన్సను తలిదండ్రులు సుతరామూ వొప్పనందువల్ల జాన్సనుకు దేవదాసు గుర్తొచ్చి, అతని ప్రవర్తన నచ్చక నేరుగా సేలం వొచ్చి వో హోటల్లో రూము తీసుకుని మే నెల (31)న ఫ్యాను కొక్కికి వురిపోసుకు చనిపోయాడట. ఈ తలిదండ్రులకేల యింత పట్టింపు ! వారి కుండెనుబో యీ సుతులేల యీ ఆత్మహత్యలు! అంతకన్నా ఎదిరించి జీవించరాదా! మత్లోక్కణుం.

## హత్యకి దారితీసిన పొలం తగాదా !

అరూరు (తమిళగం)కు చెందిన తుంగశ్రై గ్రామంలో 27 ఏళ్ళ పళని అనే అతనికి, అదే వూరుకు చెందిన ముళుగు అనే అతనికి, పొలం వ్యవహారంలో పగలు రేగాయట. జూన్ 21వ తేదీన చేపల మార్కెట్టులో ముళుగు పళనిని పట్టుకుని చావబాది, క్రిందపడేసి, మొల్లోంచి కత్తితీసి, మేక పీక కోసినట్టు పర పర కోసి, ఆ పని పూర్తిగా చేయలేక, చూపరులకు భయపడి పారిపోయాడట. పళని ఆసుపత్రిలో చావుబ్రతుకుల మధ్య కాస్త అటుప్రక్కగానే వున్నాట్ట.

## సత్యాగ్రహమే చౌక !

ఫ్రాన్స్‌లోని వో బ్రిటిష్ క్రిస్టియన్ ప్రెస్ట్‌గారి కారును తరుచు పోలీసులు పట్టుకుని శోధించి, అదుందా, యిది లేదా అని ప్రాణాలు తీయనారంభించారట. దాంతో వొహసారాయన వో చావుకు చాలా ఆలస్యంగా వెళ్ళారట. ఇహ యీ పోలీసుల బాధలు పడలేని ఆయన పోలీసుల పెళ్ళిళ్ళుగాని, చావులుగాని, పిల్లల పుటకలకుగానీ తాను ''ఇది'' చెయ్యనని ప్రమాణం చేసుకుని, అదేమంటే పోలీసులమీద కేసు వేయడం చాలా ఖరీదైన పని. అందుకే యిలా నా కసి తీర్చుకుంటాను అన్నారట ఆ ప్రెస్ట్ కెనెత్‌రిడ్జ్‌వేగారు.

## అన్నీ బాగానే ఉన్నాయి కానీ అప్పుడే పెళ్ళేమిటి ?!

న్యూయార్క్‌కు వెళ్ళి అక్కడో సినిమా చూసి, అందులోని హీరోయిను బ్రూక్ షీల్డ్స్ అందాన్ని చూసిన వో అరబ్ షేక్ షేకయిపోయి, తానామెను వివాహం చేసుకోదలిచినట్లు ప్రకటించి కన్యాశుల్కంగా ఆమెకు తనను తాను అర్పించుకుంటూ, వో డజను ఒంటెలనిస్తానన్నాడట అరేబియాలో వధువుకిచ్చే కట్నం రేటులో యీ రేటు ఎక్కువట. కానీ యీ షేకు వో నిబంధన పెట్టాడట. ఆ బ్రూక్ షీల్డ్స్ పెళ్ళి నాటికో పది కిలోల బరువు పెరగాలన్నాడట ఈ విషయాన్ని విన్న ఆ హీరోయిన్ను అన్నీ బాగానే వున్నాయి గానీ నాకప్పుడే వివాహేచ్ఛ రాలేదు. పైగా నే చాలా చిన్నపిల్లను అన్నదట— అద్సరి. ఇది అఖిల విశ్వ హీరోయిన్లకున్న గుణమేగా !

## మూణ్ణాళ్ళ ముచ్చట మూణ్ణెల్ల జైలు !

మద్రాసుకు చెందిన చార్లెస్ అనే వో అపర చాణక్యుడో పెద్ద ఫైవ్ స్టార్ హోటలుకు ఫోనుచేసి, తాను బొంబాయి రాజకపూరు ఆఫీసు నుంచి మాట్లాడుతున్నట్టూ, ఆయన కుమారుడు మద్రాసు రాబోతున్నాడు కనుక వో ఏ. సి. రూము రిజర్వ్ చేయమనీ చెప్పాట్ట ఆనక ఆ మర్నాడు తానే ఆ హోటలుకు వెళ్ళి తాను హిందీ నటుడు రాజ్‌కపూరు ఆఖరి కొడుకునని పరిచయం చేసుకుని, ఇంద్రభోగాలనో రెండ్రోజులు చవిచూశాట్ట. అంత పెద్ద నటుని కొడుకు కోసం ఎవరూ చూడనుకూడా రాలేదేమా అని అనుమానించిన హోటలు అధికారులు నేరుగా రాజ్‌కపూరుతో మాట్లాడి, ఎగిరి గంతేసి ఆ చార్లిస్సును పోలీసులకు వొప్పగిస్తే, కోర్టు ఆతనికి మూణ్ణెలు శిక్ష విధించిందట— ఫూటుగా మెక్కినందుకా !









# ఇంట్లో అమ్మ చేసిన కాఫీకి యోగ్యమైన బిరుదు.



ఇంట్లో వాళ్ళందరికీ ఏది మంచిది అన్నది అమ్మ కన్న మించి ఇంకెవరికి తెలుస్తుంది!

ఇక కాఫీ రుచి విషయం ఎత్తామంటే అమ్మదే తుది నిర్ణయం. ఆ నిర్ణయంపైనే అందరికీ గౌరవం.

అందుకు కారణం కాఫీ చేయడంలో అమ్మ అనుభవసారమే. అనుదినం అమ్మ చేతి కాఫీ తెచ్చే ఆ తొలి వెలుగుల తాజాదనం తిరుగులేనిది. దాన్ని తయారుచేసి అందించే అమ్మ చేయి అంతకన్న తిరుగులేనిది.

అది అమ్మ హస్తవాసి అందమూ, లేక ఆమె రహస్యమందమూ! చక్కని రుచీ,సువాసనా ఇచ్చే ఆ ఖచ్చితమైన రంగుకు కాఫీ విత్తుల్ని వేయించడం, ఆ పొడి కొట్టడం, వడకట్టడం...



ఇక చుక్క చుక్కగా కిందికిదిగే ఆ డికాక్షన్ చిక్కగా ముదురు రంగుతో నోరూరించే దాని సువాసన, నురుగు తేలుతూ, పొగలు కక్కుతూ అది అందించే ఆహ్వానం. అబ్బ! ఆ తాజాదనపు సువాసనకు జోహార్లు చెప్పాలి. నురగల బుడగలలో దోబూచులాడుతూ వచ్చే ఆ రుచికి జేజేలు పలకాలి.

ఆ మేళవింపులో పరిపూర్ణత సాధించడానికి ఎన్నేళ్ళ తపస్సు అవసరమైందో!

## సన్‌రైజ్. శ్రేష్ఠతకొక బిరుదు.

ఇంట్లో అమ్మ చేసే కాఫీ గురించి మాకు అన్నిటికన్న ఎక్కువగా నచ్చిన విషయం అదిచ్చే ఆ "తొలి వెలుగుల తాజాదనపు" అనుభూతి.

అందుకే మా మిశ్రమానికి "సన్‌రైజ్" అన్న పేరు పెట్టాం. అదెంత మంచిదంటే, అత్యుత్తమమైన కాఫీకి అదొక యోగ్యమైన బిరుదు అని మా విశ్వాసం.

## అమ్మ పద్ధతే అచ్చంగా మా పద్ధతీనూ

అమ్మలాగే, కాఫీ గొప్ప అంతా 'సరైన' కాఫీ

విత్తుల ఎంపికలోనే ఉందన్న సంగతి మేమూ గుర్తించాం, అందుకే, చిక్కదనం, సువాసనా సరైన పాళ్లలో ఇచ్చే కాఫీ విత్తుల ఎంపికలో మా నిపుణులు శిక్షణ పొందారు.

అమ్మ చేసినట్టుగానే మేమూ కాఫీ విత్తుల్ని సరిగ్గా తగినంత మేరకు వేయిస్తాం. అలా ఆ చిక్కదనం, సువాసన, రంగు పరిపూర్ణ స్థాయిలో వచ్చేలా చేస్తాం.

సరిగ్గా అలాటి సమయంలో ఆ విత్తుల్ని అతి వేగంగా చల్లారుస్తాం. దానితో వాటి మంచితనం, సువాసన, రుచి, చిక్కదనం, రంగు అన్నీ అలా అందులో నిలిచిపోతాయి.

ఆ విత్తుల్ని నాజూగ్గా పొడికొట్టి, బ్రహ్మాండమైన పర్కొలేటర్లలో పడపోస్తాం. దీనితో ముదురు రంగుతోటి, ముగ్ధుల్ని చేసే సువాసనతోటి అతి చిక్కని డికాక్షన్ తయారవుతుంది.

అనుదినం ఉదయం పూట అమ్మ కాఫీ రుచికి నోచుకున్న వారందరికీ ఇది సుపరిచితమైందే.

## చిక్కని డికాక్షన్ నుంచి మళ్ళీ పొడి.

ఈ దశలో డికాక్షన్‌ను సుతారంగా ఆరబెట్టడం ద్వారా దాన్ని పొడి రూపంలోకి మార్చడం జరుగుతుంది. ఈ పద్ధతి వెనక 40 ఏళ్ళ పరిశోధన, అనుభవాల పరిపూర్ణత ఉంది.

ఇక బంగారు గోధుమ రంగులో ఉన్న ఆ పొడిలో తాజాదనం, సువాసన సమృద్ధిగా ఉంటాయి.

## ఆ తాజాదనాన్ని అలా నిలిపి ఉంచడం కోసం

ఆ పొడిని జాడీలలోకి, సంచీలలోకి నింపి, దాని సువాసన, రుచి, చిక్కదనం అన్నీ అందులోనే దాగి ఉండేలా సీలుచెయడం జరుగుతుంది. ఆ గుణాలన్నీ కలసి ఏ వేళలోనైనా, ఏ జాములోనైనా

## ఆ సన్‌రైజ్ తొలివెలుగుల తాజాదనపు అనుభూతి మీకు నిస్సందేహంగా అందుతుంది.



ఇక సన్‌రైజ్ అచ్చంగా ఇంట్లో అమ్మ పద్ధతి లోనే తయారవడం వల్ల, ఆ శ్రేష్ఠతకు ఇదొక యోగ్యమైన బిరుదే అనవచ్చు కదా మరి!




# ఇంట్లో అమ్మ చేసిన కాఫీ అందించే ఆ తొలివెలుగుల తాజాదనపు అనుభూతి కోసం.

ఎంపిక చేసిన పట్టణాలలో మాత్రమే లభించును.



# సినిమా



'తోడూ–నీడ'లో సరిత, శోభన్‌బాబు

## రాజకీయరంగం నుంచి సినిమారంగానికి విప్లవజ్యోతి చిన్నపరెడ్డిగా 'తెలుగుదేశం' ఎం. ఎల్. ఎ. రామకృష్ణారెడ్డి

ప్రజాసేవకు రాజకీయరంగం, సంఘసేవకు సినిమారంగం .. నేనసలు 1974 లోనే సినిమారంగంలో ప్రవేశించాల్సింది. విఘ్నేశ్వరా ఆర్ట్ పిక్చర్స్ సంస్థను నెలకొల్పి, స్వర్గీయ ఆదుర్తి సుబ్బారావుగారిచే 'స్వరనికేతన్' చిత్రాన్ని తెరకెక్కించాలనుకున్నాను. ఆయన అస్తమించడంతో ఆ ప్రయత్నం అంతటితో ఆగిపోయింది. గత ప్రభుత్వం నాపై పగపూని మీసా చట్టం కింద, నాసా చట్టం కింద ఖైదు చేసి, చిత్రహింసలకు గురి చేసింది. అటుపైన న్యాయస్థానాలలో నా నిర్దోషిత్వాన్ని రుజువుచేసు కున్నాను. గూండా దాడికి మా తండ్రిగారు అన్యాయంగా బలి అయిపోయారు. ఆ తర్వాత వ్యవసాయరంగంలో ప్రవేశించేను. స్వయంకృషితో ప్రపంచరికార్డు నెలకొల్పి, రాష్ట్రపతి వద్ద నుంచి 'కృషిపండిట్' అవార్డు అందుకున్నాను," అంటూ చల్లా రామకృష్ణారెడ్డి ఇంకా ఇలా వివరించారు . "తెలుగుదేశం" ప్రతినిధిగా కర్నూలుజిల్లా పాణ్యం నియోజకవర్గం నుంచి ఎం. ఎల్ ఎ. గా ఘన విజయం సాధించాను. నా జీవితాశయం చరిత్ర ప్రసిద్ధికెక్కిన మహనీయుల జీవితాలను తెరకెక్కించాలని. . అందుకు నాందిగా లక్ష్మీ శివజ్యోతి ఫిలింస్వారు జూలై 20 నుంచీ ప్రారంభించే 'విప్లవజ్యోతి చిన్నపరెడ్డి' చిత్రంలో నాయకుని పాత్రను అంగీకరించడానికి ముందు మా నాయకుడు ఎన్. టి. రామారావు అన్నగారితో ఈ విషయం చెప్పి, వారి ఆశీస్సులు పొందాను."



మాళవిక 'ఆనంద భైరవి'

"ముప్పై ఏళ్ళ ఈ స్ఫురద్రూపి అచిర కాలంలోనే సినిమారంగంలోనూ తన లక్ష్యాన్ని సాధించగలరనడంలో ఎలాంటిఅతిశయోక్తి లేదు." అంటూ డైరెక్టర్ కమలాకర కామేశ్వరరావు, పాత్రికేయులతో ఈ చిత్రం గురించి ముచ్చటించారు : "అల్లూరి సీతారామరాజుకన్నా ముందు ఆంగ్లేయులను గడగడలాడించిన విప్లవ వీరుడు చిన్నపరెడ్డి గుంటూరు జిల్లాలోని కోటప్పకొండ ప్రాంతానికి చెందిన వ్యక్తి. 1896 లో ఉప్పెనలో దివిసీమ కొట్టుకు పోయినప్పుడు చిన్నపరెడ్డి తెల్లవారితో పోరాడి ధాన్య గోదాములను దోచి, ప్రజలకు పంచిపెట్టడమే కాకుండా స్వయంగా తన సొంత ధాన్యాన్ని కూడా ఆర్తులకు ఇచ్చి ఎంతో సేవచేశాడు. సప్తమ ఎడ్వర్డ్ పరిపాలిస్తున్న కాలంలో బ్రిటిషువారితో వీరావేశంతో పోరాడాడు ఈ త్యాగధనుడ్ని రాజమండ్రి జైల్లో 1909లో ఉరితీసినట్లు దాఖలాలు దొరికాయి. ఈ చిత్రం షూటింగ్ అంతా కోటప్పకొండ ప్రాంతాల్లోనే జరుగుతుంది."

వై. రామకృష్ణారెడ్డి, ఎ. సైదారెడ్డి నిర్మించే ఈ చిత్రంలో తెల్లదొరగా జగ్గయ్య, చిన్నపరెడ్డి ప్రత్యర్థిగా రావుగోపాలరావు, మరో కీలకపాత్రలో ప్రభాకరరెడ్డి పాల్గొంటారు. బండారు కృపారావు సమకూర్చిన మూలకథకు కాశీవిశ్వనాథ్ సంభాషణలకర్త. కె. ఎస్. ప్రసాద్ ఛాయాగ్రాహకుడు. వాలి శిల్ప దర్శకుడు. చల్లా అమరనాథ్ రెడ్డి నిర్వహణలో వై. నాగేందర్ రెడ్డి సమర్పిస్తారీ చిత్రాన్ని.

'సింహపురి సింహం'లో



# విశేషాలు

**-జి. వి. జి.**

## తోడూ — నీడలో దాగని రహస్యం

సాగర్ (శోభన్‌బాబు) కిటికీ దగ్గర సూన్యంలోకి చూస్తూ నిలుచున్నవాడల్లా, "అమ్మ తిరిగి రావడం వల్ల ఇందరి హృదయాలలో కల్లోలం, ఇందరి బ్రతుకుల్లో కన్నీళ్ళు తప్ప — ఏం తేగలిగింది ? అసలు రాకపోయినా బాగుండేది," అంటూ వెనుతిరిగాడు. "ఎన్నాళ్ళీ ఘోరాన్ని చూస్తూ భరించమంటారు ? అమ్మతో నిజం చెప్పేస్తాను."

శివరామయ్య (గుమ్మడి) తృళ్ళిపడ్డాడు. "ఏమిటా మాటలు ? తెలిసే మాట్లాడుతున్నావా ?"

"అన్నీ తెలిసే మాట్లాడుతున్నా, తాతయ్యా ! కట్టుకున్న భర్త కళ్ళెదుటే నుదుట బొట్టు చెరిపేసుకుని, విధవరాలిలా నటించాలంటే ఓ ఆడమనసు ఎంత రోదిస్తుందో తెలుసుకునే మాట్లాడుతున్నాను. తాళికట్టిన భార్య తనెదుటే — భర్త చచ్చినదానిలా తిరుగుతూంటే — చూస్తూ భరించాల్సిన ఆ భర్త హృదయం ఎలా తల్లడిల్లిపోతుందో తెలిసే మాట్లాడుతున్నాను. తల్లీ తండ్రీ ఉన్నా —



మురళీమోహన్, కృష్ణంరాజు 'కోటికొక్కడు'

చూసే ఆశ తప్ప చూడగలిగే అవకాశంలేని ఓ వంటికుర్రాడి స్థితి తెలుసుకునే మాట్లాడుతున్నాను," అని సాగర్ బాధపడుతూండడం అప్పుడే అక్కడికి వచ్చిన శారద (సరిత) విన్నది. "ఎందుకు నాకు అబద్ధం చెప్పారు ? అసలేం జరిగింది ?" అంది.

సాగర్, శివరామయ్యల ముఖాలు పాలిపోయాయి.

శారదకు ఉప్పెనలా దుఃఖం ముంచుకొచ్చింది. "ఎవ్వరూ మాట్లాడరేం ? చెప్పరా! కడుపు తెంచుకుని పుట్టిన నీకు నా గుండె లోతుల్లో గల బాధను అర్థం చేసుకునే శక్తి ఉంది. చెప్పు, సాగర్ ! మీరందరూ ఎందుకిలా దోషుల్లా, దొంగల్లా నా ఎదుట మాట్లాడడం లేదు? ఏమిటీ నిశ్శబ్దం? పద్నాలుగు సంవత్సరాల తర్వాత తల్లి తిరిగొచ్చిందన్న ఆనందం ఏ రోజూ నీలో కనిపించలేదు. అసలేమైంది ? ఏం జరిగింది ? చెప్పండి ?"

శివరామయ్య, సాగర్‌లు ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

ఎస్. పి. వెంకన్నబాబు నిర్మించే మహేశ్వరీ ఫిలిమ్స్ "తోడు నీడ" చిత్రానికి వి. జనార్ధన్ దర్శకుడు. కె. బి. ప్రసాదరెడ్డి సహ నిర్మాత. రాధిక, నళిని. ప్రభాకరరెడ్డి, అల్లు రామలింగయ్య, మిక్కిలినేని, సూర్యకాంతం, అత్తిలి లక్ష్మి, మాస్టర్ ఇతర పాత్రధారులు. జూలై విడుదల.



చిరంజీవి, మాధవి

## మూడు చిత్రాలలో కొత్త హీరో చంద్రకిరణ్

నటనలో సుశిక్షితుడైన ఒక సుస్ఫురద్రూపిని "ముద్దుగుమ్మ" చిత్రం ద్వారా డైరెక్టర్ పి. త్రినాధరావు పరిచయం చేస్తున్నారనే వార్త ఇతర దర్శక నిర్మాతలనుకూడా ఆకర్షించింది. బొంబాయి కమల్ అమ్రోహి ఫిలిమ్ ఇన్‌స్టిట్యూట్‌లో డిప్లొమా పొంది, పలు నాటకాలలో ప్రతిభావంతంగా నటించి ప్రశంసలు, పతకాలు పొందిన చంద్రకిరణ్ త్వరలో భాస్కరరావు దర్శకత్వంలో తయారయ్యే "పూజా మందిరం" చిత్రంలో బుక్ అయ్యాడు. కె. బాలచందర్ దర్శకత్వంలో ఎం. ఎస్. ఆర్. ప్రొడక్షన్స్‌వారు హిందీలో నిర్మించే "గుప్పెడు మనసు"లో కూడా ఎంపిక అయ్యాడు. ఈ యువకునికి ఉజ్వలమైన భవిష్యత్తు ఉందని పరిశ్రమలోని పలువురు ప్రముఖుల అభిప్రాయం.

కొత్త హీరో చంద్రకిరణ్



## "ముక్కుపుడక"లో మాటకు మాట !

రోడ్డు .. 'చెలియో చెల్లకో' పద్యం పాడుకుంటూ సైకిల్‌మీద వస్తూన్న పెంటా పరబ్రహ్మం (మారుతీరావు) అమాంతంగా ఒక పోలీసుని ఢీకొన్నాడు. భయపడకుండా, జాలి చూపకుండా "కళ్ళు కనిపించటం లేదా ?" అని అడిగాడు.

కానిస్టేబుల్ ఆయాసంగాలేస్తూ, "బెల్ కొట్టాలని తెలియక్కర్లా ?" అన్నాడు.

"నీ దగ్గర విజిల్ ఉంది. ఊదొచ్చుగా ?"

"అయితే పోలీసువి నువ్వా, నేనా ?"

"నువ్వు తప్పచేస్తే నేను పోలీసుని. నేను తప్పు చేస్తే నువ్వు పోలీసువి."

ఆ కానిస్టేబుల్‌కి ఇలాంటి శాల్తీ ఇదివర కెక్కడా తగలేదు. "అంటే బెల్ లేకుండా...?" అంటూ రెండు గుటకలు మింగి, ప్రశ్నార్థకంగా చూశాడు.

"బెల్లే కాదయ్యా. బ్రేక్ లేదు. ఉన్నా—వే వెయ్యను. ఏం చేత్తావ్ ?"

కానిస్టేబుల్‌కి ఇక ఆవేశం ముంచుకొచ్చేసింది. "నిన్నరస్టు సేత్తన్నాను," అన్నాడు.

"సరే," అన్నాడు పరబ్రహ్మం తాపీగా.

"పోలీస్ స్టేషన్‌కు పద."

"నే(రాను"

"ఏలాయ్యా ?"

"అది నువ్వు తేల్చుకోవాల్సిన విషయం అయిదు సెకండ్లు టైమ్ యిత్తన్నాను సైకిల్ తీయ్ !"

ఇంతలో సుబ్బారాయుడు (పి. ఎల్ నారాయణ) "బావా, వరేయ్, బావా?" అంటూ సమీపించి, "ఈ గొడవేందిరా ?" అన్నాడు.

పరబ్రహ్మం నిర్లక్ష్యంగా "ఆఁ పోలీసోడు దసరా మామూలు అడుగుతున్నాడుగాని ఎప్పుడొచ్చావురా ?" అన్నాడు.

కానిస్టేబుల్ అటెన్షన్‌లో నిలుచున్నాడు. "నీ పేర్రాత్తాను," అని కాకినిక్కర్‌లోంచి చిన్న డైరీ తీశాడు.





"ఈ అవుట్‌డోర్ షూటింగ్‌లో నిర్మాతగారు నీ తిండి విషయం పట్టించుకోకపోవడానికి కారణం-నీతో ఆకలిచావు సీను ఒకటి తియ్యాలి !"

పరబ్రహ్మం కళ్ళు మూసుకున్నాడు "రాసుకో... పెంటా పరబ్రహ్మం." అని చెప్పి, కళ్ళు తెరిచాడో— లేదో ఆ కానిస్టేబుల్ ఎదురుగా లేడు. అల్లంత దూరంలో పారిపోతూ కనిపించాడు. "ఇదేంట్రా— చెరుకుముక్క ఇద్దామనుకుంటే పారిపోయాడు ! వరేయ్, నువ్వు సైకిల్ తీసుకురా!" అంటూ సుబ్బారాయుడితో బయలుదేరాడు

జూలైలో విడుదలయ్యే భార్గవ్ ఆర్ట్స్ ప్రొడక్షన్స్ "ముక్కుపుడక" చిత్రాన్ని కోడి రామకృష్ణ దర్శకత్వంలో ఎస్. గోపాల్‌రెడ్డి నిర్మిస్తున్నారు.

## మిద్దె రామారావు తదుపరి చిత్రాలు

"రెండు కొత్త చిత్రాలకు పకడ్బందీ అయిన స్క్రిప్ట్‌లు రెడీగా ఉన్నాయి మా శ్రీ రాజలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ ఏడవ చిత్రం షూటింగ్‌ను సెప్టెంబర్ 18న మొదలెడుతున్నాం," అన్నారు మిద్దె రామారావు. ఈయన "రామరాజ్యంలో భీమరాజు" అనంతరం నిర్మించే చిత్రంలో చిరంజీవి, రాధ నాయకా నాయికలు. సత్యానంద్, చక్రవర్తి, వెంకట్, వెంకటరత్నం, కె. ఎల్. ఎన్. శాస్త్రి తెరవెనుక కృషిచేస్తారు. మూడు షెడ్యూల్స్‌లో నవంబర్ 20కి షూటింగ్ పూర్తవుతుంది. వచ్చే ఫిబ్రవరి, మార్చి నెలల్లో నిర్మించే చిత్రంలో కృష్ణ, శ్రీదేవి హీరో హీరోయిన్‌లు. ఈ రెండు చిత్రాలకుకూడా ఎ. కోదండరామిరెడ్డి డైరెక్టరు.

## "కళా రంజని"

"మురళీమోహన్, రంజనిపై సాతనూర్ డామ్, తడ వద్ద చిత్రీకరించిన రెండుడ్యూయెట్లు మా చిత్రంలో హైలైట్స్. ఇంకో రెండు పాటలు పిక్చరైజ్ చేస్తే, షూటింగ్ పూర్తయినట్లే" అన్నారు పి. శేఖర్. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో వానపల్లి బ్రహ్మాజీ నిర్మించే శ్రీ కామాక్షి చిత్రవారి "కళా రంజని" చిత్రంలో రంగనాథ్, నూతన్ ప్రసాద్, జీవా, చిట్టిబాబు, పద్మనాభం, జోకర్ తులసి, రమాప్రభ, ఈశ్వర రావు, రమణమూర్తి పాత్రధారులు. భరత్ మాటలు, పెండ్యాల సంగీతం, సి. హెచ్. హరనాథరెడ్డి ఛాయ, పసుమర్తి కృష్ణమూర్తి నృత్యాలు, చంద్రమోహన్ కూర్పుతో ఈ చిత్రాని సమర్పించే పట్నాలరత్నం "జూలై ఆఖరి వారంలో రిలీజ్ చేయాలనుకుంటున్నాం," అన్నారు.

## కట్టా దర్శకత్వంలో వై. వి. రావ్ నిర్మించే చిత్రంలో శోభన్ హీరో

"ఎన్నో మలుపులతో నవరసాల మిళితమైన కథను బాలమురుగన్ ఇచ్చారు. శోభన్‌బాబు, రాధిక, రావుగోపాలరావు, అల్లు రామలింగయ్య కాల్షీట్లు ఇచ్చారు. ఇంకో హీరోయిన్ ఎవరో త్వరలో తెలియజేస్తాము," అన్నారు రవిచిత్ర ఫిలిమ్స్ అధినేత వై. వి. రావ్. సెప్టెంబర్ 23 నుంచి అక్టోబర్ 7 వరకు ఊటీలో మొదటి షెడ్యూల్ జరుగుతుంది. డిసెంబర్‌కు షూటింగ్ పూర్తవుతుంది. సత్యం సంగీత దర్శకుడు. దేవరాజ్ ఛాయాగ్రాహకుడు. కట్టా సుబ్బారావు దర్శకుడు.

'గ్రహణం విడిచింది'లో
నూతన్ ప్రసాద్, లక్ష్మీశ్రీ



## హాస్య నటుడు బౌనా

"మగ మహారాజు, ఎం. ఎల్. ఎ. ఏడుకొండలు" వగైరా పలు హాస్య పాత్రలు ధరించి ప్రశంసల నందుకున్న బౌనా తొలుత స్టిల్ ఫొటోగ్రాఫర్ అన్న విషయం చాలామందికి తెలుసు. ప్రముఖ నాట్యాచార్యుడు ఉదయ్ శంకర్ "కల్పన" చిత్రాన్ని ప్రారంభిస్తున్నప్పుడు ఆయనకు బౌనా తీసిన స్టిల్సును ఎవరో చూపించి స్టిల్ ఫొటోగ్రాఫర్‌గా తీసుకోమని సిఫారస్ చేశారు. ఉదయశంకర్ ఆ స్టిల్సును "కల్పన" ఛాయాగ్రాహకుడు ది గ్రేట్ రామనాథ్‌కు చూపిస్తే, ఆయన "ఎక్సెలెంటుగా ఉన్నాయి. ఈ ఫొటోలు తీసినతను పొట్టివాడై ఉండాలి," అన్నారట. 'బౌనా' అంటే బెంగాలీలో పొట్టివాడని అర్థం. అంచేత, ఆ చిత్రానికి స్టిల్ ఫొటోగ్రాఫర్‌గా పనిచేసిన సత్యనారాయణను ముద్దుగా 'బౌనా' అని పిలవడం మొదలెట్టారు ఉదయశంకర్. దాంతో ఆ పేరే స్థిరపడిపోయింది. [స్వర్గీయ ఆదుర్తి సుబ్బారావుగారు కూడా 'కల్పన' చిత్రానికి స్టిల్ ఫొటోగ్రాఫర్‌గా కొంత కాలంపాటు పని చేశారు.]

## "పాపి కొండలు"

"మా చిత్రంలో అయిదుపాటలుఉంటాయి. అవన్నీ కోపల్లె శివరాం రాశారు." అన్నారు గవిని కృష్ణమూర్తి. ఈయన దర్శకత్వంలో కృష్ణప్రసాద్ సమర్పించే అమర పిక్చర్స్‌వారి పై చిత్రంలో నరేష్, తులసి, స్మిత, వనిత, జయమాలిని వగైరా తారాగణం. ఎస్.ఆర్.నంది సంభాషణలు, చక్రవర్తి సంగీతం, సి. గోపాల్ ఛాయ, వెంకటేశ్వరరావు శిల్పం, తరుణ్ నృత్యాలు, పి. సి. మోహన్ కూర్పుతో బోర శ్రీరాములు, బోర లక్ష్మణరావు నిర్మాతలు. తొలి షెడ్యూల్ ఆగస్టులో రాజమండ్రి వద్ద మొదలవుతుంది.

## వేజెళ్ళ కొత్త చిత్రం

"ఆగస్టు నుంచి ఒకే షెడ్యూల్లో ఔట్‌డోర్‌లో షూటింగ్ పూర్తయిపోతుంది," అన్నారు వేజెళ్ళ సత్యనారాయణ. ఈయన "ఈ పిల్లకు పెళ్ళవుతుందా ?" చిత్రం తర్వాత దర్శకత్వం వహించే ఇంటర్నేషనల్ ఫిలిమ్స్‌వారి కొత్త చిత్రానికి జూన్ 24న తొలి గీతం ధ్వని ముద్రితమైంది. శివకృష్ణ ప్రభృతులు ముఖ్య భూమికలు నిర్వహిస్తారు. చక్రవర్తి సంగీత దర్శకుడు. ఆర్. కె. రాజు ఛాయాగ్రాహకుడు. అక్కినేని శ్రీనివాసరావు ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసరు. యర్రంశెట్టి ఆంజనేయులు నిర్మాణ సారథి. మరమంచి లక్ష్మి సమర్పణలో బి. మోహన్ నిర్మాత.



వనితశ్రీ 'త్రివేణీ సంగమం'లో

## "చండీరాణి"

"రెండు చిత్రాలను ప్లాన్ చేశాను," అన్నారు శ్రీ వాణీ ఆర్ట్స్ అధినేత ఎన్. వి. సుబ్బరాజు. ఈయన జూలైలో ప్రారంభించే "చండీరాణి" చిత్రంలో కవిత, సుమన్, గొల్లపూడి, శ్యామలగౌరి మున్నగువారుంటారు. మారేడుమిల్లి, రంపచోడవరం, దేవీపట్నం, చింతపల్లి అడవులలో ఒకే షెడ్యూల్లో షూటింగ్ పూర్తవుతుంది. తదుపరి చిత్రంలో కృష్ణ, జయప్రద నాయకా నాయికలు. ఈ రెండు చిత్రాలకూ పి. చంద్రశేఖరరెడ్డి దర్శకుడు.

## మద్రాసు ఫిలిమ్ ఫాన్స్ అసోసియేషన్ ఉత్తమ చిత్రాల ఎంపిక

దర్శకుడు : దాసరి నారాయణరావు (మేఘసందేశం). నటుడు : అక్కినేని నాగేశ్వరరావు (మేఘసందేశం). నటీమణులు : జయసుధ (మేఘసందేశం), సరిత (కోకిలమ్మ). అత్యుత్తమ తెలుగుచిత్రం "మేఘసందేశం." 

# సాహసమే మా వృత్తి

## (ఓ స్టంట్ ఆర్టిస్టు స్వగతం)

"దుష్కుం దుష్కుం దుష్కుం..." అంటూ మా ఆరేళ్ళ బాబు పరుగున ఇంట్లోకి ప్రవేశించాడు. వాడప్పుడే నేను పాల్గొన్న ఓ స్టంట్ సినిమాను చూసొస్తున్నాడు. "హీరో ఒక్కొక్క దెబ్బ తగిలిస్తూ నిన్ను భలేగా పడ



గొట్టేశాడు, నాన్నా!" అన్నాడు మురిసిపోతూ.

మా వాడు ఆ హీరో అభిమాని. ఆ హీరో చేత వాడి కన్న తండ్రి చావుదెబ్బలు తింటే, వాడికంత ఆనందమన్న మాట! ఆ ఆనందంలోనే "దుష్కుం దుష్కుం దుష్కుం" అంటూ నా పొట్ట మీద నాలుగు గుద్దులు గుద్ది, "ఆ సినిమాలో లాగే పడిపో, నాన్నా!" అన్నాడు వాడు. పక్కనే ఉన్న మా ఆవిడ కాస్త చిన్నబుచ్చుకుంది. వాడ్ని అక్కడ్నుంచి బరబర లాక్కెళ్ళి పోయింది. మా ఆవిడ కూడా అడపాదడపా సినిమాలు చూస్తూంటుంది. ప్రతి చిత్రంలోనూ తన భర్త వాళ్ళ హీనమయ్యేలా దెబ్బలు తింటూంటే, ఆమె ఎంతకని భరించ గలదు? ఒకసారి ఆ బాధను వ్యక్తం చేసింది కూడా: "అంతా వాళ్ళ అక్టింగే ననుకోండి. కాని, ప్రతి చిత్రంలో మీరలా చిత్తయిపోవడ మేమిటండీ?" అంటూ.

"దుష్టుల జట్టులోని నేను గెలిచి — హీరో ఓడిపోతే, ఎవరికి బాగుంటుందే, పిచ్చి మొహమా! అలాంటి చిత్రాలను ఎవరు చూస్తారు? ఆ తర్వాత మన గతి ...?" అని నచ్చజెప్పాను.

ఒక పిక్చర్‌లో హాస్య నటుడు స్వర్గీయ బాలకృష్ణ ఉఫ్ అనగానే నేను మెలికలు తిరిగి, పక్కనున్న పీపాలను మీద తోసుకుని పడిపోతాను. బాలకృష్ణ ఎంత బక్కపల్చగా, బలహీనంగా ఉండేవారో అందరికీ తెలుసు. నేను దృఢ కాయుడ్ని. ఆయన ఉఫ్ అంటే నేను పడిపోవడం విడ్డూరమే. కాని, జనానికి అదే కావాలి. ముందు బెంచీల వాళ్ళకు అదే 'థ్రిల్'. ఆ పడ్డప్పుడు నా వీపులో ఒక మేకు గుచ్చుకు పోయింది. ఆ గాయం సెప్టిక్ అయి, నేను హాస్పిటల్‌లో వారం రోజుల పాటు గడపవలసి వచ్చింది. అలాగే నా చెంపమీద ఒక గాటు నాకు మాయని మచ్చలా మిగిలి పోయింది. ఒక పిక్చర్‌లో ఫైట్ చేస్తున్నప్పుడు హీరో చేతనున్న కత్తి నా కుడి కన్ను పక్కగా దూసుకు పోయింది. నేనప్పుడు కాస్త ఏమరపాటున ఉంటే, ఆ కన్ను ఎగిరిపోవలసిందే. దైవ వశాత్తు కాస్తలో ఆ ప్రమాదం తప్పిపోయింది

నిజమే... మా వృత్తి చాలా ప్రమాదకర మైనదే! కాని, ప్రమాదమని చూస్తే— నేను, నా భార్య, పిల్లలు, నా మీద ఆధారపడి ఉన్న మిగతా వారంతా బ్రతికేదెలా?

ఎలాగో ఈ వృత్తిలోకి ప్రవేశించాను కత్తి యుద్ధం, క్రర యుద్ధం, ముష్టి యుద్ధం, మల్ల యుద్ధం—లాంటి మన పద్ధతులే గాక; జూడో, కరాటే, సేవియట్, కుంగ్ ఫ్యూ, ఆవారా, ఆక్సిడో [5 వేళ్ళ ఫైట్], జుజిట్సు [రెండువేళ్ళ ఫైట్] లాంటి విదేశీ టెక్నిక్‌లూ కష్టపడి నేర్చుకున్నాను. ఆ నేర్చుకున్న పాపాన్నో, పుణ్యాన్నో ఈ రంగంలో ప్రవేశించాను. క్రమక్రమంగా స్టంట్ మాస్టర్ని అయ్యాను. సినిమా టెక్నిక్ కూడా కాస్తో కూస్తో తెలుసుకున్నాను. ఇది తెలుసుకోవడం ఎంతో అవసరం. ఒరిజినల్ ఆర్టిస్టులు పాల్గొనేటప్పుడు కెమెరా ఏ ఆంగిల్‌లో ఉండాలో, డూప్‌లు పాల్గొనేటప్పుడు ఏ ఆంగిల్‌లో ఉండాలో, అసలు ఏ 'కెమెరా లెన్స్'తో ఏ షాట్ తీస్తారో— షాట్ డివిషన్స్‌తో సహా అన్నీ తెలిసి ఉండాలి. ముఖ్యంగా కెమెరా స్పీడ్... కొన్ని షాట్‌లు 20 ఫ్రేమ్‌ల చొప్పున, మరీ కాస్త వేగంగా చూపవలసినవి













18 ఫ్రేమ్‌ల చొప్పున షాట్ చేస్తారు. క్లోజప్‌లు తీసేటప్పుడు మరింత జాగ్రత్తగా చూసుకోవాలి. రష్యన్ ఆంగిల్, ఇండియన్ ఆంగిల్ — ఇలా కెమెరా సెన్స్ ఉండి తీరాలి. అంతే కాదు; తీసిన షాట్స్‌ను ఎడిట్ చేసేటప్పుడు కూడా మూవియోలా దగ్గరుండి, ఏ షాట్ ఎప్పుడు వేస్తే సరిగా అతుకుతుందో— ఆ కంటిన్యూటీ కూడా గమనించాలి.

'ఇంతకీ, మన సినిమాలలో ఇలాంటి ఫైట్లు అవసరమా ?' అని కొందరు అడుగుతూంటారు... అవసరమే... నవరసాలలో ఈ భయానక రసమూ ఒకటి కాదా ? నిజజీవితంలో మనుషులు కొట్లాడుకోరా ? ఎవరైనా ఏదైనా అన్యాయం చేస్తూ ఉంటే, చీమూ నెత్తురూ ఉన్నవాళ్ళు చూస్తూ ఊరుకుంటారా ? ఓ అబలను ఓ దుష్టుడు బలాత్కారం చేస్తూంటే, ఎవ్వడూ చూస్తూ ఊర్కోడు; నాలుగు దెబ్బలు తగిలిస్తాడు. ఆ తర్వాత పోలీసులూ, న్యాయస్థానం అది వేరే విషయం. దుష్టశిక్షణ, శిష్టరక్షణ జరగాలి. అసలు స్వరాజ్యం రావడానికి ముందు మనమంతా తుపాకులకు ఎదురు నిలిచి ఆంగ్లేయులతో పోరాడలేదా ? అల్లూరి సీతారామరాజు వీరోచిత సాహసాలను మనం మరువగలమా ? అంచేత, ఏనాటికైనా అన్యాయాన్ని న్యాయం జయించి తీరుతుందని నిరూపించడానికి ఇలాంటి గగుర్పాటు కలిగించే సాహసోపేతమైన చర్యలు చాలా అవసరం. నాకు ఊహ తెలిసినప్పట్నుంచి ఈ ఫైట్లు మన సినిమాలలో ఉంటున్నాయి. ఒకప్పుడు నాడియా, జాన్‌కవాస్‌లు నటించిన హిందీ స్టంట్ పిక్చర్లు అదే పనిగా తయారవుతూండేవి. వాటిల్లో మొదట్నుంచీ చివరి వరకు ఫైట్లే ! సినిమాలు వచ్చిన కొత్తల్లో అలాంటి స్టంట్ సినిమాలను చూడడానికే క్లాస్, మాస్ అందరూ ఎగబడేవారు.

ఒకటి మాత్రం చెప్పక తప్పదు. చిత్ర కథల్లో ఇలాంటి ఫైట్లు అనవసరంగా ప్రవేశపెట్టినట్లుంటే, కొందరికి నచ్చదు. ఈ ఫైట్ల వల్ల ఏదో ఒక ప్రయోజనముంటే మంచిది. ఒక్కోసారి కథను ఎలా మలుపు తిప్పాలన్న సమస్య వచ్చినప్పుడు కూడా 'అక్కడొక ఫైట్ ఉంటే బావుంటుం'దనే నిర్ణయానికి వస్తూంటారు. మాదేం పోయిందీ ? సరే— అంటూంటాం. మా డబ్బులు మాకొస్తాయి.

ఇది వరకు డైరెక్టర్లు మాకు కబురు చేసి, ఫలానా ఫైట్ ఉంటుంది — అని ముందుగా వివరించేవారు. మా అసిస్టెంట్ల సాయంతో అలాగే కంపోజ్ చేసి చూపించే వాళ్లం. ఇప్పుడంత తీరుబడి, ఓపిక ఎక్కడుంది? సరాసరి సెట్‌లోనే ఎప్పటికప్పుడు కంపోజ్ చేసేస్తూంటాం. ఒక్క హీరో దెబ్బకు నలభై యాభై మంది వరుసగా నేలకు ఒరిగిపోతూంటారు. కొన్ని షాట్స్‌లో హీరోకు డూప్ వేసే ఆర్టిస్టు అమాంతంగా మేడమీద నుంచి కిందికి దూకుతూంటారు. అది హీరో సాహసమే అని ప్రేక్షకులు పట్టరాని ఆనందంతో చప్పట్లు కొడ్తారు; ఈలలు వేస్తారు.

కొందరు హీరోలతో పని చేయడమంటే ఎంతో ఉత్సాహంగా ఉంటుంది. నాగేశ్వరరావుగారి లాంటి వారు ఈ ఫైట్స్ కంపోజింగ్‌లో ఎన్నో మెలకువలు తెలియజేస్తూ చక్కని సలహాలిస్తూంటారు. ఎదుటి వ్యక్తికి చేతిగాలి విసురు సైతం తగలకుండా ఎంతో సహజత్వం ఉట్టిపడేలా ఫైట్ చేస్తారాయన. స్వర్గీయ ఎస్. వి. రంగారావుగారు కూడా ఆ వయస్సులో ఎంత నేచురల్‌గా ఫైట్ చేసే వారో! కొందరు కొత్త









నటులు మాత్రం తొలి రోజుల్లో ఫైట్ సీన్‌లలో కాస్త జంకుతూంటారు– పొరబాటున మాకెక్కడ దెబ్బలు తగులుతాయేమోనని!

నాలాగా ఎందరో స్టంట్‌మాస్టర్లు ఉన్నారు ఈ ఫీల్డులో . రాఘవులు, సాంబశివరావు, సత్తిబాబు, దాసు, రాజు, భాష– వీళ్ళు తెలుగు వారు మాధవన్, స్వామినాథన్, జూడో రత్నం, శివయ్య (కన్నడ చిత్రాలకు), ఒకప్పటి ఎం. జి ఆర్ గారి శ్యాంసుందర్, శివాజీగారి వెంకటేశ్, పరమశివన్ (శోభన్‌బాబుగారి చిత్రాలకు), ఎం ఎస్ దాస్ (హిందీ చిత్రాలకు), త్యా.రాజన్ (ప్రేంనజీర్ చిత్రాలకు), ఆర్.ఎస్. బాలు, లప్ప .

# సాహసమే...

మాకు 'ది సౌత్ ఇండియన్ సినీ స్టంట్ డైరెక్టర్స్ అండ్ స్టంట్ ఆర్టిస్ట్స్ యూనియన్' ఉంది. స్టంట్ ఆర్టిస్టులు వారి సంపాదనలో నూటికి రెండు రూపాయల చొప్పన మా యూనియన్ వెల్‌ఫేర్ ఫండ్‌కు చెల్లిస్తూంటారు. స్టంట్ మాస్టర్లు కంపోజ్ చేసే ప్రతి ఫైట్‌కూ ఎంత మొత్తం వచ్చినా సరే– ఒక్కో ఫైట్‌కు 14 రూపాయల చొప్పన మా సంక్షేమ నిధికి చెల్లించాలి కష్టాలలో ఉన్న వారికో, పని లేక ఖాళీగా ఉన్నవారికో ఈ నిధి నుంచి ఋణాల రూపేణా సహాయం అందుతూంటుంది. మేమంతా చాలా ఐకమత్యంతో



ఉంటూంటాం ఎన్ని భాషల వారైనా– మాలో భేదాభిప్రాయాలు ఎప్పుడూ రావు.

స్టంట్ మాస్టర్లు కాక సంట్ ఆర్టిస్టులు 250 మందికి పైగా ఉన్నారు మా యూనియన్‌లో. ఒక్కో ఫైట్‌కు– డూప్ వేసే వారికి కాని, ఫైట్‌లో పాల్గొనే వారికి కాని 300 నుంచి 350 రూపాయల దాకా ముట్టుతూంటుంది– ఆ ఫైటు ఎన్ని రోజులు చిత్రీకరింపబడినా. అద్దాల కిటికీని చీల్చుకు దూకే సమ్మశివం, కన్నాడి వరదన్‌లకు 500 రూపాయలకు మించి చెల్లింపబడదు. వాళ్ళది మరీ ప్రమాదకరమైన వృత్తి.

భగవంతుడు మాలో శక్తి సామర్థ్యాలు ఉంచినంత వరకు ఈ వృత్తిలో ఉంటాం ఒకప్పుడు నా ఛాతీ చుట్టుకొలత 35 అంగుళాలు. ఒకప్పటి మెలితిరిగిన కండరాలు వయస్సయ్యే కొద్దీ సడలిపోతూంటాయి. ఏ బాదర బందీ లేని ఆ రోజుల్లో కోడిగుడ్లు, మంచి వెన్న, పాలు, పళ్ళు పోషక పదార్థాలూ బాగా అరిగించుకొనే వాళ్లం. వాటి ధరలు ఇప్పుడు విపరీతంగా పెరిగినా– వాటిని తింటె జీర్ణించుకునే స్థితిలో లేము అసలు – బాదంపప్పును చూసి ఎన్నేళ్ళు యిందో!

ఇటీవల సెన్సార్ నిబంధనలు భయానక దృశ్యాల విషయంలో మరింత కఠినతరం చేయ బడ్డాయి. అయినా, రక్తం చిందేలా మరింత భయంకరంగా ఉండకుండా– గగుర్పాటు కలిగించే విధంగా చాకచక్యంతో స్టంట్లు కంపోజ్ చేయ వచ్చు.

ఒకటి మాత్రం చెప్పక తప్పదు.

ఈ సినిమా ఫీల్డులో ఒక్కొక్కరికి కొంత కాలం వరకు 'సీజన్'

ఆ తర్వాత ఏమవుతుందో ఎవరూ చెప్పలేరు నా సంగతీ అంతే.

[–జి. వి. జి.] ★

# అవీ - ఇవీ

★ ప్రపంచంలో అత్యధికంగా విక్రయమయ్యే ఖరీదైన సిగరెట్లలో ఒకటైన "బెక్సన్ అండ్ హెడ్జెస్" సిగరెట్లు తయారుచేసే సంస్థ రెండు నిమిషాల అడ్వర్‌టైజ్ మెంట్ షార్ట్‌ను తయారు చేసింది, అందుకయిన ఖర్చు 32 లక్షల రూపాయలు.

★ పలు మలయాళ చిత్రాలలో నటించిన వినీత (15) ట్రిమూర్ హాస్పిటల్‌లో కన్నుమూసింది విషం మూలంగా ఆ అమ్మాయి మరణం సంభవించి ఉండాలనీ, ఆత్మహత్య అయి ఉండొచ్చనీ పోలీసుల అభిప్రాయం, కేంద్రప్రభుత్వ అవార్డు పొందిన "అమ్మువింటె అట్టిన్‌కుట్టి" మలయాళ చిత్రంలో ఈ అమ్మాయి నటన బహుముఖ ప్రశంసలందుకుంది.

★ ఆల్‌ఫ్రెడ్ హిచ్‌కాక్ చిత్రం "టు కేచ్ ఎ థీఫ్" వగైరా ఎన్నో చిత్రాల్లో నటించిన కేరీగ్రాంట్ వయసు 79 "మీరు ఇప్పటికీ ఇంత చురుకుగా ఉండడానికి కారణ మేమిటి ?" అని ఓ విలేఖరి అడిగితే, "భార్య ఎప్పుడూ పడుచుగా ఉండడమే. నిరంతరం చలాకీగా కనిపించడానికి నాకు తెలిసిన చిట్కా అదే," అని జవాబిచ్చాడట ఆ నటుడు. అతని తాజా భార్య బార్బరా వయసు 30. అతనిదివరకు నాలుగోపడిలో అడుగెట్టబోతున్న ఇద్దరు భార్యలకు విడాకులిచ్చాడట.

★ పరస్పరం రెండుసార్లు వివాహాలు చేసుకొని, రెండుసార్లు విడాకులు ఇచ్చి పుచ్చుకున్న ఎలిజబత్ టేలర్, రిచ్చర్డ్ బర్టన్‌లు "ప్రైవేట్ లైఫ్" అనే నాటకంలో నటిస్తున్నారు. వారి జీవితాలకు – ఆ నాటకానికి ఎంతో సామీప్యం ఉందట.

★ సుప్రసిద్ధ ఇటాలియన్ చిత్రం "బైసికల్ థీవ్స్" లో నాయకుడుగా అమోఘంగా నటించిన లేంబర్టో మేగ్గియోరని ఇటీవల తన 73 వ ఏట రోమ్‌లో మరణించాడు. సినిమా నటన పట్ల ఏమాత్రం అనుభవంలేని ఇతను ఒక ఫ్యాక్టరీలో కార్మికుడుగా పని చేస్తూంటే, డైరెక్టర్ విక్టోరియా డెసికా చూసి, "బైసికల్ థీవ్స్"లో నటింపజేశాడు.

★ ఆంధ్ర, తమిళనాడు ముఖ్యమంత్రులకు మల్లే కర్నాటక ముఖ్యమంత్రి శ్రీ రామకృష్ణ హెగ్డేకు సినిమారంగంతో ప్రత్యక్షంగా కాకపోయినా – పరోక్షంగా కాస్త సంబంధముంది. ఈయన అల్లుడు మనోహర్‌లాల్ సినీ చిత్ర నిర్మాత.

★ "నాకు రాజకీయ రంగంలో ప్రవేశించే ఉద్దేశ్యం ఏమాత్రం లేదు" అని పలుమార్లు ప్రకటించిన ప్రముఖ కన్నడ హీరో డాక్టర్ రాజ్‌కుమార్ ఎంచేతో ఇటీవల కొత్త చిత్రాలను అంగీకరించడంలేదట.

★ "కొంతమంది సందేశాత్మక చిత్రాలంటూంటారు; మరికొందరు – సమస్యలకు పరిష్కారమార్గం చూపే చిత్రాలంటారు ... అంటే – ఏమిటో నాకెంతకీ బోధపడదు. పూర్వాశ్రమంలో నేను ఎన్నో సమస్యలలో చిక్కుకుని పరిష్కారమార్గం తోచకనే ఈ సినిమా రంగంలో ప్రవేశించాను. ఇక్కడ ఇప్పుడెన్నో కొత్త సమస్యలు ... వీటికి పరిహారం నాకే తెలీదు. ఇలాంటి నేను లోకాన్ని ఉద్ధరించే సినిమాలు ఎలా తీయగలను ?" అని సత్యజిత్‌రే ఇటీవల ఒక పాత్రికేయునికి చెప్పారు.


రుచిచూస్తే తెలుస్తుంది!
మేము
వుపయోగించిన
వస్తువులు
ఆ ప్రత్యేకతకి కారణం
ప్రకృతి సిద్ధమైన మూల పదార్థాలు. అందుచేత ట్రూ బిస్కట్లకి లభించాయి— స్వచ్ఛత, పోషకత్వం, సంపూర్ణత్వం ట్రూ బిస్కట్లు. ఆరగించి ఆనందించడానికి ఇతరులతో పంచుకోడానికి ఇతరులకి ఇవ్వడానికి అందరికీ కావలసిన అనేకరకాలు.
ట్రూ
బిస్కట్
with the extra energy of honey
TRUE
Glucose
TRUE
marie
BISCUITS
PERMITTED FLAVOURING AND COLOURING AGENTS USED
TRUE MARIE BISCUITS
Scrunch
TRUE biscuits
TRUE
NICE
biscuits
MONDE SELECTION
TRUE
biscuits
Y.LAKKAI CUSTARD CREAM
GLUCOSE
హనీ గ్లూకోజ్
గ్లూకోజ్ మరియు స్వచ్ఛమైన తేనెతో శక్తినిచ్చే బిస్కట్
SUGAR
మేరీ
అన్ని వేళలకి కాఫీ త్రాగేటప్పుడు, టీ తీసుకునేటప్పుడు లేక ఏ సమయంలోనయినా
MILK
COCOA
స్క్రంచ్
మింట్ చేరిన తియ్యని, కరకరలాడే చాక్లెట్ క్రీమ్ బిస్కెట్
MILK
SUGAR
నీస్
సహజమైన కొబ్బరి కురిడీతో చేసి పంచదార జల్లిన రుచికరమైన బిస్కెట్
ఏలక్కాయ కస్టర్డ్ క్రీమ్
MILK
పోషకత్వం కలిగి, గట్టిగావుండే కస్టర్డ్ క్రీమ్ మరియు ప్రకృతిసిద్ధమైన ఏలక్కాయలతో రుచికరమైన కలయిక, ఆరగించడానికి, అందించి ఆనందించడానికి
HTM AFL 2812

# వ్యాపారవిలువల పరిధిలో మానవతావిలువల సమాధి




సూర్యదేవర రామమోహన్‌రావు

ప్రతి అనుభూతిలోనూ, ఆనందంలోనూ, స్నేహంలోనూ 'హరి హరన్'లో వ్యాపార విలువలు బయటపడుతుంటాయి అతనిలో ఆ అలవాటు వేళ్ళు నాటటానికి కారణాలు ఏవైనప్పటికి – ప్రస్తుతం అతనితో పనున్న నాకు, అతను వ్యాపార పరంగా నా పని చేయటానికి నా నుంచి ఏం ఆశిస్తాడోనని ఊహాతీతంగావుంది

అతని దగ్గరకు వెళ్ళకూడదని మనస్సు ఆక్రోశిస్తోంది. అవసరం ముందుకు తోస్తోంది మనస్సు . అంతరాత్మల మధ్య సంఘర్షణ

ఓ సారి ఓ పత్రిక ఆఫీసుకి నేను రాసిన కథొకటి తీసుకొని వెళ్ళిన సందర్భంలో ఎడ్వర్టైజ్‌మెంట్ ఇచ్చేందుకు వచ్చిన 'హరి హరన్' తారసపడ్డాడు రిసెప్షన్ రూమ్‌లో ఎదురెదురు సోఫాల్లో కూర్చున్నాం అక్కడ కూర్చున్నానన్నమాటేగాని నా మనస్సంతా నేను రాసిన కథపైనే తిరుగుతోంది అలవోకగా ఓసారి తల పైకెత్తిన నాకు నా వైపే దీక్షగా చూస్తున్న 'హరిహరన్' కనిపించాడు నన్ను

చూసి — నా కళ్ళలో కళ్ళు కలిపి పలకరింపుగా నవ్వి లేచి వచ్చి నా ప్రక్కన కూచున్నాడు.

ఓ అపరిచిత వ్యక్తిని పరిచయం చేసుకో గలగటం గొప్ప కళ నా దృష్టిలో.

పాటుపడ్డ శిథిలాలయం లాంటి నా హృదయంలోకి ఎక్కువమందిని మిత్రులుగా ఆహ్వానించే చొరవ — కళ లేవు నాకు ఇవి రెండూ వ్యాపార దృష్టి ఉన్నవారికే ఉంటాయో ఏమో!

అసందర్భోచిత వాక్యలతో నన్ను కదిలించి— సందర్భంలోకి వచ్చి మొత్తానికి నన్ను పరిచయం చేసుకొని— తనను తాను పరిచయం చేసు కున్నాడు

"నేను నేనేంటి మా రాష్ట్రంలో (కేరళ) ఎవరైనా బతుకుతెరువు కోసం— బతుకుని పండించుకొనేందుకు రాష్ట్రాలు, దేశాలు, ఖండాలేకాదు గ్రహాలక్కూడా వెళ్ళేందుకు జంకరు," ఓ రోజు ఓ ఇరానీ హోటల్లో మూలగా ఉన్న టేబుల్ ముందు ఎదురెదురుగా కూచున్న నాతో హరిహరన్ అన్న మాటలవి.

"ఎక్కడికైనా, ఎంతదూరమైనా వెళ్ళి బతగ్గల మన స్థయిర్యం మాలో ఉన్నంత మీలో ఉండదు ఏమంటావ్" అని ప్రశ్నించాడు.

"నిజమే .." అన్నాను నేను.

"ఒక్కముక్కలో చెప్పాలంటే యూ ఆర్ యాన్ యాష్ ఆఫ్ సెంటిమెంట్ . . యామై కరక్ట్ ?"

"అఫ్‌కోర్స్ ."

సాదా సీదా లుంగీతో, గళ్ళ చొక్కాతో కాళ్ళకు స్లిప్పర్స్‌తో అతి సాధారణంగా కనిపించే హరిహరన్‌లో జీవితంపై, దాని విలువలపై ఇంతగా మెటీరియలిస్టిక్ భావాలున్నాయన్నా, కేరళ నుంచి వట్టి చేతుల్తో వచ్చి లక్షలు సంపా దించాడన్నా, ఎవ్వరూ నమ్మలేరు.

"స్నేహాలు, బంధుత్వాలు, నమ్మకాలంటూ మీ జీవితంలో సగం కాలాన్ని వాటి కోసమే తగలేస్తారు .." అంటుండగా సెగలు గక్కుతున్న రెండు టీలు తెచ్చి మా ముందుం చాడు సర్వర్.

"నాకు తెల్సు సార్. బంధుత్వాలంటే ఏంటి .. ? తల్లిదండ్రులు పేడా, పిడకా పిసికి సంపాదించినా, నలుగుర్ని ముంచి సంపాదించినా ఆ సంపాదించింది తమ పిల్లలకి మిగిలిస్తేనే ఆ పిల్లలు తమ తల్లిదండ్రుల్ని మెచ్చుకొనేది. లేకుంటే మమ్మల్ని కనటుని మిమ్మల్నెవడేడిపాడు అని అడగడం ఖాయం.

"ఇంతకీ నీవనేదేంటి . ?" ఎందుకో హరిహరన్ జీవితానుభవాల్ని సేకరించాలని పించింది

"ఏం లేదు సార్ కథలు కాకరగాయ లంటూ భావాలు . అనుభూతులు ఆనందాలు.. ప్రేమలు అంటూ మీరు రాస్తూన్న వాటివల్ల మీరేం సంపాదిస్తున్నారు. .?" నిలదీసి అడిగాడు హరిహరన్.

"కొన్ని అనుభూతులు... అనుభవాలు ... స్నేహాలు... భావానికి... భాషకు అందవు ..."

"అలా అంటే ఇలా అర్థం కాకుండా మాట్లాడతారు . ."

"ప్రాణాలకి తెగించి .. ఎందర్నో ఎదిరించి త్రివేంద్రంలో ఓ మారుమూల పేటలో ఉన్న నేను, కులం గాని కులం అమ్మాయిని, జిల్లాగాని జిల్లా అమ్మాయి అయిన పట్టుని ప్రేమించి పెళ్ళి చేసుకున్నాను."

"నీకు పెళ్ళయిందా ...?"

"ఏం కాకూడదా ..?"

"ప్రేమించి పెళ్ళి చేసుకున్నావా ...?"

"నీకు ఆశ్చర్యమనిపించవచ్చు. కాని ఇది నిజం. పట్టు తొలి రోజుల్లో నా మీద చాల అనురాగం కురిపించేది. కాని... రాను... రాను... పట్టు ఆశలు పురి విప్పాయి. ఆ ఆశలకు తగ్గ ఆర్థిక స్థితిని నేను అందుకో లేకపోయాను. దాంతో పట్టు నా మీద తన నిరసన తెలియ జేస్తుండేది అంటే అవసరాల ముందు .. కోర్కెల ముందు ప్రేమకి విలువ లేదు ...!"

"ఆగాగు . హరి. . ప్రేమని అంత తేలిగ్గా లెక్కించకు ఆ అనుభూతిని వర్ణించాలంటే అనుభవించిన మనస్సుకే సాధ్యం కాదు ..." అన్నాను హరి మాటల్ని త్రుంచేస్తూ.

"కరక్ట్. సార్ .. నేనూ అప్పట్లో అలాగే అనుకొనేవాణ్ని. ."

"మరి !?"

"ప్రేమా పోయింది — భార్యాభర్తల అను బంధమూ తెగిపోయింది.. ఎంతగానో నన్ను ప్రేమించింది అనుకున్న నా పట్టు నన్నొదిలేసి.. పైగా నిందలేసి. ప్రక్కింటి కరుణాకరన్‌తో లేచిపోయింది. లేచిపోయేముందు పట్టుకి మూడో నెల" అతని కళ్లవెంట నీళ్ల బొట్లు టప .. టప . . రాలిపడ్డాయి.

హరిహరన్ మీద జాలేసింది హరి భుజం తడుతూ "లే లే. .బాధపెట్టే ఆ నీ జ్ఞాపకాలు కెలుక్కోవద్దు లే. ." అంటూ హరిని లేపి — ఇద్దరం ఇండ్లవైపు బయల్దేరాం.

అంటే నీరజ కూడా నన్ను ప్రేమించటం అబద్ధమేనా . ? ఎందుకో అలా ఊహించాలం టేనే నా మనస్సు బాధగా మూల్గింది.

నీరజని చూడక ఇప్పటికే పన్నెండు గంట లయింది చూడకుండా వుండటం ఇక నా వల్ల కాదనిపించింది ఎప్పుడూ ఎదురుచూసే లిబర్టి సెంటర్ వద్ద ఆగి నీరజ ఇంటికి ఫోన్ చేసాను. నీరజ బయలుదేరబోతున్నట్లు చెప్పి ఫోన్ పెట్టే సింది

ఓహో భాషకి అందని అనుభూతి ప్రియ రాలికోసం ఎదురుచూట్టం. ప్రక్కన నడుస్తూన్న మనుష్యులుగాని, వస్తున్న శబ్దాలు గాని ఏవి అనుభవంలోకి రావటంలేదు నాకు.

బయి జీవితంలో.. అందునా యవ్వనంలో— ప్రేమించని — ప్రేమించబడని — ప్రేమించ టానికో — ప్రేమించబడటానికో — ప్రయత్నిం చని జీవి—జీవితానికి అర్థంలేదు

దూరంగా నీరజ వస్తూ కనిపించింది ఎప్పుడూ కారులో తిరిగే నీరజ నాకోసం నా పట్టుదలకోసం ఈ మధ్య నా దగ్గరకు వచ్చేప్పుడు మాత్రం నడిచే వస్తోంది పాపం మనస్సంతా ఆనందంతో గంతులేస్తోంది నీరజ ఆగమనంతో. ఏమిటీ అనుభూతి !

ఇద్దరం నవ్వులతోనే పలకరించుకొని అలా టాంక్‌బండ్ వైపు సాగిపోయాం ఇద్దరి మనస్సుల్లో ఎన్నెన్నో మధురభావాలు పెల్లుబుకు తున్నాయి. ఎన్నో చెప్పాలని.. మరెన్నో వినాలని. స్వీట్ నథింగ్స్‌తో కాలం దొర్లిపోవాలని కాంక్ష

మసక చీకట్లు క్రమ్ముకుంటున్నాయి ఇద్దరం ఓ సిమెంట్ బెంచీమీద కూచున్నాం నా చేతిని తన ఒడిలోకి తీసుకొని వేళ్ళతో ఆడుకుంటూ

"ఈ ఆనందం మనకు శాశ్వతమేనా. ?" మసక చీకట్లలో ఆశగా, ఆర్తిగా నాలోకి ఒదిగి పోతూ బేలగా అడిగిన నీరజను చూస్తూ నేను పొందిన ఆనందం వర్ణనాతీతం

నీరజకు చిలిపిగా కన్నుగొడుతూ "నీకెందుకా అనుమానం నీరూ. . ?" అన్నాను.

ఓ నిట్టూర్పు విడిచి ఆలోచిస్తూ వుండి పోయింది నీరజ

చూపు మరల్చుకోలేని అందం నీరజది పాలరాతి విగ్రహంలా తీర్చిదిద్దినట్లుండే కను, ముక్కుతీరు హుందాగా ఉండే చీరకట్టు స్టైల్‌గా వుండి చూపరులకి గౌరవం కలిగేలా వుంటుంది

ఎమ్ ఏ చదివానన్న గర్వంగాని, డబ్బుందన్న ధీమాగాని, అందగత్తెనన్న అహంకారంగాని ఏ కోశానా నీరజలో కనబడవు.

"నవీన్. ." ప్రేమగా పిలిచింది నీరజ

"వూ . !"

"ఏ కారణాలవల్లనయినా నువ్వు నన్ను పెళ్ళి చేసుకోకపోతే నేను బ్రతకను.. "

ఠక్కున నీరజ నోరు మూసేసాను.

"అంత అన్యాయంగా మాట్లాడకు నీరు " అన్నాను బాధగా

"ఏమో . నాకెందుకో కొన్ని రోజులుగా మనస్సంతా ఆందోళనగా వుంటోంది మనస్సు కీడును శంకిస్తోంది . ." ఆగింది నీరజ సన్నటి వణుకుతో

"ఎందుకని . ? సరే .. ఏం చేద్దాం...?"

"నిన్ను శంకిస్తున్నానని గాని, అనుమాని స్తున్నానని గాని అనుకోవద్దు ఒక్కటి మాత్రం చెప్పగలను. నా జీవితంలో తొలిసారి అదే ఆఖరి సారి ప్రేమించింది నిన్ను మాత్రమే."

"అది నా అదృష్టం .."

"నాదో చిన్న కోరిక... తీరుస్తావా .. ?" సందేహిస్తూ అడిగింది నీరజ.

"నీకెందుకా సందేహం ...?"

"ఈ రాత్రే ఇప్పుడే మనం పెళ్ళి చేసుకోవాలి" నీరజ గుండె ఉద్వేగంతో కొట్టుకుంటున్నట్లు నాకు స్పష్టంగా వినబడుతోంది.

నీరజ కోర్కెకి ఆశ్చర్యపోయాను. నీరజ ఇలా హఠాత్తుగా ఈ కోర్కె కోరటానికి — తమ ప్రేమ విషయం చూచాయగా వాళ్ళింట్లో తెలిసి, కొద్దిగా బెదిరించి, యుద్ధప్రాతిపదికమీద పెళ్ళి సంబంధాలు చూస్తున్నట్లు, అందుకే నేను తనకు దక్కకుండా పోతానేమోననే భయంతో ఈ కోర్కె కోరినట్లు, నాకు తెలియక పోవటం నా ఆశ్చర్యానికి కారణమైంది

నేనేదో మాట్లాడబోతుండగా నా నోటికి తన అరచేతిని అడ్డం పెట్టి "నువ్వింకేం చెప్పకు నా మీద నమ్మకం లేదా అనిగాని మన పెళ్ళి కాదని అపనమ్మకమా ? అని గాని నన్నడక్కు నవీన్ ." సన్నగా వణికిపోతూ దీనంగా నాకేసి చూస్తూ అడిగిన నీరజ కోర్కెని కాదనగలటం ఆత్మహత్యతో సమానం.

"ఏ దుష్టశక్తో మనల్ని విడదీస్తుందని నా మనస్సు శంకిస్తోంది మనం పెళ్ళి చేసుకుంటే ఆ తరువాత ఆ శక్తి మనల్ని విడదీయలేదని నా ధైర్యం ఈ పెళ్ళి నా మానసిక బలానికి ఏమంటావ్"నాగుండెలమీద పూర్తిగాఒరిగిపోతూ అడిగింది నీరజ.

వెంటనే ఇద్దరం టాంక్‌బండ్ నుంచి బిర్లామందిర్‌లోకి బయలుదేరాం. రాత్రి ఎనిమిది గంటలు కావస్తోంది దారిలో దండలు తీసుకోవాలని తెలుసు — కాని — నా జేబులందు కంగీకరించవు పూలకొట్టు దగ్గర ఆగిన నీరజ నా వైపు చూసి తనక్రింద పెదాన్ని పైపంటితో నొక్కి చిలిపిగా నవ్వుతూ తన హేండ్ బ్యాగ్‌లో నుంచి డబ్బులు తీసింది.

రెండు దండలు తీసుకొని బిర్లామందిర్ కొండ ఎక్కసాగాం.

ఈ రోజు నా జీవితంలో గొప్ప మలుపు తెస్తుందని — నీరజ నా భార్య అవుతుందని ఎన్నడూ ఊహించని విషయం కావటంతో ఆందోళన, ఆనందం కలగలసి నన్ను ఎక్సైట్ చేస్తున్నాయి

దేవుడి ముందు ఇద్దరం దండలు మార్చుకున్నాం. నీరజ కోర్కెమీద కొండమీదే కాసేపు కూర్చుని క్రిందకు దిగొచ్చాం.

ఇప్పుడేం చేయాలి . ?!

"పదా" అంది నీరజ నన్ను ముందుకు తోస్తూ

"ఎక్కడికి ?" ఆశ్చర్యంగా అడిగాను

"ఏ భర్తైనా భార్యని పెళ్ళికాగానే ఎక్కడికి తీసుకెళ్తాడు ? కొంటెగా కన్నుగీటుతూ, నన్ను ఉడికిస్తూ అడిగింది.

నాకు మతిపోయింది

నీరజ ఆత్మస్థైర్యం కోసం ఈ పెళ్ళి

## వ్యాపార విలువల...

ఇప్పుడు చేసుకున్నానుగాని — లేకుంటే ఆర్థికంగా నా కాళ్ళ మీద నేను నిలబడ్డనాడు చేసుకోవాలన్నది నా అభిమతం.

"అబ్బ . పద .. నవీన్ ఎంతసేపు ఇక్కడ నిలబెడతావు . ?" తెలిసినవారు కనిపిస్తారేమోనన్న బెదురుతో చుట్టూ పరికిస్తూ నన్ను తొందరచేస్తోంది నీరజ

"అందుకే " అని చెప్పబోతున్న నా నోరు మూసేసి

"చాల్చాలు మహానుభావా . చాలు ఉపన్యాసం తరువాత" అంటూ ఆటోని పిలిచి నా రూమ్ అడ్రస్ చెప్పింది.

నీరజ ధైర్యానికి నాకాశ్చర్యమేసింది నీరజలో ఎంత అందముందో, అంత విజ్ఞానం ఉంది. ఎంత సౌకుమార్యం ఉందో అంత తెగింపు ఉంది

ఆటో రూమ్ దగ్గరకొస్తున్న కొద్ది నాలో నాకు తెలియకుండానే సన్నని వణుకు ప్రారంభమైంది మనస్సు ఎక్కడా నిలబడటంలేదు నీరజ దీర్ఘంగా ఎక్కడో ఆలోచిస్తోంది

ఆటో ఆగింది ప్రక్క ఇంట్లోనేవుంటున్న హరిహరన్ మా ఇద్దర్ని చూసి ఏమనుకుంటాడో పైగా అతనికి ఆడవాళ్ళంటే చచ్చేంత కోపం అదృష్టంకొద్ది మేం ఆటో దిగుతున్న సమయంలో ఎవ్వరూ బయటలేరు.

ఇద్దరం రూమ్‌లోకి వచ్చాం ఆకలిగా వుంది ఆందోళనగా వుంది.

"ఆకలిగా ఉంది నవీన్ "గారంగా అడుగుతున్న నీరజకి బాత్ రూమ్ చూపించి మొహం కడుక్కొనమని, నేను బజారుకెళ్ళి క్యారియర్‌లో భోజనం పెట్టించుకొచ్చాను

### మెదడు పరీక్షకి పరికరం!

మెదడులోని రక్తనాళాల పరీక్ష జపాను లోని పరిశోధకులు ఒక కొత్త పరికరాన్ని రూపొందించారు ఇది సురక్షితమైన ప్రక్రియ పైగా ఈ పరికరాన్ని కోరిన చోటుకి సులభంగా తీసుకెళ్ళవచ్చు ఈ పరికరం కొనను మెడపైగల నరాలపై అదిమి ఉంచుతారు రెండు మూడు నిమిషాల్లో రక్తనాళాల పరిస్థితి తెలుస్తుంది మెదడు వ్యాధి అపోప్లెక్సీ వలన జపానులో చాలామంది మృత్యువాత పడుతున్నారు. ఈ పరికరంవలన ఈ వ్యాధిని గుర్తించటానికి, నిరోధించటానికి వీలవుతుంది ప్రభుత్వ పరిశోధనాభివృద్ధి సంస్థ ఈ పరికరం తయారీకి సహకరించింది దీనిని సమూహ వైద్య పరీక్షలకు ఉపయోగించవచ్చు

"భోజనం "

"భోజనమా .?"

"అవును."

నీరజ చిలిపిగా నవ్వుతూ 'తొలిరాత్రి ఎవరైనా పాలు, పండ్లు, స్వీట్లు తెచ్చుకుంటారు గాని భోజనం తెచ్చుకుంటారా ?"

తొలిసారిగా నీరజ భోజనం ముద్దలు కలిపి పెడుతుంటే ఎన్నడూ తిననంత సంతృప్తిగా తిన్నాను

చాలాసేపు ఆ కబుర్లు ఈ కబుర్లు చెప్పుకున్నాం

ఉంది ఒకే చాప ఒకే దిండు రెండు దుప్పట్లు ఎలా ?!

మొత్తానికి ఒకే చాపమీద పడుకున్నాం అప్పటివరకూ ఆందోళన చెందిన నా మనస్సు మధురోహలవైపు మరలింది లైటార్పి ఉన్నా ఇద్దరం నిద్దర పోవటం లేదని ఇద్దరికి తెలుసు

నా పిరికితనానికి నాకే నవ్వొచ్చి బెదురుగానే నా కుడిచేయి నీరజ భుజం మీద వేసాను చీకట్లోనే

"అయ్యగార్కి ఇప్పటికి తెలిసిందా నేను ప్రక్కనున్నానని, భార్యనని, ఇది తొలి రాత్రని " అంది నన్ను ఉడికిస్తూ, నావైపుకి తిరుగుతూ

ఆ రాత్రి మేం పొందిన ఆనందం అనూహ్యం అజరామరణం,

నీరజ తడుతూంటే బద్ధకంగా లేచాను కిటికీలోగుండా రూమ్‌లోకి వస్తున్న సూర్య కిరణాలు చూసేసరికి నా మత్తు వదిలిపోయింది అప్పటికే నీరజ లేచి మొహం కడుక్కొని ఫ్రజెంట్‌గా నావైపు చూస్తోంది నా ప్రక్కనే కూర్చుని

నీరజను చూస్తుంటే రాత్రి జరిగింది కలా నిజమా అన్న సందేహం కలిగింది "ఏంటి .నవీన్ అలా చూస్తున్నావ్ ఇదంతా కలా నిజమా అనా ?" కరక్ట్‌గా నా మనస్సులోని భావాల్ని కనిపెట్టి అడుగుతుంటే ఆశ్చర్యపోయి ఆర్తిగా, ప్రేమగా చేతులు చాపాను

నిండుగా నా కౌగిలిలో ఒదిగిపోయింది

"నవీన్. . రాత్రి ఇంటినుంచి వస్తూ వస్తూ మా ఫ్రెండ్ సుశీల వాళ్ళింటికి వెళ్తున్నానని చెప్పొచ్చాను ఆలస్యమైతే సుశీల వాళ్ళింటికి మనిషిని పంపిస్తారు నేనెళ్ళొస్తాను " అంది ఆ అనటంలో నన్ను విడిచిపోలేని బాధని గ్రహించగలిగిన నాకు, భార్యాభర్తల అనుబంధంపై తొలిసారిగా గౌరవం, ప్రేమ, పవిత్ర భావం కలిగాయి.

స్నానం చేసేందుకు బాత్‌రూమ్‌లోకి వెళ్ళిన నీరజ చన్నీళ్ళు పోసుకోలేక చాలాసేపు ఆలస్యం చేసింది చొరవగా బాత్‌రూమ్‌లోకి వెళ్ళిన నాకు థ్రిల్‌తోపాటు నీరజకు ఆ కష్టం కల్గించిన నాపై నాకే కోపం వచ్చింది

వణికిపోతూ చన్నీళ్ళ స్నానం చేసినా నాపై చెక్కుచెదరని ప్రేమ, ఆరాధన నీరజ కళ్ళలో







చూసిన నాకు మెటీరియలిస్టిక్ జీవితంపై యిష్టం ఎలా కలుగుతుంది — విముఖతేగాని

బయలుదేరబోతూ బాధగా చూస్తూన్న నన్ను ప్రేమగా కౌగిలించుకొని మూగగా వుండి పోయింది నీరజ ఓ నిముషం.

ఎంత బాధగా ఉన్నా, మరెంతో దిగులుగా ఉన్నా నీరజని ఆటో ఎక్కించక తప్పలేదు

నేను రాత్రి ఆలోచనల్లో ఉండగా బయట నుంచి హరిహరన్ గొంతువినిపిస్తోంది. ఏవిటా అని బయటకొచ్చి హరిహరన్ పోర్షన్‌వైపు వెళ్ళాను. హరిహరన్ నన్ను చూస్తూనే అమాంతం కౌగలించుకొని లోనికి తీసుకెళ్ళి స్వీట్సు ప్లేటు అందిస్తూ ''ఈవిడ నా భార్య పట్టు వీడు నా కొడుకు అయ్యప్ప'' అంటూ 35 ఏళ్ళున్న ఓ స్త్రీని, పదేళ్ళున్న కుర్రాడ్ని పరిచయం చేసాడు.

నాకంతా అయోమయంగా వుంది. రాత్రి నా జీవితంలో జరిగిందానికే మతి బోయి ఛస్తూంటే మరలా ఇదొక షాక్ !

నా పరిస్థితి అర్థం చేసుకున్న హరి ''పద నవీన్, అంతా నీకర్థమయ్యేలా చెబుతాను'' అంటూ హరి తన సొంత హోటల్ వైపు దారి తీసాడు

హరిహరన్‌కి ''హోటల్ అయ్యప్ప'' అనే పేరుతో పెద్ద హోటలుంది అంతే కాదు హైద్రాబాద్‌లో మూడు మేడలున్నాయి. ఇంకా లెక్కతెలియని ఆస్తులు చాలా వున్నాయి కాని ఇంత ఉన్నట్లు, ఇదంతా పదేండ్లలో సంపాదించి నట్లు చాలా తక్కువమందికే తెలుసు.

హోటల్లోకి రాగానే ఓ పది నిముషాలు హోటలంతా చుట్టివచ్చి ఓ మూల్న కూర్చున్నాం. హరిహరన్ క్యాష్ కౌంటర్‌లో లేకున్నా హోటల్ సజావుగా సాగేలా నమ్మకమయిన వాళ్ళని పెట్టు కున్నాడు

హరిహరన్ చెప్పసాగాడు — ''ప్రతి మనిషిని నేనిదిస్తాను, నువ్వు నాకేం ఇస్తావు .?'' అనే వ్యాపార ధోరణితో బ్రతుకుతున్న నాకు, వ్యాపార విలువలకన్నా గొప్పవి చాలా వున్నాయని నీవు చెబుతుంటే నేను నమ్మలేదు. అందుకే నేను విపరీతంగా సంపాదించినా నా కంటూ కొద్ది మంది ఆప్తుల్ని సంపాదించుకోలేకపోయాను.

కాని . నీ విలువలే గొప్పవి. ఇలా ఎందు కంటున్నానంటే...''

నేనందుకున్నాను ''అక్కర్లేదు హరి నాకు తెలిసింది. నీ భార్యా . కొడుకు. '' ఆర్ద్రోక్తితో ఆపాను

హరిహరన్ నవ్వి తల వంచుకున్నాడు. తను పరిపూర్ణంగా నవ్వటం, సంతోషించటం ఇదే చూట్టం మొదటిసారి.

* * *

పది రోజులు గడిచాయి. నీరజ జాడలేదు ధైర్యం చేసి నీరజ వాళ్ళింటికి ఫోన్ చేశాను. ఊరెళ్ళిందని చెప్పారు.

అంతకు ముందు ఎన్నోసార్లు నా ఉద్యోగ విషయంలో రికమండ్ చేస్తానంటున్న హరిహరన్‌ని వద్దని వారించాను కాని అప్పటి నా ఆశయం ఇప్పుడు నా నీరజకి తిండిపెట్టవు. ఇప్పుడు నాలో, అప్పటి, ఆ, ఆశయాలకన్న నా నీరజను సుఖపెట్టాలన్న కోర్కె బలీయమైంది.

ఆశల పరిధిలో ఆశయాలు సమాధి కాక తప్పదు.

ఓ నిర్ణయాని కొచ్చిన నేను, నాకు రహస్యంగా పెళ్ళయిన రెండో వారంలో హరిహరన్ హోటల్‌లో మేనేజర్‌గా చేరాను.

స్నేహాన్ని స్నేహంగా . ప్రేమని ప్రేమతో చూడలేని వార్ని, ప్రతిదాన్ని వ్యాపారంగా ఆలో చించే మెటీరియలిస్టిక్ మనుష్యులంటే నాకెంతో అసహ్యం. తన భార్య, బిడ్డ తిరిగి రావటంతో హరిహరన్‌లో కూడా నా భావాలే మొలకెత్తాయి.

మరో పది రోజులు గడిచాయి.

ఇప్పుడు నా ఆర్థిక పరిస్థితి మెరుగు పడింది హరిహరన్ నాకు నెలకు ఏడొందలిస్తా నన్నాడు అప్పుడే కొంత అడ్వాన్స్ తీసుకొని కాపరానికి కావల్సిన కొంత సామాను హరిహరన్ భార్య సలహామీద తీసుకొచ్చాను. ఈసామానంతా ఎందుకు తెస్తున్నానో అర్థంకాని హరిహరన్, ముందుముందు నేను పెళ్ళి చేసుకొంటే పనికి వస్తుందనే భావనతో తెచ్చుకుంటున్నానని అర్థం చేసుకున్నాడు.

ఇప్పుడుండే గదికి తోడుగా మరో గది తీసు కొన్నాను. ఇప్పుడు నాకు పూర్తి నమ్మకం కుదిరింది నా నీరజను గొప్పగా సుఖపెట్టలేక పోయినా. పోషించగలను

అందుకే ఇక నీరజను తీసుకొచ్చుకోవాలని ఆ సందర్భంలో నీరజ తల్లిదండ్రులకి ఎదురు తిరిగైనా నా భార్యను నేను దక్కించుకోవాలని నిర్ణయించుకున్నాను

నీరజకోసం వాళ్ళింటికి వెళ్ళిన నాకు ఓ దుర్వార్త చెవినబడింది

నీరజకు నాలుగు రోజుల క్రితం పెళ్ళయి మొగుడితో అమెరికా వెళ్ళిపోయిందని చెప్పారు

ఈ మాట విన్న నాకు నవనాడులు కృంగి పోయాయి. ప్రపంచం అంతా గిర్రున తిరుగు తున్నట్లు భావన—

నా ఆశల్ని, అనుభూతుల్ని కుప్ప కూల్చి వెళ్ళిపోయింది.

నీరజ ఇంతపని చేయగలిగిందా ?

ఎన్ని తీపి మాటలు... !

ఎంత ప్రేమ ... !

ఎంత అభిమానం ... !

ఎంత ఆరాటం . . ! చూపించింది

ఇవన్ని మర్చిపోయి ఓ కోటీశ్వరుడ్ని పెళ్ళి చేసుకొని అమెరికా వెళ్ళిపోయిందా .. !

ఎంత దారుణం .. !

ఎంత నటన . !

ఎంత వంచన .. !

ఎంత మెటీరియలిస్టిక్ మనిషి ...!

వాడు . ఆ డబ్బున్న రోగ్ మరొకడి పెళ్ళాన్ని . అయినా వాడిదేం తప్పు ... !?

* * *

క్యాష్ కౌంటర్‌లో కూచున్న నవీన్ ఎవరో కష్టమర్‌తో అంటున్నాడు —

''శౌక్యం లేకుండా. .ఇచ్చి పుచ్చుకోవటం






బులుసు వేంకటరమణయ్య

# దండకారణ్యం దైత్యుల నివాసం ఎలాగయింది?

మహా మునులందరూ నైమిశారణ్యంలో నివసిస్తూ ఉంటారు. రాక్షసులకు లంక నివాస స్థలం ఆ రాక్షసులు దండకారణ్యంలో నివసించడానికి కారణమేమి ? అనే సందేహం కలగడం సహజం.

సూర్యవంశపు రాజులలో ఇక్ష్వాకువు చాలా ప్రసిద్ధుడు. ఆయనకు నూరుగురు కొడుకులు కడసారి కొడుకు దండుడు దండుడు తక్కిన సోదరులవలె తండ్రియెడల వినయవిధేయతలతో ప్రవర్తించక– ఆయనను ఎదిరించి, స్వతంత్రుడై కొంత సైన్యాన్ని పోగు చేసుకొని దక్షిణ ప్రాంతానికి వచ్చి ఒక నగరాన్ని నిర్మించుకొని, అది రాజధానిగా, ఆ పరిసర ప్రాంతాలని పాలిస్తూ ఉండేవాడు. అతడు ధూర్త స్వభావం కలవాడు. ఒకనాడు అతడు తన నగర సమీపంలో తిరుగుతూ ఉండగా శుక్రాచార్యుని పుత్రిక అయిన అరజ కానవచ్చింది అరజ గొప్ప అందకత్తె. ఆమెపై దండునికి వ్యామోహం కలిగింది అతడామెను కోరాడు. ఆమె తిరస్కరించింది. తాను రాజననే అహంకారంతో, తన్నెవ్వరూ అడ్డుకునేవారు లేరని అతడు అరజను బలాత్కారంగా పట్టుకొన్నాడు ఆమె అతి కష్టంమీద అతనినుండి విడిపించుకుని తండ్రి వద్దకు పోయి దండుని అవినీతిని తెలియ జేసింది.

కుమార్తెవలన యీ సమాచారం వినిన శుక్రాచార్యునికి దండునిపై తీవ్రంగా కోపం వచ్చింది అతడు దండునివద్దకు వెళ్లి "ఓరీ దుర్మార్గుడా ! నీవు రాజుననే అహంకారంతో కామాంధుడవై నా పుత్రికను బలాత్కరించావు. దీనికి తగిన శిక్షను అనుభవించు నీవు పాలించే యీ నూరు యోజనాల ప్రాంతమూ ఇకమీద ఘోరమైన అరణ్యమై, నీ పేరు శాశ్వతంగా ఉండేటట్లు దండకారణ్యమని ప్రసిద్ధమై, మానవులకుకాక రాక్షసులకు నివాసమై ఉంటుంది. నీవు సుందుడనే రాక్షసుడుగా జన్మిస్తావు" అని శపించాడు.

తర్వాత ఆయన శపించినట్లే ఆ ప్రాంతం మహారణ్యమయి, రాక్షసులకు నివాసమయింది అక్కడ నివసిస్తూఉండే మునులను ఆ రాక్షసులు పెక్కు విధాల హింసించేవారు. దండుడు సుందుడై ఘోర రాక్షసి అయిన తాటకను పెండ్లాడినాడు సుబాహు, మారీచులు ఆ రాక్షస దంపతుల పుత్రులే !

శ్రీరాముడు తన వనవాస సమయంలో అక్కడి రాక్షసులను సంహరించి, మహామునులకు రక్షణ కల్పించాడు

ఆ మహారణ్యానికి దండుని పేరు — అతని అపకీర్తిని చాటుతూ స్థిరంగా నిలిచి పోయింది. 

---

లేకుండా . . వ్యాపార పరంగా ఊపిరి పీల్చందే ఈ ప్రపంచంలో బ్రతకలేం సార్ . . "

దూరంగా వుండి నవీన్ మాటలు విన్న హరిహరన్‌కి మతిబోయింది. పది రోజుల్లో ఇతనిలో ఇంత మార్పా. . ! ?

అంతేలే, కేష్ కౌంటర్‌లో కూచున్నాడు గదా... డబ్బుని చూడగానే ఎవరైనా అంతే

*　　*　　*

నవీన్ ప్రేమ... పెళ్ళి విషయాలలో ఘోరంగా విఫలమయి జీవితపు విలువల్ని మార్చుకున్నాడని హరిహరన్‌కి తెలియదు.

*　　*　　*

గాఢంగా ప్రేమించిన నీ ప్రియుడ్ని, నీవు రహస్యంగా పెళ్ళి చేసుకున్న నవీన్‌ని చంపేస్తాం మేం చూసిన సంబంధం చేసుకోకపోతే అని బెదిరించిన తండ్రినీ, అన్నల్ని చూసి నీరజ

## వ్యాపార విలువలు...

భయపడిపోయినట్లు — ముందు నవీన్ ప్రాణాన్ని కాపాడటానికే ఇష్టంలేని పెళ్ళి చేసుకున్నట్లు, తెల్లవారే — ఇష్టం లేకుండా పెళ్ళి చేసుకున్న గిరిధర్‌కి తన గాథంతా చెప్పుకొని తనని, నవీన్‌ని కలపమని అర్థించటం — అందుకు గిరిధర్ సానుభూతితో మాటివ్వటం నవీన్ కెలా తెలుస్తాయి ...?

అమెరికా వెళ్ళిన మరుక్షణం నుంచే నవీన్‌ని అమెరికాకి పిలిపించి ఇద్దర్ని కలిపే ప్రయత్నాలు గిరి ప్రారంభించినట్లు—నీరజ దిగులుతో, బాధతో నవన్ కోసం ఎదురు చూస్తున్నట్లు గిరికి, నీరజకేగా తెలుసు —

ఎదురు చూడని అమెరికా ఆహ్వానం, నీరజ పవిత్రత, ఆత్మస్థయిర్యం నవీన్‌కి మరలా ఏ విలువల్ని బోధిస్తుందో —

*　　*　　*

సాధ్యమైనంత వరకు మూటా ముల్లె కట్టుకొని హరిహరన్ కొడుకుని అక్కడే వదిలేసి వచ్చేయమని హరిహరన్ భార్య పట్టుకి ఆమె ప్రియుడు రాసిన ఉత్తరం సంగతి తెలిస్తే హరిహరన్ విలువలెలా మారాయో. .??

రెండవసారి లేచిపోవాలా ? వద్దా ? అనే మీమాంసలోపడ్డ పట్టుకి జీవితంమీద ఎలాంటి విలువలున్నాయో అనూహ్యం... 

### అంకితం

పూజ్యులు, గౌరవనీయులు, వైజ్ఞానిక కథా రచయిత శ్రీ కె. సదాశివరావుగార్కి కృతజ్ఞతలతో.

— రచయిత

# కొత్త పెళ్ళికూతురు తన అనుభవాన్ని చెబుతోంది. యవ్వనంలో ముఖంపై వచ్చే మొటిమ లెలా పోతాయో చెబుతోంది.

"యవ్వనంలో మొటిమలు రావడం సహజం
వాటిని శుభ్రం చేసి అదుపులో పెట్టడానికే ఎప్పుడూ క్లియరసిల్ వాడటం"



**" నాకు 18 ఏళ్లొచ్చేసరికి మొటిమలు రావడం మొదలెట్టాయి...**

అయితే నేనంతగా పట్టించుకోలేదు ఇంకొంచెం ఎదిగిన తర్వాత ఒక రోజున ఒక అబ్బాయి చూడటానికి వచ్చాడు నన్ను

**మరి అతను చూసీ చూడటంతోనే నచ్చలేదన్నాడు**

నేనైతే కలలో గూడా అనుకోలేదు మొటిమలు యింత పనిచేస్తాయని, యిలా దారిలో అడ్డుకుంటాయని నా స్నేహితురాలు జయతో చెప్పానిది

**ఇక అప్పుడు జయ నాకు క్లియరసిల్‌తో ఒకదారి చూపించింది**

నేను క్లియరసిల్ రోజుకు రెండుసార్లు రాసుకోవడం మొదలెట్టా క్రమం తప్పకుండా వాడుతూ వచ్చాను మరి తర్వాత ఒక రోజున ఏమైందంటే, నా స్నేహితురాలి యింట్లో అదే అబ్బాయి కలిసాడు, యిక అలాగే కన్ను ఆర్పకుండా చూస్తూ వుండిపోయాడు!"

**క్లియరసిల్ వేనిషింగ్ మెడికేషన్ మరియు క్లియరసిల్ స్కిన్ కలర్డ్ మెడికేషన్—యీ రెండూ తమ విశిష్టమైన త్రివిధ చర్యతో పనిచేస్తాయి**



1. మొటిమలను తెరుస్తాయి
2 మొటిమలను శుభ్రం చేస్తాయి
3 మొటిమలను ఆరబెడతాయి

**క్లియరసిల్‌కి ఇప్పుడొక జోడు!**

ఒకటైతే మీ కెరిగిన క్లియరసిల్ స్కిన్ కలర్డ్ మెడికేషన్ మొటిమల్ని కనిపించకుండా చేస్తూ, తన ప్రభావాన్ని చూపిస్తుంది మరొకటైతే, కొత్త క్లియల్‌సిల్ వేనిషింగ్ మెడికేషన్ చర్మంలో కలిసిపోతుంది, రాసుకున్నట్టే కనిపించకుండాను, మరి తన ప్రభావాన్ని చూపిస్తుంది అలంకరణతో సౌందర్యం, మందుకి మందూను

**క్లియరసిల్ ప్రతి రోజూ రెండుసార్లు రాసుకోండి**

మొదట మీ ముఖాన్ని కడుక్కోండి ముఖం అంతటిపైనా క్లియరసిల్ రాసుకోండి, మొటిమలున్నచోట మరి కొంచెం ఎక్కువగా, మొటిమలు పోయిన తర్వాత గూడా క్లియరసిల్ రాసుకుంటూనే ఉండండి ఎందుకంటే క్లియరసిల్, చర్మంలో ఎక్కువగా గల నూనెని లాగేస్తుంది, తద్వారా మొటిమల్ని రాకుండా అదుపులో పెడుతుంది




**కొత్త వేనిషింగ్ మెడికేషన్**

**స్కిన్ కలర్డ్ మెడికేషన్**

## క్లియరసిల్ – ప్రపంచంలోని నం. 1 మొటిమల క్రీమ్

OBM-8625-R TEL

సీరియల్

# ప్రాణసమురళి

కొడాలి సాంబశివరావు

9

*(గత సంచిక తరువాయి)*

మురళి తన బట్టల్ని సూట్‌కేసులో సర్దుకుంది అది గమనించిన సరస్వతి ఆశ్చర్యంగా అడిగింది "ఎక్కడికే ప్రయాణం?" అని.

మురళి చిన్నగా నవ్వి "రాజమణిగారు ఓ పది రోజులు తమ ఇంట్లోనే వుండమని అడిగారు. పెద్దామె మాట కాదన్లేక ఒప్పుకున్నాను. వెళ్ల మంటావా పిన్నీ ?"

"దానికేం భాగ్యం. వెళ్లు. ఆవిడకు నీవంటే ఎంతో ప్రీతి వెళ్లు ..వెళ్లు. ఇప్పుడు కాకపోయినా రేపయినా ఆ ఇంటి కెళ్లవలసిన దానివే గదా.. ఆమె మనసు నొప్పించక మసులుకో —" అని సంతోషంగా సాగనంపింది సరస్వతి. ఆమెకు చాలా ఆనందంగా వుంది మురళి ఒక పట్టాన దారికి రాదనుకుంది. వాళ్ల సిరి సంపదల్ని చూసి అంగీకరించి వుంటుందనుకుంది. ఏది ఏమైనా ఆమె కోరినట్లే జరుగుతున్నందుకు ఏనుగెక్కినంత సంబరంగా వున్నది.

ఆ విధంగా మురళి బస రాజమణి గారింటికి మారింది.

శివశంకర్ తన గదిలో పడుకుని వున్నాడు ఆ గదిలో అడుగు పెట్టబోయిన మురళి లోపలి నుంచి మాటలు వినిపించగానే ఆగిపోయింది.

"శంకూ ! మన ప్రేమ మీ పెద్దలు హర్షిస్తారా ?—" అది ఎవరిదో స్త్రీ కంఠం.

"ఎందుకు హర్షించరు ?—" అది అతని స్వరం.

"మన మతాలు వేరు.— దేశాలు వేరు."

"నీకా భయమే అక్కర్లేదు. నా తరుపున పెద్ద వాళ్లెవరూ లేరు, మా గ్రానీ తప్ప. ఆమె నా కోరిక కాదనదు. ఆవిడకు నేనంటే ఎంతో మక్కువ అసలు ఆమె బతికేది నా కోసమే అంటే ఆశ్చర్య పోవాల్సిన పని లేదు. ఈ సంవత్సరంతో నా చదువు ముగుస్తుంది మూమ్మని ఇండియా వెళ్లి మేరేజ్ చేసుకుందాం —"

మురళి అంతులేని విస్మయానికి గురయింది

"శంకూ ! ప్రేమంటే ఏమిటో నీకైనా తెలుసా ?"

"ఏమో నాకు మాత్రం ఏం తెలుసు ?"

"మరి నన్నెందుకు ప్రేమించావు ?"

"అది కూడా తెలీదు. నీ రూపం నన్ను ఆకర్షించింది. నీ వంటే ఇష్టం కల్గింది."

"బావుంది. ఇష్టంతోనే పెళ్లి చేసుకుంటే మనం ఏం సుఖపడగలము ? ప్రేమ వుండాలి "

"నాకవన్నీ తెలియవు మీనా ! నీవు కావాలి నీ నవ్వు కావాలి. అంతే ..."

"ఒకవేళ నిన్ను మ్యారేజ్ చేసుకోకుండా వదిలేస్తే ?—" ఆమె గలగల నవ్వు ..

"అమ్మో ! పిచ్చివాడినైపోనూ ? హాస్యానికైనా అలా అనకు, నేను భరించలేను "

"ఊరికే తమాషాకన్నాను నిన్ను దూరం చేసుకుని నేను మాత్రం బ్రతగ్గలనా ?"

ఆ తరువాత గలగల నవ్వులు —!

మురళి కుతూహలాన్ని అణచుకోలేక పోయింది లోపల మాట్లాడేదెవరో చూడాలన్న తలంపుతో తలుపు నెట్టుకుని లోపలకు వెళ్ళింది అక్కడ శివశంకర్ మంచంమీద పడుకుని వున్నాడు. అతని గుండెలమీద టేప్‌రిక్కార్డర్ వుంది అతని కళ్ళు తన్మయత్వంతో, అరమోడ్పుతో వున్నాయి.

ఒక్క క్షణం మురళి విభ్రాంతిగా చూసింది వెంటనే ఆమె పెదవుల మీద చిరునవ్వు నిలిచింది తలుపులు తెరిచిన శబ్దానికి శివశంకర్ ఉలిక్కిపడి కళ్లు తెరిచాడు.

ఎదురుగా చిరునవ్వుల పువ్వులు చిందిస్తూ సజీవ శిల్ప సుందరిలా మురళి నిలబడివుంది ఆమెను చూసి ఒక్క ఉదుటున లేచాడతను తన కళ్లను తానే నమ్మలేనట్లు "మీనా!—" అన్నాడు ఆశ్చర్యానందాలతో

"అవును శంకూ! నీ మీనానే... నీ కోసమే వచ్చాను." అన్నది చిరుదరహాసంతో.

అతని అంతరంగం ఉత్తుంగ తరంగమై నాట్యమాడింది కన్నుల్లో శతకోటి దీపాలు గుప్పున ముఖంలోకి పాకి దీప్తివంతం చేసింది !

శివశంకర్ రెండడుగులు ముందుకు వేసి కళ్ల నిండుగా, అబ్బురంగా, చూసేడామెను

"సందేహంలేదు నీవు నా మీనావే ! ఆ రోజు ఎందుకు తిరస్కరించావు ? — " అని ఆమె చేతిలో తన చెంపలు రుద్దుకున్నాడు ఉన్మాదిలా

మురళి అడ్డుచెప్పలేదు. అప్రయత్నంగా ఆ రోజు రోడ్డుమీద చెంపదెబ్బ వేసిన సంఘటన గుర్తుకువచ్చి ఆమె హృదయం ఒక్క క్షణం కలుక్కుమన్నది.

"శంకూ ! ఏమిటిలా అయిపోయావు ?" జాలిగా అడిగింది. ఆ రోజు చూసిన వ్యక్తికి ఈ రోజు చూస్తున్న రూపానికి ఎంతో తేడా కనిపిస్తుందామెకు

"నువ్వు లేవుగా — అందుకే ఇలా వున్నాను. ఇప్పుడు నువ్వు వచ్చావుగా. ఇక నేను మారి పోతాను అన్నట్లు నన్ను వదలిపెట్టి మళ్లీ

**జరిగిన కథ — 4:** విజయ్, మురళి కాశీకి పోతూ రైల్లో యాదృచ్ఛికంగా కలుసుకుంటారు. విజయ్ గడిచిపోయిన తన జీవితాన్ని సింహావలోకనం చేసుకోసాగాడు — విజయ్ పోలీసు ఇన్‌స్పెక్టరుగా ట్రయినింగ్ అవుతున్నాడు. మురళి ప్రయివేటు కంపెనీలో టైపిస్టుగా పని చేస్తూంటుంది. మురళి మంచితనం చూచి ఆమెను ప్రేమిస్తాడు విజయ్. మురళితో తను ఆమె స్నేహాన్ని కాంక్షిస్తున్నట్లు చెపుతాడు మురళి పిన్ని తన చిన్నాన్న కొడుకు పెళ్ళికి వెళ్ళేందుకు డబ్బు కావాలని మురళితో ఘర్షణ పడుతుంది. అందుకై మురళికి డబ్బు సహాయం చేస్తాడు విజయ్. ఇష్టపడితే ఆమెను వివాహం చేసుకుంటానంటాడు ఆమె తన నిర్ణయం తెలిపేందుకు కొంచెం టైమ్ కావాలని కోరుతుంది విజయ్ ప్రేమను అంగీకరిస్తుంది మురళి. శివశంకరం మురళిని తన ప్రియురాలు మీనాగా భ్రమ చెందుతాడు. తన మనవడి కోరికపై రాజమణి మురళిని తన ఇంటి కోడలుగా చేసుకుంటానని మురళి పిన్నికి చెపుతుంది. కారణం చెప్పకుండా విజయ్‌ను దూరమవ్వమంటుంది మురళి పుష్కరాల్లో దొరికిన తనను పెంచి పెద్ద చేసిన వారి కోసం త్యాగం చేయాలనుకుంటుంది మురళి. శివశంకర్‌కు బ్లడ్ కేన్సర్ అని తెలిసి దిమ్మెరపోతుంది ఈ విషయం ముందే తెలిసి ఉంటే విజయ్‌ను దూరం చేసుకునుండను కదా ! అని వాపోతుంది.

వెళ్లిపోవుగదూ. . నాతోనే వుంటావు గదూ ! గానీ మనిద్దరికి పెళ్లి ఖాయం చేసింది తెలుసా?''

''తెలుసు. నేను ఇక్కడే వుండిపోతాను.''

''మీనా !'' అంటూ ఆమెను కౌగలించుకో బోయాడు.

మురళి నవ్వుతూ రెండడుగులు వెనక్కి వేసింది ''పెళ్లయ్యేదాకా ఈ దూరం ఇలాగే వుండాలి. అలా అయితేనే నేనిక్కడ వుంటాను—'' అన్నది.

అతను బుద్ధిమంతునిలా తలూపాడు.

మురళి గాఢంగా నిట్టూరుస్తూ 'పాపం ఇతన్ని వంచించడం లేదుగదా ! తనను చూసి తన ప్రియురాలు మీనా అని భ్రమచెందుతున్నాడు. ఆ కళ్లలో ఎంత సంబరం ? మీనా వచ్చిందని ఎంత ఆనందం ! ప్రేమనేది మనిషికి ఇంత శక్తిని, ఉత్సాహాన్ని ఇస్తుందా ? ఏమయితేనేం ఇతన్ని నమ్మించగలిగాను నెమ్మదిగా ఇతని ఆరోగ్యాన్ని సరిదిద్దాలి. వేళకు మందులు వాడుతూ సంతృప్తిగా వుండేట్లు చేయాలి. అదే తన ప్రస్తుత ఆశయం —' అని అనుకుంది.

''శంకూ తలమాడు ఎలావుందో ! తల స్నానం చేయిస్తాను .. ముందా గడ్డం చేసుకో లేచి —'' అని అన్నది మురళి.

అతను గబగబ తలూపి టేప్‌రికార్డర్ టేబిల్‌పైన పెట్టి షేవ్ చేసుకోసాగేడు ఉత్సాహంగా

మురళి పనిమనిషిచేత వేడినీళ్లు కాయించి, కుంకుళ్లు నానబెట్టించి స్నానానికి ఏర్పాట్లు చేయించింది. తనే స్వయంగా అతని తల రుద్ది తలస్నానం చేయించింది. స్నానం చేస్తున్నంత సేపు — కంట్లోకి కుంకుడు రసం పోయిందని చిన్న పిల్లాడిలా ఒకటే అల్లరి; మారాం చేసాడు శివశంకర్

ఎందుకో అతని అల్లరిలో — మాటల్లో అమాయకత్వం ఎక్కువగా కనిపించిందామెకు. స్నానం అయ్యాక దగ్గరుండి స్వయంగా భోజనం వడ్డించింది.

''కలిపి ఇవ్వు —'' అన్నాడు శంకర్.

మురళి అలాగే అతను చెప్పినట్లు చేసింది. అయినా అతను అన్నం ముట్టుకోలేదు. ''కలిపిచ్చానుగా తిను —'' అన్నది

''నాకేంవద్దు. ఇంతకుముందు అన్నం కలిపి ముద్దలుచేసి చేతిలో పెట్టేదానివి.'' అని బుంగమూతి పెట్టాడు ఆమె కర్థమయిందతని ధోరణి చిన్నగా నవ్వుతూ ముద్దలుగా చేస్తూ అతని చేతిలో పెట్టింది సంతోషంగా ఆరగించ సాగేడతను

''మీనా ! వంటలు చాలా రుచిగా వున్నాయి. నువ్వే చేసేవా ?''

''లేదు వంటమనిషి చేసింది ''

''మరింత రుచి ఎలా వచ్చింది ? ఓ .. నీ చేత్తో కలిపి పెట్టావుగదూ అందుకే రోజు కన్నా ఈ వేళ చాలా రుచిగా వున్నాయి —'' అన్నాడు ఆమెవంక రాగభరితంగా చూస్తూ

మురళి నవ్వి వూరుకుంది. కొసరి కొసరి తినిపించింది అతను తృప్తిగా భోంచేసాడు అదంతా గమనిస్తున్న రాజమణి కళ్లనుంచి ఆనంద భాష్పాలు రాలాయి.

''అమ్మా ! మీనా ! నీ చేతి చలువవలనే వాడు మళ్లీ ఇన్నాళ్లకు కడుపునిండా తిన్నాడు. నీ ఋణం ఎలా తీర్చుకోను ?—'' కృతజ్ఞతగా అన్నది రాజమణి.

మురళి మాట్లాడలేదు చిన్నగా నవ్వి ఊరుకుంది.

రోజులు గడుస్తున్నాయి.

శివశంకర్ మనస్తత్వం బాగా అర్థమయింది మురళికి. ప్రతి విషయానికి చిన్నపిల్లాడిలా మారాం చేస్తాడు. అలుక వహిస్తాడు. అతనికి నచ్చజెప్పి దారిలోకి తెచ్చుకోవడం కాస్త కష్టంగా వున్నా, సహనంగా ప్రవర్తించసాగిందామె అన్నిటికి సర్దుకుపోతోంది.

మురళిని వదలి శివశంకర్ ఒక్క క్షణం



వంటరిగా వుండడు అస్తమానం ఆమెవెంటే తిరుగుతూ, ఆమె ఎక్కడుంటే అక్కడకు చేరతాడు ఆమె క్షణం కనుమరుగైతే చాలు విలవిల్లాడిపోతాడు అతని ప్రేమైక హృదయానికి అప్పుడప్పుడూ మురళి కళ్లు చెమ్మగిల్లేవి

'ఈ పిచ్చిమనిషి నన్నెందుకింతగా ప్రేమిస్తున్నాడు? నీ జీవితం ఒక నెలలో ముగుస్తుందని తెలిస్తే ఏమవుతాడు? నో. ఆ రహస్యాన్ని పొరపాటున కూడా బయట పెట్టకూడదు. వున్న ఈ నాలుగు రోజులు ఇలాగే నవ్వుతూ బ్రతకాలి అదే తను చేయగలిగింది —' అని అనుకునేది మురళి

రాజమణి భగవద్గీత చదువుకుంటూ కూర్చుంది

ఇంతలో అక్కడకు శివశంకర్ హడావిడిగా వచ్చాడు.

''గ్రానీ! మీనా పిక్చర్‌కు రమ్మంటుంటే రానంటుంది —'' అని ఫిర్యాదు చేసాడు అతని వెనుకే వచ్చిన మురళి ''అదికాదండీ! సెకండ్ షో కెళ్దామంటున్నాడు ఆలా అయితే ఆరోగ్యం పాడవుతుందని ఎంత చెప్పినా వినిపించుకోవడం లేదు —'' అన్నది.

రాజమణి నవ్వి ''పోనీ రేపు మ్యాట్నీకి వెళ్లకూడదా చిన్నా? —'' అన్నది.

శివశంకర్ బుంగమూతి పెట్టాడు. ''రేపటిదాకా ఆ సినిమా వుండొద్దూ? ఈ రోజుతో ఆఖరు. చాలా రోజులనుండి ఆ పిక్చరు చూడాలనుకున్నాను. నువ్వు చెప్ప గ్రానీ మీనాను కూడా రమ్మని చెప్పు —''

రాజమణి మరేమీ అన్లేకపోయింది మనవడు ఏది కోరినా తిరస్కరించలేదామె అది ఆమె బలహీనత కావచ్చు, ప్రేమ కావచ్చు కళ్లతోనే వెళ్లమని చెప్పింది మురళికి.

''ఉత్త మొండివాడివి నీ మాటే నెగ్గించుకున్నావు పద—'' అన్నది మురళి చిరుకోపంతో

''మరి ఏమనుకున్నావు? నేను కోరింది క్షణాలమీద జరిగిపోవాలి —'' అని గర్వంగా నవ్వుతూ డ్రైవర్‌ను పిలిచి కారు సిద్ధం చేయమని పురమాయించాడు

* * *

రోజులు గడుస్తున్నాయి. ఈమధ్య శివశంకర్ చాలా మారిపోయాడు. ఎప్పుడూ ఉల్లాసంగా, ఆనందంగా కనిపిస్తున్నాడు వేళకు తిండి తింటూ మందులు వేసుకుంటున్నాడు రోజూ మందులు మింగాలంటే లతనికి చికాగ్గా వుంటుంది ఒకరోజు మురళిని అడిగాడు

''నాకు తెలియకడుగుతాను నాకేం రోగమని ఇలా రోజూ మందులు తినమని నా ప్రాణం తోడేస్తున్నావు? —''

ఆ ప్రశ్న అతను మామూలుగానే అడిగినా మురళి మనసు కలుక్కుమన్నది

## మానస మురళి

## 10

పైకి నవ్వేస్తూ ''నీవు చాలా వీక్‌గా వున్నావు. కాబోయే పెళ్లికొడుకువి ఇలాగేనా వుండేది? దృఢంగా, ఆరోగ్యంగా వుండాలి. తెల్సిందా?'' అని చెప్పింది

''మన పెళ్లి ఎప్పుడు మీనా? —'' ఆశగా అడిగేడు.

''ముందు నీ ఆరోగ్యం కుదుటబడాలి. ఆ తరువాత.''

''అయితే ఇలాతే, మందులన్నీ ఒకేసారి మింగి ఆరోగ్యవంతుడనైపోతాను'' అని నవ్వుతూ ఆ రోజునుంచి బుద్ధిగా మురళి ఇచ్చే మందుల్ని వద్దని తిరస్కరించకుండా వేసుకుంటున్నాడు అసలు ఆమె ఏం చెబితే అది వేదవాక్యమన్నట్లు పాటిస్తాడు. అతని దృష్టిలో మురళి ఒక అపురూపమైన వ్యక్తి! ప్రేమ దేవత.

మనవడిలో వచ్చిన మార్పుకు రాజమణి మనసు రవంత శాంతించింది మనవడికోసం అంత శ్రమ తీసుకుంటున్న మురళిపట్ల ఆమెకు ప్రేమాభిమానాలు పెరిగాయి

ఓరోజు బీరువాలోంచి కొంత డబ్బు తీసి ఇచ్చింది రాజమణి మురళికి.

''ఎందుకు? —'' అని ఆశ్చర్యపోయింది మురళి

''వుంచుకోమ్మా, నాలుగు చీరెలు కొనుక్కుందువు.''

''నాకెందుకండీ. పెట్టెనిండా చీరె లున్నాయి''

''ఫర్వాలేదు తీసుకో తల్లీ! తల్లిలాంటి దాన్ని ఇస్తున్నాను కాదనకు. మా కుటుంబానికి నీవు చేస్తున్న సాయానికి ఇది ఏపాటి? ఏమిస్తే నీ ఋణం తీరుతుంది చెప్పు ఏదో నా తృప్తి కోసం —'' అని బలవంతంగా ఇచ్చింది

ఆమె బాధపడుతుందని అయిష్టంగా వున్నా తిరస్కరించలేకపోయింది మురళి

మురళి ఆ ఇంట్లోకి వచ్చి అప్పుడే నెల అయింది

రాజమణి — మురళి కుటుంబానికి కావలసిన సౌకర్యాలు, వసతులు కల్పిస్తోంది అందువలన మునుపటిలా కుటుంబాన్ని గురించి చింతలేదు. కాకపోతే అప్పుడప్పుడు విజయ్ జాలివదనం కళ్ల ముందు కదిలి 'డబ్బుకోసం అమ్ముడుపోయావు గదూ? —' అని నిలదీసినట్లుగా అనిపించి అమితమైన బాధ కలిగేది

'విజయ్‌నలా తూలనాడకుండా వుంటే బావుండేది —' అని ఎన్నోసార్లు అనుకున్నది ఆ రోజునుండి విజయ్ ఆమెకు కనిపించడమే మానేశాడు ఊర్లో వున్నాడో లేదోకూడా తెలీలేదామెకు అక్కడకు అతని హాస్టల్‌కు రెండు మూడు వుత్తరాలు రాసింది. అయినా జవాబు లేదు

సంధ్యాసుందరి అందంగా ముస్తాబయింది ప్రకృతి కన్య కూడా తన సొగసుల్ని సరిచేసుకుంది అంతటా ఆహ్లాదకరమైన వాతావరణం నెలకొన్నది భానురాజు డ్యూటీ నుంచి వెళ్లిపోయినా పశ్చిమాకాశం ఇంకా ఎర్రదనాన్ని కోల్పోలేదు.

మురళి శివశంకర్, ఇంటి ముందు తోటలో కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారు శివశంకర్ ఏవోకబుర్లు చెబుతుంటే మురళి పకపక నవ్వుతోంది అలా నవ్వుతున్నప్పుడు ఆమె పయ్యెద రవ్వంత ప్రక్కకు జరిగింది ఆ ఎదమీది ఎత్తు పల్లాలు అతని కళ్లలో సూటిగా గుచ్చుకున్నాయి ఆశగా గుటకలు మింగాడతను ఆమెను దగ్గరకు తీసుకుని నుతిమెత్తని ఆ శరీరాన్ని తనివితీరా గుండెలకు హత్తుకుని ముద్దాడాలనిపించింది

ఆ కోరికను అణచుకోలేని చపలచిత్తుడయ్యాడు

చటుక్కున ఆమె చేతిని అందుకున్నాడు

''ఏమిటి శంకూ! ఏమయింది? —'' విచిత్రంగా చూసింది అతనివంక

శివశంకర్ ఆమె వంక రాగభరితంగా, పారవశ్యతగా చూసేడు

ఆ చూపులు ఆ చూపుల్లోని వేడి కోరికలను గుర్తించి ఆమె గుండె ఝల్లుమన్నది

''మీనా! నిన్నొకటి అడుగుతాను ఇస్తావా?''

''నీకు పైత్యం ముదిరినట్లుంది ఏమిటా చూపులు? వదులు'' అని బెరుగ్గా తన చేతిని విడిపించుకోబోయింది మురళి కానీ, అతను పట్టు సడలించలేదు మరింత గట్టిగా పట్టుకుని చటుక్కున ఆమెను మీదకి లాక్కున్నాడు ఆ ఊపుకు తూలి అతని కౌగిలిలో ఇరుక్కుపోయింది మురళి

''శంకూ! ఏమిటిది వదులు గ్రానీతో చెబుతాను—'' అని పెనుగులాడింది

''మీనా! ఒక్కసారి ప్లీజ్'' అర్థింపుగా, ఆశగా, అబగా ఆమె పెదవుల్ని చుంబించ బోయాడు శివశంకర్ ఆమె అయిష్టంగా ముఖం ప్రక్కకు త్రిప్పుకుంది, అతన్నుంచి దూరంగా జరగాలని ప్రతిఘటించింది

''శంకూ! పెళ్లయ్యేవరకు నాకిలాంటివి ఇష్టం వుండవు వదులు నీకే చెప్తేది''

''ఊహూఁ వదలను ఎన్నిరోజులయింది నిన్ను ముద్దాడి నా మీనా నా దేవతా! —'' అంటూ పలవరించేడు మురళిలో సహనం చచ్చిపోయింది పరిస్థితిని అర్థం చేసుకుంది, అంతే! ఒంట్లోని శక్తినంతా కూడదీసుకుని అతని గుండెలమీద చేతులేసి బలంగా అతన్ని వెనక్కి త్రోసేసింది. అతను సిమ్మెంటు బెంచీ మీదనుంచి వెనక్కి పడిపోయాడు.

మురళి లేచి విసవిసా లోపలకు వెళ్లిపోయింది.

శివశంకర్ ఖంగు తిన్నాడు. అతని ముఖం మలిన మయింది.

'మీనా ! ఎందుకిలా మారిపోయావు ? ఒక నాడు నన్ను లతలా పెనవేసుకుని ఎన్నో తీయని ఊసులాడావు, ఇష్టంగా ఎన్నో తీపి ముద్దులు బహూకరించేదానివి. అలాంటి దానవు ఇప్పుడు నేను తాకితేనే మైలపడి పోతానన్నట్లు — ఎంత అయిష్టతను చూపుతున్నావు ?

నువ్వు నిజంగా నా మీనావేనా ? నా మీనా నన్ను ఇలా తిరస్కరించదు. మరి నీవెవరు ? నా మీనా ఏమయింది ? నా ప్రణయ సామ్రాజ్యానికి పట్టపుమనిషి, నా ఎదలోయల్లో కొలువున్న రాగదేవత ఏమయింది ?

ఏమిటీ భ్రమ ?

నా మీద ఇంతటి విముఖతను చూపే ఈమె మీనా కాదు మరెవరు ?

మురళీప్రియ.. ! ఎందుకు మీనా నని చెప్పి నన్ను మోసపుచ్చుతుంది ? ఈ నటనకు అర్థమేమిటి ? నేనెందు కింత గుడ్డిగా నమ్మాను ?

ఈమె ఇన్నాళ్లూ నన్ను వంచించింది, ఏమాశించి నా జీవితంలోకి ప్రవేశించింది ? '— ఆమె మీనా కాదన్న అనుమానం అతనిలో తలెత్తింది ఇన్నాళ్లూ తన కళ్లకు కట్టిన తెరలు తొలగినట్లుగా, భ్రాంతి నుండి తేరుకున్నట్లుగా అయ్యాడు

బట్టలకు అంటిన ధూళిని దులుపుకుని లేచి లోపలకు నడిచాడు శివశంకర్.

మురళి బాల్కనీలో నిలబడి ఎక్కడో శూన్య ఆకాశంలోకి చూస్తోంది ఆమె విపరీతమైన సంఘర్షణకు గురయినట్లుగా వున్నది ఆమె ముఖంలో రంగులు క్షణ క్షణానికి మారుతున్నాయి 'శంకూని ఆనందపరిచేందుకు వచ్చింది తను కానీ అతను హద్దులు మీరుతున్నాడు ఎంత అల్లరినైనా భరించవచ్చుకానీ, ఆ చేష్టల్ని భరించలేకపోతోంది అతని ప్రియురాలు మీనా అతనితో చాలా చనువుగా వ్యవహరించేదట తను తిరస్కరిస్తే బాధపడతాడు తను గిరిగీసుకుని వుంటే అతనికి అనుమానంకలుగుతుంది అలాగని అతను కోరినట్లు ఎలా చేయడం ? ముందు ముందు తనకు పెళ్లవుతుందో లేదో తెలీదు, కానీ ఎంతయినా తను ఆడపిల్ల... చాలా జాగ్రత్తగా వ్యవహరించాలి. మీనా పిచ్చిలో వున్న అతను ఏ క్షణంలో ఏ అఘాయిత్యం చేస్తాడో.. ఒక్కోసారి తనేం చేస్తున్నాడో అతనికేతెలియదు. చనిపోయిన మీనా అంటే అతనికి అంతులేని ఆరాధన, ప్రేమ వున్నమాట నిజమే ! ఎంత నటించినా తను మీనా ఎలా అవుతుంది?—'

శివశంకర్ ఆమె వెనకగా వచ్చి నిలుచున్నాడు.

''మీనా !—'' అని పిలిచాడు.

మురళి ఆ పిలుపుకి ఉలిక్కిపడి, తన ఆలోచనల్ని కప్పిపుచ్చుకుంటూ నవ్వింది

కానీ అతను నవ్వలేదు. అతని వదనం గంభీరంగా, కొత్తగా వుంది మురళికి ఏమీ పాలుపోలేదు మౌనంగా తల దించేసుకుంది

''మీనా !'' మళ్లీ పిలిచాడు శివశంకర్.

''ఊఁ. . ఏమిటి ?''

''ఎందుకలా నా కోరికను తిరస్కరించి వచ్చావు ? ఇంతకు ముందు నన్ను కావాలని కవ్వించి నీవే నన్ను ముద్దులు పెట్టుకున్నావు అవన్నీ మర్చిపోయావా ? ఇప్పుడేమయింది నీకు ? నా పొడంటే గిట్టకుండా పోతుందే ? నీలో ఈ మార్పు ఎలా సంభవించింది ? నేనంటే ఇష్టం లేదా ?''

ఆ ప్రశ్నలకు మురళి లోలోపల కలవరపడి పోయింది అతనికి అనుమానం కలగకుండా ముఖ భంగిమలు మార్చేసింది. చిలిపిగానవ్వుతూ ''ముద్దులన్నీ మూటకట్టి దాచివుంచాను పెళ్లయ్యాక అన్నీ ఏకంగా అందివ్వాలని. .'' అన్నది.

''అబద్ధం— నేనంటే నీ కిష్టంలేదు—'' బిగ్గరగా అరిచాడు శివశంకర్

''శంకూ !?''

''నన్నలా పిలవకు. అలా పిలిచే హక్కూ, అధికారం, ఒక్క మీనాకే వున్నది. నువ్వు నా మీనావి కావు. మురళీప్రియవు అవునా? ఎందుకింత మోసం చేశావు? ఏమాశించి నాజీవితంతో ఆడుకుంటున్నావు ?'' కోపావేశంతో అతని కళ్లు ఎర్రగా మారిపోయాయి ఆవేశంతో ఊగిపోయాడు

మురళి తను ఊహించినదంతా జరిగిందని కలవరంతో కంగారు పడిపోయింది అమాయకంగా, చిన్న పిల్లాడిలా కనిపించే శంకూలో అంతటి కోపాన్ని, ఆవేశాన్నీ ఆమె ఎన్నడూ చూళ్లేదు. ఉగ్రరూపం దాల్చిన నరసింహమూర్తిలా మండిపోతున్న అతని ఎదుట నిలబడాలంటేనే ఆమెకు ధైర్యం చాలడంలేదు గుండెలు విపరీతంగా కొట్టుకుంటున్నాయి, అరచేతుల్లో చెమటలు పోశాయి చిగురాకులా కంపించింది ఒక్క క్షణం

పొడారిపోతున్న గొంతుకని పెగుల్చుకుని ''శంకూ ! ఏమయింది నీకు ? నేను మీనాని ఆవేశపడకు అసలే నీ ఆరోగ్యంబాగాలేదు—'', అని అతన్ని శాంతింపచేయాలని అతని చేతులు పట్టుకుంది మురళి.

అతను ఆమె చేతుల్ని విసురుగా విదిల్చేశాడు

''నీవు బాగా నటించగలవు నీ నటనతో గ్రానీని మోసం చేయవచ్చు నా కళ్లను మోసం చేయవచ్చు. కానీ, నా మనసును మభ్యపెట్టలేవు నీవు మీనావి కావని నాకు ఆనాడే తెలుసు ఎక్కడో ఇతరదేశాల్లో మరణించిన మీనా ఇక్కడికెలా వస్తుంది? తెలిసీ తెలిసీ భ్రమలోపడ్డాను మీనా రూపాన్ని పోలిన నిన్ను చూసి తట్టుకోలేక పోయాను నీవు నా మీనావేనని సరిపెట్టుకుని ఆత్మవంచన చేసుకుంటూ వచ్చాను

నా మీనాలోని అణువణువునూ— ఆమె అలవాట్లను, మనస్తత్వాన్ని నేను సంపూర్తిగా ఎరుగుదును— నీవెంత నటించినా నా మీనావి కాలేవు.

ఎందుకిలా వంచించావు ?

డబ్బుకోసమా ? నీక్కావల్సింది డబ్బే కదూ ! పాపిష్టి డబ్బుకోసం నామీద ప్రేమ నటిస్తావా ? ఇంతకన్నా అల్పత్వం మరొకటి వుందా ? కమాన్ నీ క్కావల్సింది డబ్బే కదూ ?—'' అని చటుక్కున ఆమె రెక్క పట్టుకుని క్రిందికి లాక్కువచ్చాడు ఇనుప












## మానస మురళి

బీరువా తెరిచి అందులో మూలుగుతున్న డబ్బు, నగల్ని బయటకు లాగాడు.

"తీసుకో! ఈ సొమ్ముకోసమే గదూ నీవు నా జీవితంతో ఆడుకున్నది? లేని ప్రేమను వొలకబోసింది ఈ పాపిష్టి ధనం కోసమే గదూ! మనుషుల్ని డబ్బుతో కొనవచ్చుగాక, మనసుల్ని— మమతల్ని డబ్బుతో కొనగలమా? లేదు. ఎంత డబ్బైనా ఖర్చు చేయగలను. ఒక్కసారి ఒకే ఒక్కసారి నా మీనాను చూపించగలవా? అది దుస్సాధ్యం!

నేను బలహీనుణ్ణి! మీనాను అమితంగా ప్రేమించి వంచింప బడ్డాను

అంధకారంలో కొట్టుమిట్టు లాడుతున్న వాడిని నిన్ను చూసి ఆశలు చిగురింప జేసుకున్నాను మినాలా వున్న నిన్ను అభిమానించి ఈ గుండె గాయం మాన్పుకోవాలనుకున్నాను

ఒక్క క్షణమన్నా నన్ను మనస్ఫూర్తిగా ప్రేమిస్తావని ఆశపడ్డాను నాకూ తెలుసు నీవు నన్ను ఎప్పటికీ ప్రేమించలేవని! డబ్బుకోసం నాటకమాడేదానికి ప్రేమ విలువేం తెలుస్తుంది?"

కత్తివేటుకు నెత్తురుచుక్క లేనట్లు మురళి ముఖం పాలిపోయింది ఆ మాటలు ఆమె హృదయానికి ములుకుల్లా తాకాయి. అవ్యక్తమైన బాధతో నలిగిపోయింది. ఎదురు చెప్పే ధైర్యం లేనట్లు దోషిలా, మూగదానిలా తల దించేసుకుంది మురళి

శివశంకర్ నవ్వాడు విరక్తిగా! అతనిలోని ఆవేశం కన్నీళ్ళుగా మారి కళ్ళనిండాయి.

"మురళీ! ఇప్పుడు నిన్ను చూస్తే జాలేస్తుంది .. నువ్వెందుకిలా చేశావో నాకైతే తెలియదు గానీ, ఘోరంగా ఓడిపోయి — నన్ను ఓడించావు —"

మురళి ఏదో చెప్పాలని పెదవులు కదిల్చింది కానీ, గొంతులోంచి మాట రాలేదు ఏదో ఒకటి చెప్పి అతన్ని శాంతిపజేయాలని — చెప్పకపోతే అతని దృష్టిలో మరింత నీచురాల్ని అవుతానని గుండె దిటువు పరుచుకుని పెదవి విప్పింది. గొంతు సరిచేసుకుంది.

"శంకర్! నేను మీనాని కాని మాట నిజమే.! కానీ, ఇన్నాళ్ళూ నీ మీద చూపిన అభిమానం మాత్రం నటన కాదు నేను నిన్ను మనస్ఫూర్తిగా అభిమానిస్తున్నాను కేవలం డబ్బు కోసం రాలేదు నీలోని పసితనాన్ని ప్రేమిస్తున్నాను. అల్లరితనాన్ని చిరునవ్వుతో సహించాను నీ మంచి మనసును, నిర్మలమైన స్నేహాన్ని అర్థం చేసుకుని— నిన్ను మనస్ఫూర్తిగా అభిమానిస్తున్నాను నా మాటనమ్ము నిన్ను దగా చేయలేదు."

"నీ మాటలు నిజమే నంటావా ?—"

"అబద్ధం మాత్రం కాదు."

"నాకు నమ్మకం లేదు."

"నీకు నమ్మకం కలగాలంటే ఏం చేయాలో చెప్పు. నీ కోసం ఏమైనా చేయగలను —" దృఢ నిశ్చయంతో అన్నది మురళి.

శివశంకర్ రెండు క్షణాలాగి "నా కోసం అంత త్యాగం చేసేదానివి ఇందాక ఎందుకలా తిరస్కరించి నన్ను గాయపరిచావు?" అని అడిగాడు జాలిగొలిపేలా

"అప్పుడు నా అభిప్రాయం వేరు. అది నీకు నచ్చకపోవడంతోపాటు నీలో అనుమానం రేకెత్తించింది నీ కోసం నా అభిప్రాయాన్ని మార్చుకున్నాను. ఒక్క ముద్దేం ఖర్మ. నీ ఇష్టం ఎన్ని ముద్దులయినా పెట్టుకో. నాకు అభ్యంతరం లేదు. ఇక నుంచి నీవు చెప్పినట్లు చేస్తాను."

"నిజంగా?"

"ముమ్మాటికీ నిజం —"

"మాట తప్పకూడదు —"

"నా కోసం నేను బ్రతకడం మరిచిపోయి చాలా రోజులయింది నా నుంచి ఎదుటి వారికి, ముఖ్యంగా నీకు ఆనందం కలిగిస్తుందంటే — ఆ పని తప్పక చేస్తాను మంచి— చెడులను గురించి ఆలోచించడం మానుకున్నాను. ఇంతకన్నా ఏం చెప్పను ?—"

"అయితే ఓ పసుపుకొమ్ము దారానికి కట్టి తీసుకురా —"

"దేనికి . .!? —" విభ్రాంతిగా చూసింది మురళి.

"నీ మెడలో కట్టడానికి —"

మురళి అనుకోని ఆ సమాధానానికి ఉలిక్కిపడింది. అలా అడుగుతాడని ఊహించలేదామె ఇప్పుడు వెనక్కి తగ్గడం ఎందుకు? తనను పరీక్షించదలిచాడు — అని ధైర్యంగా వెళ్ళి పసుపుతాడు తెచ్చి అతని చేతికందించి చిరునవ్వుతో నిలుచుంది మురళి.

"కట్టు శంకర్! నా మెడలో ఈ తాడు కట్టినందువలన నీకు ఆనందమైతే సంతోషంగా కట్టించు కుంటాను.. నీ కోరిక తీర్చుకో. నీ ఆనందమే నా ఆనందం —" అన్నది.

శివశంకర్ ఆమె నిబ్బరానికి, తెగింపుకు రవ్వంత కలవరపడ్డాడు.

"ఊఁ. ఆగిపోయావేం శంకర్! కానీయ్ —" రెట్టించింది మురళి

శివశంకర్ రెండు క్షణాలు తటపటాయించి ముందుకు వచ్చాడు.

ఒక్కసారి పరిశీలనగా ఆ ముఖంలోకి చూసాడు.

నవ్వుతోంది మీనా .... కాదు మురళి! మురళిలో మీనా ..!

అతని చేతిలోని పసుపు తాడు అటు ఇటు ఊగిసలాడుతోంది అతని ఆలోచనల్లా! ఆమె పెదవులపైన చిరునవ్వు చెక్కు చెదర లేదు

అతను ఒకే ఒక క్షణం ఆలోచించి ఆమె మెడలో పసుపుతాడు కట్టాడు!

అంతపనీ చేస్తాడని ఆమె ఊహించలేదు కేవలం తనను పరీక్షించడానికి అలా అడుగుతున్నాడని అనుకుంది.

(ఇంకా వుంది)

# సిరిలాక్‌లో పాలు వుండనే వున్నాయి–




దీనిని నీటికి కలపండి
రుచికరమైన...



సంపూర్ణాహారం
సిద్ధమయింది !




సిరిలాక్‌ని గోరు వెచ్చని, ముందుగా మరగ బెట్టిన నీటికి కలపండి. అంతే, మీ పాప ఆహారం సిద్ధం అయినట్లే. అందులో గోధుమ పిండి, పూర్తి మీగడ పాలు మరియు పంచదార సరియైన పాళ్ళలో వుండడంతో సిరిలాక్ రుచికరమైన సంపూర్ణ పోషకాహారం.

మీ పాపకి 4 నెలల ప్రాయం వచ్చేసరికి, పాపకి సిరిలాక్ ఇన్‌స్టెంట్ వీట్ మిల్క్ సీరియల్ ఇవ్వడం ప్రారంభించండి.

# సిరిలాక్®

ఇన్‌స్టెంట్ వీట్ మిల్క్ సీరియల్

SAA/FSL/C/2834 TEL

NESTLÉ®

సాయంత్రం ఐదున్నరయింది

ఆబిడ్స్‌లో కంపెనీ బస్ దిగేడు, సుందరం. చిక్కడపల్లిలో దిగవలసిన వాడు – ఇక్కడి దాకా వచ్చేశాడు

ఏం చేయాలో ఎటుపోవాలో తేల్చుకోలేక చేసిన పని అది.

జీ పీ.వో. లోపలికి వెళ్లి ఒకసారి హాలంతా కలయజూసి మళ్లీ బయటికొచ్చాడు పుస్తకాల షాపుల ముందు పచార్లు చేయసాగేడు. రకరకాల పుస్తకాలు, పేర్లు చదువుతూ, ముఖచిత్రాలు చూస్తూ అటూ ఇటూ తిరిగేడు

అరగంట గడిచింది

రోడ్ దాటి పియస్‌జీ ఆఫీస్ దాకా నడిచి ఆగేడు. పక్కగా అరటిపండ్ల బండి కనపడింది రెండు పండ్లుకొని తిన్నాడు



పేవ్‌మెంట్ మీద నడవసాగేడు. నాంపల్లి చౌరస్తా ఎచ్చింది ఇది మరో మజిలీ.

రోడ్లన్నీ రద్దీగా వున్నై. బస్సులు రద్దీగా వున్నై మనుషులు పరుగెత్తుతున్నారు. వాహనాలూ పరుగెత్తుతున్నై. ఎత్తయిన భవంతుల్లో దీపాలు వెలుగుతున్నై. వాటిలో రకరకాల నీడలు, వాటిక్రింద రకరకాల క్రీనీడలు

బస్‌లు ఒకదాని వెంట వొకటి స్రరున దూసుకు వచ్చి చౌరస్తాకు ప్రదక్షిణచేసి వెళ్లి పోతున్నై పేవ్‌మెంట్ పక్కగా దుకాణాల్లో బేరాలు సాగిపోతున్నై

“టైమెంత మాష్టారు ?” – ఎవరో అడుగుతున్నారు

“సాడేసాత్” అని సాగిపోయాడు, రెండో ఆయన

కాళ్లు పీకుతున్నట్లనిపించింది సుందరంకి తలపోటుగావుంది పావలా ఇచ్చి పల్లీలుకొన్నాడు ఒక్కొక్కగింజే నోట్లో వేసుకుంటూ బస్‌స్టాప్ దాకా ముందుకు నడిచేడు

బస్‌వచ్చి ఆగింది ఎక్కేశాడు

చిక్కడపల్లికి టికెట్ తీసుకుని బస్‌ని కలయచూడసాగేడు– ఎక్కడన్నా కూర్చునే జాగా వుందేమోనని

సరిగ్గా అప్పుడే అతని కంట్లోపడింది – ముందుగావున్న సీట్లల్లో ఒకదానిలో – ఆమె !

“రమణి !” – సుందరం పెదవులు గొణుక్కున్నై. గుండెలు జారినట్లయింది. పల్లీల్ని నములుతున్న దవడలు అసంకల్పంగా ఆగి, గిట్టకరచుకున్నట్లయింది తలపోటు తాటి ప్రమాణానికి లేచింది.

నలువైపులా పరుగులు పెడుతున్న బాధను ఒక్కచోట పట్టి నిలపడానికి ప్రయత్నంచేస్తోంది మనస్సు.

అతని కళ్లముందు ఏవేవో ఆకారాలు మెదలసాగేయి.

వాటిల్లో అతను స్ఫుటంగా గుర్తించలిగిందల్లా ఒక్కటే ! – అది – తెరచుకుంటున్న మొసలినోరు !!

* * *

సుందరం ఇంటికి చేరేసరికీ –

రాత్రి ఎన్నిమిదిన్నర దాటింది

అప్పటికే —

అనుకోకుండా వెలువడిన ఎన్నికల వార్తలా దిగబడ్డారు – తండ్రి – మాధవయ్య, తమ్ముడు – రామ్మూర్తి

కుశల ప్రశ్నలు అయినై పరామర్శలు ముగిసినై

భోజనాల దగ్గర అడిగేడు, మాధవయ్య “జీతాల రోజున కూడా ఇంత ఆలశ్యమేవిటిరా సుందరం పిల్లలు నీకోసం చూసి చూసి ఇప్పుడే పడుకున్నారు.”

“అవసరమైన పనిబడింది ఒక ఫ్రెండ్ ఇంటికి సంతోష్‌నగర్‌దాకా వెళ్లిరావాల్సొచ్చింది” పొడిపొడిగా సమాధానం చెప్పేడు

ప్రసన్న చురుగ్గా సుందరం కళ్లల్లోకి చూసి, మజ్జిగ పోసి పక్కకి కదిలింది భార్య చూపులకి తట్టుకోలేక తల దించుకని భోజనం ముగించాడు, సుందరం.

ఆరుబయట మంచాలు వేసింది ప్రసన్న వెన్నెల చల్లగా కురుస్తోంది సుందరంకి మాత్రం చిరుచెమట పట్టింది. రామ్మూర్తి తన పరిస్థితంతా తండ్రికి చెప్పే వుంటాడని సుందరం నమ్మకం.

కాస్సేపు పొడిపొడి మాటలు సాగినై

ఆ తర్వాత అడిగేడు, మాధవయ్య – “ఉద్యోగమా సలక్షణమైన ఉద్యోగం ఏఁవిటిరా ఇది సుందరం ? – ఇల్లు చూడబోతే అయ్యవారి నట్టిల్లు కోడలు మెళ్లో నల్లపూసల గొలుసు కూడా పోయింది పిల్లలిద్దరికీ సరయిన గుడ్డల్లేవు నువ్వేమో ఒక్క జత బట్టలతో కాలక్షేపం చేస్తావుట; ఆ పిల్లకి నిండా రెండు చీరెలు లేవు ఏఁవిట్రా ఇదంతా !”

మాధవయ్య గొంతులో బాధ, దుఃఖం, విచారం. అప్పటికే ఆయనకి ఆయాసం వచ్చింది.

“ఇవన్నీ అట్లా వుంచు. అన్నం వండుకోడానికి రెండు మంచి గిన్నెలు లేవు, తనకు రెండో లుంగీ లేదు.” తమ్ముడు

సుందరం వింటున్నాడు మాటా పలుకూ లేదు

ప్రసన్నకూ వినపడుతున్నై ఈ మాటలు ఆమె కంచం ముందు కూర్చున్నదన్నమాటేగానీ, ముద్ద గొంతు దిగడం లేదు

“నెలకు ఎంతలేదన్నా ఆరొందలు వస్తయ్‌ట సంసారం చూడబోతే నిండా మూడు సొట్టలు లేవు ఇల్లేమో అదృష్ట వశాత్తూ వందరూపాయల్లో దొరికె”

“ఇంత ఇంటికే నేను రెండొందల పాతిక కట్తుంటేనిగా” అన్నాడు రామ్మూర్తి.

“మరి. వచ్చేదంతా ఏమైపోతున్నట్టు ? లక్షణంగా, ఆనందంగా కళకళ్లాడుతూ బతకాల్సినవాళ్లు – ఇట్లా హీనంగా పూటలు గడపడం ఏఁవిటో నాకేఁవీ అర్థం కావడం లేదు అసలు – ఏఁవిటి నీ ఇబ్బందులు ?”



కొంచెం నిగ్గదీస్తున్నట్టుగానే వున్నై తండ్రి మాటలు.

సుందరం ఏమీ చెప్పలేదు

"ఇప్పుడు నేననేదేమంటే— అడపాదడపా ఇబ్బంది పడటం, ఖర్చులు ఎక్కువ కావడం, జీతం సరిపోకపోవడం— ఇవన్నీ అందరికీ వుండే బాధలే. కానీ అవన్నీ ఇక్కడ శాశ్వతంగా పీటవేసు క్కూర్చున్నాయే"— తమ్ముడి వివరణ

"అవును పెళ్లికాకముందూ ఇదే పరిస్థితి, అయిన తర్వాతా ఇదే పరిస్థితి పోనీ మాకేమన్నా పావలా, అర్ధా అన్నా సహాయం చేస్తున్నావా అంటే అదీ లేదాయె రిటైరయి, మీ అమ్మా నేనూ చంద్రం— ఏదో అక్కడే కాలక్షేపం చేస్తుంటిమి. ఒకరికి పెట్టాలా, పోయాలా? ఏమీలేంది ఏమిటీ పరిస్థితి? తమ్ముణ్ణే చూడు వాడు మాత్రం—ఎన్ని బరువులు మోస్తున్నాడు? బావమరిది చదువా? వాడికీ ముగ్గురు పిల్లలా? అదేమంటే—వాడికి పై సంపాదన వుందంటారు, పోనీ అది— అది వదిలెయ్. నెలకు ఆరొందల చిల్లర తెచ్చుకొనే సాటి వాళ్లంతా ఇలాగే చేస్తున్నారా సంసారాన్ని?"

మంచినీళ్ల చెంబూ, గ్లాసూ తెచ్చి నుంచం ప్రక్కగా వుంచి లోపలికి వెళ్లింది ప్రసన్న

మాధవయ్య తన ఘోషని మళ్లీ మొదలెట్టాడు "అటు మీ అత్తా మామలు, బావమరదులదృష్టిలోనూ, ఇటు మనవాళ్లందరి దృష్టిలోనూ, నువ్వంటే ఎంత చులకనో నీకు తెలుసుగదా అసలేమిటి దీనికంతా కారణం? పోనీ, ఏవైనా అలవాట్లున్నాయా అంటే, అదీలేదాయె సిగరెట్టు ముట్టుకోవు, కాఫీ తాగవు ఎనిమిదేళ్ల నుంచీ గుండెలమీద కుంపటిగానే వుంది — నీ పరిస్థితి నాకు ఆ పిల్లని చూస్తుంటే, నాకు కళ్లల్లో నీళ్లు తిరుగుతున్నై మానానికి మగ్గే పిల్లగనక — రోజులు గడుపుకొస్తోంది — సంసారాన్ని బజార్నపడేయకుండా గోగుకాడలా దాన్ని చూస్తుంటే — నాకే కడుపు చెరువైపోతోంది ఇక వాళ్ల పుట్టింటి వాళ్ల కెలావుంటుందో ఆలోచించు"

మామిడి ముక్కలు పళ్ళెంలోతెచ్చి అక్కడ వుంచి, పక్కనే గడపలో కూర్చుంది ప్రసన్న

తండ్రో, తమ్ముడో పళ్ళు తెచ్చేరని గ్రహించాడు, సుందరం.

అర్ధగంట గడిచింది

"మనం ఎన్ని మాట్లాడినా, ఏం చెప్పినా, బ్రతిమాలినా, బామాలినా — వాడు ఉలకడు, పలకడు సంగతేమిటో చెప్పడు పోనీ అసలు నీ బాధేమిటో చెప్పరా — ఒక్కసారి విరగడ చేయడానికి ప్రయత్నిస్తానని — ఎంతగా నెత్తీ నోరూ కొట్టుకున్నా—ఏంలేదులే అంటాడు. ఏమిటో

నేను మాత్రం ఏంచేసేది?'' రామ్మూర్తి వేష్ట పడ్డాడు

మామగారివైపు, మరిదివైపు జాలిగా చూసింది ''అది నాకే తెలీదు మీకేం చెప్తారు'' అంది ఖాళీ ఏళ్లేల్ని తీసుకుని లోపలికి కదిలింది ఆమె వెళ్ళి, గుమ్మానికి అవతల నిలబడింది

కోడలివైపు పరీక్షగా చూశాడు మాధవయ్య. ఆకు దూసేసిన చిటికేశపు కొమ్మలా వుంది ఆమె !

ఆ తర్వాత చాలాసేపు మాధవయ్య తనని గురించి మాట్లాడేదు. జీవితంలో తాను ఎదుర్కొన్న కష్టాలూ, అనుభవించిన చేదు ఘటనలూ, స్వశక్తితో కుటుంబాన్ని ఒక స్థితికి తీసుకురావడానికి చేసిన ప్రయత్నా — అన్నీ ఆయన మాటల్లో వివరంగా వె పోయినాయి

అప్పుడు సంభాషణ— అప్పు, ఆదాయాల మీదికి మళ్లింది

నగర జీవనంలో చుట్టుపక్కల వుండే ఆకర్షణలకి లోనుకావడం, అందులోనూ ఆ వయసులో వుండే సహజమైన వ్యామోహాలుం డడం— వీటన్నిటి గురించి కూడా— తనకు తాను చెప్పుకుంటున్నట్లుగా— సుందరంకీ, రామ్మూర్తికీ చెప్పాడు, మాధవయ్య.

ఈ ప్రసక్తి వచ్చినప్పుడు ప్రసన్న అన్నది, అట్లాంటి అదృష్టం మాత్రం ఎక్కడిదీ ? ఇల్లు చూశారు గదా— కూర్చునేందుకు రెండు కుర్చీలు లేవు కనీసం. మేము సినిమా చూసి మూణ్ణెళ్లయింది. ఇంక నా బొంద ఆకర్షణలూ, వ్యామోహాలూ గురించి చెప్పకోవడమెందుకూ?''

ఆమె మాటల్లోని నిర్వేదం అర్థమైంది మాధవయ్యకు. రామ్మూర్తికి అదేమీ కొత్త భోగట్టా కాదు. అతను హైదరాబాద్‌లోనే శ్రీనగర్ కాలనీలో వుంటూ అన్నావదినల పరిస్థితిని బాగా విశదంగానే ఆకళింపు చేసుకున్నాడు

మరికొంత సేపటికి అన్నది ప్రసన్న. ''తలకు మించిన అప్పుల్లో ఇరుక్కుపోవడమే ఈ బాధలన్నిటికీ కారణమని చెప్పుకున్నప్పుడు, ఆ ఊబి నుంచీ బయటికి లాగడానికి మా వాళ్ళు చేసిన ప్రయత్నాలూ తెలుసు గదా మీకు ? ఆ తర్వాత మాత్రం ఏమైంది ? మళ్లీ మామూలే ఈ కథ.''

ప్రసన్న మాటల్లోని దెప్పిపొడుపునీ, ఆ సమయంలో ఆమె తనకేసి చూసిన చూపుల్లోని వేడినీ గ్రహించిన సుందరం - చివాలున లేచి, విసురుగా లోపలి కెళ్లిపోయాడు

ఎంతసేపు మాట్లాడుకున్నా ఆ ఆలోచనలు విడివడేవి కావని—మాధవయ్యకూ, రామ్మూర్తికీ, ప్రసన్నకూ తెలుసు సంభాషణంతా తండ్రీ కొడుకుల మధ్య సాగుతుంటే, ప్రసన్న లాంఛనంగా మధ్య మధ్య ఏదో అంటూ కూర్చుంది

జవాబు తెలీని ప్రశ్నల్ని ప్రశ్నలుగానే మనస్సుల్లో నొక్కి పట్టుకుని ఆ చర్చని విరమించారు

ప్రసన్న గదిలోకి వచ్చేసరికి— కళ్ళు మూసుకుని పడుకుని వున్నాడు సుందరం ''నిద్ర పట్టిందా ?'', అడిగింది ప్రసన్న సుందరం కళ్ళు తెరవలేదు మాట్లాడలేదు చాపమీద పిల్లల ప్రక్కన నడుం వాల్చింది ఆమె.

నిజానికి సుందరం మేలుకొనే వున్నాడు జరిగిన చర్చ అతనిలో చాలా అశాంతిని రేకెత్తించింది. తన అసహాయతకు తనమీద తనకే జాలీ, విచారం, సానుభూతీ, అసహ్యం కలుగుతున్నాయి సుందరంకి.

అతని అంతరాంతరాల్లోని సంఘర్షణ కంటిమీది కునుకును కరువు చేసింది

ఒక రాత్రివేళ —

ఇంటి బయటికివచ్చి దొడ్లోకి వెళ్లి నూతి గట్టుమీద కూర్చున్నాడు, సుందరం. దూరంగా లారీలు దూసుకుపోతున్న చప్పుళ్లు; ఒకటే అరా వివరంలేని నవ్వుళ్లూ — వినపడుతున్నై.

''అవును — నన్ను నేను క్షమించుకోలేని పరిస్థితిలో పడిపోయాను వాళ్లంతా అనేదాన్లో తప్పులేదు. అదంతా — వారికి తన బతుకుపట్ల ఆందోళన, తనపట్ల అభిమానం ఇది తనకు తెలుసు ఆ ఆందోళనకు మూలకారణమైన సమస్య గురించి మాత్రం తనకు మాత్రమే తెలుసు !''

ఇలా అనుకోగానే సుందరం వెన్ను జలదరించింది. గుండెలు బిగపట్టినట్లైంది అతని కళ్లముందు ఏవేవో ఆకారాలు మెదల సాగేయి వాటిల్లో అతను స్ఫుటంగా గుర్తించ గలిగిందల్లా ఒక్కటే ! — అది తెరచుకుంటున్న మొసలినోరు !

అవును. అతి తెలివితక్కువతనంతో తానా మొసలి నోట్లో చిక్కుకున్నాడు అప్పట్నుంచీ తన బతుకు బోనులో పడిన ఎలుకపిల్ల బతుగ్గా మారిపోయింది. అప్పట్నుంచీ— ఎన్నో రాత్రులు తను తన ప్రాణం తీసుకో బోయాడు. కానీ, అది మరింత మూర్ఖత్వంగా తోచి ఎప్పటికప్పుడు ఆ ప్రయత్నాన్ని విరమించు కుంటూ వస్తున్నాడు 'విరమించుకోవడం కాదేమో — బహుశా — వాయిదా వేసుకుంటూ వస్తున్నానేమో' అనిపించింది. సన్నగా నవ్వు కున్నాడు, సుందరం

నీరసంగా కూర్చుండిపోయిన సుందరంకి ఒక్కసారిగా ఆ రోజు గుర్తుకొచ్చింది అవును, ఆ రోజు — అప్పటికింకా తను బ్రహ్మచారి

తన సహోద్యోగి ప్రసాద్‌తో కలిసి ఏదో రిక్రియేషన్ క్లబ్‌కి వెళ్లాడు. ప్రసాద్ పేకాట ఆడతాడు ఆ రాత్రి బాగానే సంపాదించాడతను. బాగా పొద్దుపోయిన తర్వాత — ఇద్దరూ ఆటోలో బయల్దేరారు ఇద్దరూ వుండేది ఒకచోట కానీ, ఆటో మరో దారి పట్టింది తన జీవితానికీ అదే మలుపైపోయింది ఆటో ఆగిన తర్వాత — తాను ముందడుగు వేస్తూ తననూ ఆ యింట్లోకి ఆహ్వానించాడు, ప్రసాద్ క్షణాల తర్వాత తెలిసిపోయింది తనకు — అప్పుడు తానెక్కడ వున్నదీ, ప్రసాద్ చేసిన పనేమిటో.

అతనాయింటికి పాతకాపు జీవితాన్ని రుచి చూడమని తనని గదిలో వదిలేసి పక్కకి పోయాడు ప్రసాద్ తనను చెయ్యి పట్టుకుని లాక్కుని తనలో చేర్చుకుంది ఆమె ! ఆమే — రమణి !! ఆ తర్వాత తనకేమీ తెలియదు మళ్లీ తాను ఆవైపు వెళ్లనూలేదు ప్రసాద్‌ని తిట్టాడు ఆ పనినీ, ఆతన్నీ ఏవగించుకున్నాడు, తనను తాను అసహ్యించుకున్నాడు. కానీ — జీతాల రోజున — తను బయటికి వస్తుంటే ఒక గళ్లలుంగీవాలా, ఒక కసాయి — గేటు బయట నిలవేశాడు. చెయ్యి పట్టుకుని ప్రక్కకి లాక్కు పోయాడు ఒక ఇరానీ హోటల్లో 'టీ' ఇప్పిస్తూ చెప్పాడు. నెలనెలా మూడొందలు తనకివ్వాలి అదంతే ఎందుకంటే — ఇందుకూ అంటూ ఒక పాతిక ఫొటోలు తన ముందుంచాడు తనకు కళ్లు బైర్లు కమ్మినై. కాళ్లూ,చేతులూ చల్లబడినై. వాటన్నిటిలోనూ తానూ రమణీ— నగ్నంగా—వివిధ భంగిమల్లో కనిపిస్తున్నారు ! 'అన్యాయం, దారుణం, దుర్మార్గం' అని గొంతెత్తి అరవాలనిపించింది. కానీ, అతను తన డొక్కల్లో బొటనవేలిని నొక్కి— ''ఎట్లాంటి పిచ్చిపన్లు చేసినా డొక్క చీరేస్తాం, జాగ్రత్త ఉద్యోగం పోవడమే కాదు, సరాసరి పైటిక్కెట్టు కొనిస్తా'' అని హెచ్చరించాడు ఆ రాత్రి ఖాళీ జేబులో ఇంటికిచేరి ప్రసాద్‌ని అనరాని మాటలు అన్నాడు తాను ప్రసాద్ చాలా తేలిగ్గా నవ్వేశాడు 'పెద్ద మునిగిపోయిందేం లేదు అడపాదడపా వెళ్తూ వాళ్ల 'కష్టమర్'గా వుంటే— ఇలాంటి అవస్థం వుండదు. నే చెప్తా లే' అన్నాడు రోగ్ ! తాను జుట్టు పీక్కున్నాడు. తల పగలగొట్టు కున్నాడు, ఏడ్చాడు, సిగ్గుపడ్డాడు, చెంపలు వాయించుకున్నాడు ! కానీ, ప్రసాద్ మాట వినలేదు! మళ్లీ ఆ గడప తొక్కలేదు! తనకంతటి మహాబలం ఎక్కడిదా అనీ, ఎలా వచ్చిందా అనీ ఎన్నోసార్లు ఆలోచించాడు జవాబు దొరకలేదు కానీ అది నిజంగా నిలిచింది !

ఆ తర్వాత చాలాసార్లు, ఆ వుద్యోగం మానేసి అడ్రస్ లేకుండా ఆవూరు వదిలి వెళ్లి పోవాలనీ అనుకున్నాడు, కానీ, అంతలోనే పెళ్లి జరిగిపోయింది తనొక గుదిబండకు కట్టివేయ బడ్డాడు ఉద్యోగం వదిలేస్తే కలిగే పర్యవ సానాలూ— భయపెట్టినై బదిలీకీ అవకాశం లేదు, తమ కంపెనీకి బ్రాంచీలు లేవు అప్పట్నుంచీ తన కష్టార్జితం గద్ద తన్నుకు పోతూనేవుంది ! తిన్న పంజాదెబ్బనుంచీ కోలుకో లేకుండానే వున్నాడు, తను !

ఇంట్లోకి వచ్చేశాడు సుందరం ప్రసన్న లేచి వుంది. మాట్లాడకుండా తన పక్కమీద వాలేడు ! జాలిగా భర్తవైపు చూసి, అతనికేసి కదిలింది, ప్రసన్న !

బెరుగ్గానే భర్త ప్రక్కకి చేరింది, ప్రసన్న అతను గోడవైపు తిరిగి పడుకునివున్నాడు

లాలనగా అతని భుజంమీద చెయ్యి వేసింది అతను చలించలేదు నెమ్మదిగా కుడిచేత్తో అతన్ని ముఖాన్ని స్పృశించింది అతని కళ్లల్లోని చెమరింపు నులివేడిగా తగిలింది ప్రసన్న మనసు జాలితో కరిగిపోయింది

అతన్ని తనవైపు తిప్పుకుని గట్టిగా కౌగ లించుకునేసరికి — ఆమెలోని బేలతనం - బావురు మనకుండా వుండలేకపోయింది

తన మనసులాగే ఆమె మనస్సూ, అనేక రకరకాల వేదనలతో కలతై, వివశమైపోతోందని గ్రహించగలిగేడు — సుందరం

* * *

తెల్లవారుతూనే వెళ్లిపోయారు, తండ్రీ, రామ్మూర్తీ. నాలుగు రోజులు రామ్మూర్తి ఇంట్లోవుండి పల్లెకు పోతానని చెప్పి సెలవు తీసుకున్నాడు — మాధవయ్య

* * *

ఆ మర్నాడు —

ఆఫీసులో — ఉద్యోగులు ఏదో నాటకం వేస్తుంటే కూర్చుండిపోయాడు సుందరం

ఆ నాటకంలో ఒక పాత్ర — అతనికి బాగా

న్నించింది. అతనొక - ఎమ్మే. నిరుద్యోగి. ఉద్యోగ ప్రయత్నాల్లో విసిగి వేసారి, పట్టువదలిన విక్రమార్కుడై — చివరికి — స్వతంగా పాత పుస్తకాలషాపు తెరుస్తాడు. ఆ బంకులోనే ఒక ప్రక్కగా బిస్కెట్లూ, టీ అమ్మకం ప్రారంభిస్తాడు. అతనంటాడు — "మిధ్యా గౌరవానికి పోకుండా విజాయితీగా నడిబజార్లో మనల్ని మనం అమ్ముకున్నైనా బతకడంలో నామోషీలేదు ఈ చచ్చు ఉద్యోగాలకంటే, పచ్చిమిరపకాయ బజ్జీల వ్యాపారం చాలా అమవైన సంపాదనా మార్గం."

ఈ మాటలు సుందరం మనసును కదిలించినై; గుండెను కుదిపినై; మేధస్సును మధించసాగినై.

ఏదో వొక నిర్ణయానికి రామన్నట్లు వడివడిగా నడవడం మొదలెట్టాడు.

నారాయణగూడా చౌరస్తా దాటాడు నడిరోడ్డుమీద లారీ ప్రమాదం. జనాన్ని తోసుకుంటూ వెళ్లిచూశాడు. డ్రైవరూ, మరోవ్యక్తి రక్తపు మడుగులో చచ్చిపోయివున్నారు.

అవును — ఆ మరోవ్యక్తి—గళ్లలుంగీవాలా!

సుందరంకి కళ్లు తిరిగినై. తూలి పడబోయి నిలదొక్కుకున్నాడు.

అతని కళ్లముందు — ఒక్కసారిగా, గజేంద్రుణ్ణి పట్టి పీడిస్తున్న మొసలిమీదికి విడిచిన విష్ణుచక్రమే కనిపించసాగింది!

పూనికగా అడుగులు వేసుకుంట్లూ ముందుకు కదిలేడు.

"నడిబజార్లో మనల్ని మనం అమ్ముకున్నైనా బతకడంలో నామోషీలేదు"—

ఈ మాటలే అతని చెవుల్లో మార్మోగసాగినై.

ఈ మాటల వెనగ్గా— అతని చూపుల కెదుట— నిరుద్యోగి ఎమ్మే!

అతని చూపు ఇప్పుడు రేపటి వైపు సంధించి వుంది!

మొసలి మరణం యాదృచ్ఛికం కావచ్చుగానీ, సుందరం నిర్ణయం మాత్రం— ఇసుక తిన్నెమీద లేచిన ఇంద్రభవనం కాదు!

పొరపాటున గానీ, గ్రహపాటున గానీ—ఏదో మనిషికి— తన అడ్రస్ తెలిసే అవకాశం లేని ఊరు— సుందరం మేధస్సులో — చుక్కలా పొడసూపింది!

అవును— సుందరం పిరికివాడయితే కావచ్చుకానీ, అతనిప్పుడు కాలిలో ముల్లూ, కంట్లో నలుసూ తీసేసిన హాయితో ఊపిరి పీల్చుకున్నాడు!

తన మేధస్సులోని చుక్కతో ఒకే ఒక్క కోరికని ఆబగా, ఆర్తంగా, ఆర్ద్రంగా, ఆవేదనగా అడిగేడు — "మనిషి మనిషికీ చెప్తావు కదూ, ఈ కథ?!"



# బుద్ధి!

కప్పగంతుల మల్లికార్జునరావు



'అమ్మా... మీరు వెనక్కి జరగాలి.'

'అయ్యా! బాబు .. మీరు ముందుక జరగాలి.'

కరిచినట్టు అరుస్తున్నాడు కండక్టర్ వొక్కరూ కదలలేదు.

'ఇంకా ఎక్కడికి జరగమంటావ్!' ఎవరో అన్నారు మెల్లగా. ఆ మాట ప్రయాణీకుల రణగొణ ధ్వనిలో కల్సిపోయింది.

'ఏమ్మా .. మీక్కాదూ చెప్పటం ? అలా చూస్తూ నిల్చుంటారేం ? ముందు కొక్క అడుగేస్తే బోలెడంత జాగా. బయట వున్న పేసెంజెర్స్ ఎక్కాలా ? అమ్మాయ్ . అలా వెనక్కి చూస్తూ నిల్చుంటావ్ ? వో అడుగు వెనక్కి వెయ్యి. ఇదిగో పెద్దయ్య ..నువ్వేమిటి? అలా ముందుకు చూస్తూ నిల్చుంటావే ? వో అడుగు వెయ్యవయ్యా ... ఆ .. అది బాబూ . మీరు జరగండి . అమ్మా... మీరు సర్దుకోండి'

ఆ అమ్మాయి వో అడుగు వెనక్కి వేయక తప్పలేదు.

ఆ పెద్దమనిషి వోఅడుగు ముందుకు వేయక తప్పలేదు.

ముందు డోర్ నుంచి స్త్రీలు .. వెనక డోర్ నుంచి పురుషులు . ఎక్కాల్సిన వాళ్లంత ఎక్కేసేరు.

అప్పడాల్లాగ అతుక్కుపోయి వున్నారు జనం ఎండాకాలం చమటలు కారిపోతున్నాయి.

'రైట్ .. రైట్.. '

సిటీబస్సు కదిలింది లోపలి జనం వూపిరి పీల్చుకొన్నారు.

'టికెట్ . . టికెట్ '

టికెట్లు 'కట్' అవుతున్నాయి. చిల్లర డబ్బుల గలగలలు విన్పిస్తున్నాయి.

వెనక డోర్ దగ్గర జనం మధ్యలో నిలబడ్డ అతని దృష్టి అంతా పెద్దాయనకు ముందున్న ఆ అమ్మాయి మీదనే వుంది. తలకాయల మధ్యలో నుంచి చూస్తున్నాడు. మధ్య మధ్యలో ఏవో సైగలు చేస్తున్నాడు.

'నాయనా హీరో. బస్సు ప్రేమలన్నీ బుస్సులే. ఫుట్‌బోర్డ్ మీదున్న పేసెంజెర్స్ చస్తున్నారు పాపం యిందాకటి నుండి చూస్తున్నాము. వొక్క అడుగు ముందుకు వెయ్యమంటే మొద్దులా నిలబడ్తావేం ? జరుగు ముందుకి,' అని అంటూ ఎవరో పేసెంజర్ అతడిని ముందుకు నెట్టేడు.

అతను ముందుకు తూలి జనం మీద పడ్డాడు ఆ తూలుడు తూలుడు ముందున్న స్త్రీం దాకా వో పుయ్యాల వూపుకు కారణమయింది.

'నెట్టకండయ్యా బాబూ. యిక్కడ ముందు ఆడవాళ్ళున్నారు.'

అందమైన ఆ అమ్మాయి వెనక నిలబడ్డ

ఆ పెద్దాయన ఆ అమ్మాయి మీదికి తూలిపడి సర్దుకొని లేచి వెనక్కి తిరిగి జనంతో అన్నాడు.

'అమ్మాయ్. నువ్వు పైన హేండిల్ పట్టుకో లేకపోతే పడిపోతావ్ ?' అని అన్నాడు ఆ అమ్మాయితో.

ఆ అమ్మాయి ఆ పెద్దాయన మాటల్ని విన్పించుకొన్నట్లు కన్పించలేదు అందమైన ఆమె మొహంలో ఏదో ఆందోళన. ఆరాటం ఆమె చూపులన్నీ వెనక్కే వున్నాయి

'ఒరేయ్ ! ముసలాడి కళ్లు కప్పి, పిల్ల వెనక నిలబడ్డ ఆ హీరోగాడితో 'లౌ' ఆడుతున్నదిరోయ్ ! దాని చూపులు చూడు ఫేస్‌లో ఎక్స్‌ప్రెషన్ చూడు ఏదో మెసేజ్ కన్వే చేస్తున్నట్లు లేదూ ?' సీటులో కూర్చొని ఆమెనే చూస్తున్న యువకులిద్దరు గుసగుసలాడుకొంటున్నారు

మార్కెట్ . హోటల్ రంభ . థియేటర్ తిలోత్తమ

బస్ స్టాప్‌లు వస్తున్నాయి పోతున్నాయి ఎక్కేజనమేకాని దిగేజనం లేరు.

ఉన్నట్లుండి వెనక గేటు వద్దనున్న ఆ యువకుడు జనాన్ని తోసుకొని ముందుకు రావటం ఆరభించాడు.

'ఏంటయ్యా. తోస్తావ్? యిందాకటిదాకా వెనకవాళ్లకి అడ్డంగా నిలబడ్డావ్ ? యిపుడు ముందున్న మమ్మల్ని తోసుకుపోతున్నావ్ ? ఎక్కడికెళ్తావ్ ?'

'బస్సులో ప్రేయసి దగ్గరికేమో! ఇందాకటి నుంచి 'బీట్' కొడ్తున్నాడుగా ? సిగ్నల్ అంది వుంటుంది '

అతను ఎవరి మాటల్ని పట్టించుకోటం లేదు ముందుకు ... ముందుకు .. తోసుకు . తోసుకు . . పద .. పద ..

ముందుకొచ్చాడు. అతనికి ఆ అమ్మాయికి మధ్యన పెద్దాయన మాత్రమే ఇప్పుడు అడ్డం పెద్దాయనను పక్కకు నెట్టి ముందుకు తోసుకు పోబోయాడు.

కానీ పెద్దాయన గట్టివాడే. గోడలాగా నిలబడి అంగుళం కదల్లేదు

'ఏమిటోయ్ ? ఏమిటా వూపు ? అహ — నాకు తెలీకడుగుతాను—ఎక్కడికిట ఆ పరుగు ? ఆ తోపుడేమిటి? ఇందాకటినుంచి చూస్తున్నాను. నీ అల్లరి వేషాలేమిటి ? ముందున్నవాళ్లంతా ఆడవాళ్లు కదా? వారిని కూడా తోసుకుపోదామనే? అహ — నువ్వసలు మర్యాదవున్న మనిషివేనా అని ?' ఝాడించేసేడా పెద్దమనిషి యువకుడిని

'భలే భలే ... భలే అడిగారండీ' అనుకొన్నారు చాలామంది.

'మర్యాదా ? మీరు ఏ మాత్రం మర్యాదస్తులో యిందాకటినుంచి చూస్తూనేవున్నాలెండి ఎందుకు ఏళ్లొచ్చాయ్ ? కాల్చుకుతిననా ? ఛీ సమయం కల్సివచ్చిందికదాని మీ యిష్టం వచ్చినట్లు ప్రవర్తించటమేనా ? మీ సంగతి తేల్చుకొందామనే వచ్చాను. యిప్పుడు చేయి వెయ్యండి మీ అంతు తేలుస్తాను' అతను కోపంగా అన్నాడు అంటూ పెద్దమనిషిని అమాంతం వెనక్కి నెట్టేసి ఆ అమ్మాయి వెనక స్థానాన్ని తను ఆక్రమించాడు.

బస్సు ఏదో స్టాప్‌లో ఆగింది

'చూచారుటండీ — అతగాడి దౌర్జన్యం ? పెద్దమనిషిని — నన్ను పట్టుకొని ఎన్నెన్ని మాటలన్నాడో విన్నారుకదా? ఆ పిల్లను నేనేమో చేసేనుట ! యితను ఆమెను నా నుంచి రక్షించటానికి వచ్చిన హీరోలా నన్ను నెట్టేసి ఆ అమ్మాయి వెనకనిలబడ్డాడు నా వయసేమిటి ? ఆ పిల్ల వయసేమిటి ? నా కూతురి లాంటిదే యితనేమన్నా మర్యాద వున్న మనిషేనా అని ! యితగాడి దౌర్జన్యం యిలా జరిగిపోవల్సిందేనా అని ! అబ్బాయ్ నువ్వు మర్యాదగా నా స్థానాన్ని నాకిచ్చి వెనక్కివచ్చి నిలబడ్తావా లేదా ?''

'నిలబడాల్సిందే . నిలబడాల్సిందే' యువ పాసెంజర్లు పెద్దమనిషికి సపోర్ట్‌గా అరిచారు

'అది కాదండీ ' ఏదో చెప్పబోయాడు

'నువ్వేం చెప్పనక్కర్లేదు మేం అంతా చూస్తూనేవున్నాం నువ్వు ఆ అమ్మాయికి సైగలు చేయటం అదీ పైగా పెద్దమనిషిని పట్టుకుని అన్నిమాటలంటావా ? అసలు వెనక వున్నవాడివి—తోసుకొని ఆడాళ్లవరకు వచ్చేపనేమిటి నీకు ? వచ్చివచ్చి అందమైన ఆ అమ్మాయి వెనక నిలబడటంలో అర్థం ఏమిటి ? ఎన్ని గుండెలు నీకు ? అమ్మో . ?'

తలా వో మాట అనసాగేరతడిని

అతనొక్కడు, యువతల అనేక గొంతులు

అయినా అతను చలించలేదు ఆ అమ్మాయి వెనక స్థానాన్ని వదలలేదు ఏదో మాట్లాడుతున్నాడు కానీ రణగొణధ్వనిలో విన్పించటంలేదు

'రైట్ . రైట్ ' కండక్టర్ అరిచాడు ఎవరో కండక్టర్‌తో చెప్పి బస్సును కదలకుండా ఆపించారు.

'వాడి అంతు తేల్చుకోవాల్సిందే యివాళ ఎంత దౌర్జన్యం ? పబ్లిక్‌గా సిటీబస్‌లో అమ్మాయిని పట్టుకొని. .'









జనానికి ఆవేశం, పట్టుదల పెరిగాయి.

ఆ అమ్మాయి కలగజేసుకొని ఏదో చెప్ప బోయింది. కానీ విన్పించుకొనే వారేరీ ?

నలుగురూ ఆ యువకుడిని యువతలకి లాగారు.

తలా వో తోపు—తలా వో దెబ్బ. అతను బస్సులోనే పాసెంజర్స్ కాళ్ళదగ్గర పడ్డాడు

'ఇట్లాంటి వాళ్లను యిలా తన్ని వదిలేస్తే లాభంలేదు బుద్ధి చెప్పాల్సిందే, పోలీసులకి పట్టియ్యాల్సిందే' ఆడవాళ్ళు మగవాళ్లకు సపోర్టుగా అరిచారు

'ముందు రోడ్‌సైడ్ రోమియోగాడిని బయటికి లాగండి.'

నలుగురూ చేరి అతడిని లాగబోయారు

హఠాత్తుగా ఆమె వచ్చి అతని చేయి

## బుద్ధి

పట్టుకొంది కళ్ళతోనే పేసెంజర్స్‌ని అతడినేం చేయవద్దని వేడుకొంది

'రోమియోకి సపోర్టు వచ్చిందిరోయ్ జూలెట్ ! ఆహా—ప్రేమ !' అంతా ఫక్కున నవ్వేరు.

'అయ్యా ఆమె నా ప్రేయసి కాదు నా భార్య' అరిచాడతను

'భార్యా. !!'

'ఆమె ముందు నుంచి బస్సెక్కింది నేను వెనకనుంచి ఎక్కేను ఆమె కోసమని కూడా నేను తీసుకొన్న రెండు టిక్కెట్లివిగో'

'మరి ఆ మాట ముందే చెప్పవచ్చుగా ? పైగా బస్సెక్కిన దగ్గరినుంచి ఆ సైగలేమిటి ? నువ్వు తన భర్త అని ఆ అమ్మాయి అయినా చెప్పవచ్చుగా ? ఏమ్మా ?'

అతను తల వంచుకొన్నాడు — ఆమె అమాయకంగా అతడినే చూస్తోంది.

''భార్యాభర్తలని తెలియక ఎన్ని మాటలను కొన్నాం పాపం — ఆ అమ్మాయి యిప్పుడెంత బాధపడుతున్నదో ?''

'ఆ బాధ పొనక్కర్లేదండీ ఆమె బాధ పడదు ఎందుకంటే మీరనుకొన్నవేవీ ఆమెకు విన్పించవు తనుకొన్నవి మీకు చెప్పలేదు ఎందుకంటే ఆమె మూగది కూడా కనుక'

'ఆ !'

'రైట్ .. రైట్' బస్ కదిలింది

'అయితే మొదట్లోనే మీరు ఆమె దగ్గరికి రావచ్చుగా ? చివర్లో అంత హడావుడిగా అందరినీ తోసుకొంటూ రావటందేనికి ?'

'మొదట్లో ఆమెను రక్షించుకోవల్సిన అవసరం వస్తుందనుకోలేదండీ అంచేత ఆమెను గమనిస్తూ వున్నాను కానీ వున్నట్టుండి పరిస్థితి మారింది. ఆమె తనకి నా రక్షణ కావాలని సిగ్నల్ కూడా యిచ్చింది అప్పుడు నాకు జనాన్ని తోసుకొని ముందుకు రాగల బలం వచ్చింది'

'రక్షణా ! యింతమంది జనం వుండగా ఆమెకేం ఆపదొచ్చింది ? మేం చూస్తూనే వున్నాంగా ?'

'మీరు కానీ, నేను కాని, మనుష్యుల బుద్ధిల్ని చూడలేం కదండీ ?'

'అంటే —? ఆమెపట్ల ఎవరైనా అనుచితంగా ప్రవర్తించారంటావా ? ఆమెకు చుట్టుపక్కల ఎవరూ వయసులోవున్నవారుకూడా లేరే అటు ఆడవాళ్ళు ! యిటు యీ పెద్దాయన ! యింతకన్నా రక్షణ ఏముంది ?'

అతను నవ్వేడు పెద్దమనిషి వైపు చూచాడు

బస్సు ఆగింది

'మీ ప్రశ్నకు సమాధానం ఆ పెద్దమనిషినే అడిగి తెల్సుకోండి నేను నిజం చెప్పినా మీరు నమ్మకపోవచ్చు రా జ్యోతీ వెళ్దాం'

ఆ యువకుడు ఆమె చేయి పట్టుకొన్నాడు

ఆమె రెండడుగులు వేసి పెద్దమనిషివద్దకొచ్చింది ఆయన్ని చూడగానే ఆమె కళ్లల్లో నీళ్ళు తిరిగేయి అంతలోనే మొహం కూడా అసహ్యంతో నిండిపోయింది

'ధూ' అంది ఆ వొక్క మాటలో ఆ స్త్రీ గుండెల్లోని అసహ్యమంతా వ్యక్తమయింది

వాళ్ళు బస్సు దిగపోయారు బస్సు మళ్లీ కదిలింది

జనం పెద్దాయనవైపు చూచారు,

తలక్రిందులుగా నిల్చున్న మనిషిగా కన్పించాడా పెద్దమనిషి !

★

# హైదరాబాదు నోట్‌బుక్

## ఆముక్తమాల్యద నృత్య నాటిక :

శ్రీ నటరాజ కళామందిర్ జులై 1వ వారంలో ప్రదర్శించిన ఆముక్తమాల్యద నృత్య నాటిక ప్రేక్షకులను చాల ఆకర్షించింది ఆముక్తమాల్యదగా నర్తకి సరళకుమారి అభినయించి ఆ పాత్రకు చాల న్యాయం చేకూర్చారు ఆముక్తమాల్యద కథ తెలుగువారికి చిరపరిచితం. భగవంతునికి సమర్పించే పూలమాలలను తాను మొదట ధరించి, బాగుందో లేదో అని చూచుకొని, పిదప భగవంతునికి అలంకరించడంవల్ల ఆమెకు చూడికొడుత్త నాచ్చియార్— మొదట తాను ముడుచుకొన్న దండలను భగవంతునికి ఇచ్చినది — అనే పేరు వచ్చినది. దాని సంస్కృతీకరణమే ఆముక్త—మాల్య--ద ఆమె ఇలా చేస్తున్నందుకు, ఆమె తండ్రి మందలించాడట. కాని, భగవంతుడే స్వయంగా తండ్రి చిత్తునితో — అలా మందలించకండి ఆమె ముడుచుకొన్న దండలే నాకు చాల ఇష్టం అన్నాట్ట. ఆముక్తమాల్యద అవివాహితగానే వుండిపోయింది, రంగనాధుడే తన భర్త అని, ఆయననే వరించి, ఆయనలో ఐక్యమయింది. ఆమె గొప్ప కవయిత్రి. తిరుప్పావు అనే 30 పాశురాల గ్రంధాన్ని, నాచ్చియార్ తిరుమొళి అనే మరొక గ్రంధాన్ని రచించింది తిరుప్పావును ధనుర్మాసంలో విశిష్టాద్వైతులు నిత్యమొక పాశురంగా పారాయణం చేస్తారు. నాచ్చియార్ తిరుమొళిలోని వారణమాయిరం అనే దశకంలో గోదాదేవి తనను పెళ్ళాడడానికి రంగనాధుడు వేయి ఏనుగులతో మహావైభవంగా తరలివచ్చినట్టు, తనను పెండ్లాడినట్టు వర్ణించింది ఇదొక గొప్ప కావ్యం. ఆమూక్తమాల్యద నృత్య నాటికను శ్రీ కొళ్ళేగాల్ సుబ్రహ్మణ్యం రచించారు; శ్రీ కృష్ణశాస్త్రి, శ్రీ పాలగుమ్మి విశ్వనాధంగార్ల గేయాలను ఇమిడ్చేరు, అక్కడక్కడ. సరళకుమారి ఆముక్తమాలద విరహాన్ని, భక్తిని, మధురభక్తిని, ఇతర రసాలను చక్కగా అభినయించారు. విష్ణుచిత్తుడుగా ప్రముఖ నాట్యాచార్యులు శ్రీ కోరాడ నరసింహారావు అభినయించారు. ఆముక్తమాల్యద సఖులుగా సీత, పూర్ణిమ, ప్రమీల, శాలినీ, మాధవి, ఉష, హేమ, కృష్ణవేణి, బేబీపద్మజ, సరళకుమారితో చక్కగా సహకరించారు. ప్రదర్శనకు ఆంధ్రప్రదేశ్ హైకోర్ట్ న్యాయమూర్తి శ్రీ జి. రామానుజులు నాయుడు అధ్యక్షత వహించారు. ఆంధ్రప్రదేశ్ విధానసభ స్పీకరు శ్రీ టి. సత్యనారాయణ ముఖ్యఅతిథిగా వున్నారు. శ్రీ కె. వి. భాస్కరరావు ప్రత్యేక సంచికను ఆవిష్కరించారు. కూచిపూడి గాని, భరతనాట్యం గాని, మనదేశంలోని మరొక నృత్య సంప్రదాయం గాని కొత్త ఇతి వృత్తాలు గ్రహించనిదే మన జాలదు అనే విషయాన్ని ఆమూక్తమాల్యద నిరూపించింది. దీనిని నాట్యాచార్యులు, నృత్యసంఘాలు గుర్తించాలి.

## డాక్టర్ రావూరికి సంతాపాంజలి :

జులై 2వ తేదీన నల్లకుంటలో స్వగృహంలో మరణించిన సుప్రసిద్ధ డాక్టర్ రావూరి వేంకట సత్యనారాయణరావుకు జులై 4వ తేదీన త్యాగరాజ గాన సభలో జరిగిన సమావేశంలో పలువురు రచయితలు సంతాపాంజలి సమర్పించారు డాక్టర్ రావూరి వయస్సు 73 సంవత్సరాలు ఆయనకు భార్య, ఒక కుమార్తె ఉన్నారు. ఆయన పెక్కు హాస్య నవలలు, హాస్య వ్యంగ్య రచనలు చేశారు. కృష్ణా పత్రికలో ఆయన వడగళ్ళు పాఠకులను విశేషంగా ఆకర్షించాయి ఆయన ఆంధ్ర ప్రభ సచిత్ర వారపత్రికకు సంపాదకులుగా కొంత కాలం పనిచేశారు. అంతకు ముందు ఆంధ్ర ప్రభ దినపత్రికలో కొనసాగుతున్న 'ఆషామాషీ' శీర్షికలో హాస్య రచనలు చేశారు. హైదరాబాదులో భాషా కుటీరమనే సంస్థ స్థాపించి పలువురు సాహిత్యవేత్తలు తమ అభిప్రాయాలు ప్రకటించడానికి అవకాశం కలిగించారు. పలువురు యువ రచయితలను ప్రోత్సహించారు. 'నవ్వండి, నవ్వించండి' వంటి పెక్కు సాహిత్య వినోద సంస్థలను నెలకొల్పడానికికూడ కారకులయ్యారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం ఆయనను గౌరవకళా ప్రపూర్ణ బిరుదంతో సత్కరించింది సంతాపసభకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ కార్యదర్శి డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తి అధ్యక్షత వహించారు డాక్టర్ సి నారాయణరెడ్డి ముఖ్య అతిథిగా వున్నారు డాక్టర్ రావూరి అముద్రిత రచనలను ముద్రించడానికి, ముద్రిత రచనలను పునర్ముద్రించడానికి అందరూ పూనుకోవాలని డాక్టర్ నారాయణరెడ్డి సూచించారు. సంతాపసభ ఏర్పాటు చేసిన వంశీ ఆర్ట్స్ థియేటర్స్ కార్యదర్శి శ్రీ వంశీ రామరాజు ప్రారంభంలో స్వాగతం చెబుతూ, భాషా కుటీరాన్ని మునుపటివలె కొనసాగించడానికి తమ సంస్థ పూనుకుంటుందనీ, తద్వారా డాక్టర్ రావూరి పేరు శాశ్వతం చేయదలిచామని అన్నారు

1983–84 సంవత్సరానికి హిందుస్థాన్ ఛాంబర్ ఆఫ్ కామర్స్ (మదరాసు) అధ్యక్షుడుగా ఎన్నికైన శ్రీ ఉమ్మడి నందగోపాల్



## 34వ వనమహోత్సవం :

ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆవరణలో ఏర్పాటయిన 34వ వనమహోత్సవాన్ని ముఖ్యమంత్రి శ్రీ ఎన్ టి రామారావు జులై 2వ తేదీన ప్రారంభిస్తూ, సామాజిక అటవుల అభివృద్ధికి, అటవీ సంపద రక్షణకు ప్రజలు ముందంజ వేయాలని, వృక్ష రోపణ రక్షణలకు గల ప్రాధాన్యాన్ని ప్రజలు గుర్తించి వుంటే నేడింత వాతావరణ కాలుష్యం ఏర్పడివుండేది కాదని అన్నారు. వాతావరణ కాలుష్య నివారణకు చెట్లు ఎంతయినా అవసరమని, కాని, ధనానికి దాసులైన మానవులు చెట్లను తమ స్వార్థం కోసం నరికివేసి వాతావరణాన్ని కలుషితం చేస్తున్నారని ముఖ్యమంత్రి విమర్శిస్తూ, ప్రతివారు తమ ఇంట్లో ఒక చెట్టును, కనీసం కరివేపాకు చెట్టునయినా పెంచాలని సూచించారు విద్యా సముపార్జన నేడు వ్యాపారంగా మారిందని ముఖ్యమంత్రి విచారం ప్రకటిస్తూ, అర్హత లేకున్నా ధనబలంతో పైచదువుకు వెళ్ళే దురాచారాన్ని అరికట్టాలని ఆయన నొక్కి చెప్పారు. వనమహోత్సవ సమావేశానికి అధ్యక్షత వహించిన రాష్ట్ర అటవీ శాఖమంత్రి శ్రీ కె జానారెడ్డి ప్రసంగిస్తూ, రాష్ట్రంలో అడవుల సంరక్షణకు, సామాజిక అటవుల అభివృద్ధికి యుద్ధప్రాతిపదికపై చర్యలు తీసుకోవాలన్నారు "రాష్ట్రంలో 10వ తరగతిలోను, ఇంటర్ మీడియట్ తరగతులలోను దాదాపు కోటిమంది విద్యార్థులు చదువుతున్నారు ఒక్కొక విద్యార్థి ఒకచెట్టునాటి పోషిస్తే సంవత్సరానికి 50 కోట్ల రూపాయల ఆదాయాన్ని పొందవచ్చు ఈ ఆదాయంలో విద్యారంగాన్ని ఎంతో ముందుకు తేవచ్చు. ఒక చెట్టు నాటిపోషించే ప్రతి విద్యార్థికి సంవత్సరానికి పది మార్కులు వేసే పద్ధతిని ప్రవేశ పెట్టాలి" అని శ్రీ జానారెడ్డి సూచించారు.

# హైదరాబాద్ నోట్ బుక్

## పత్రికా రచయితలకు ముఖ్యమంత్రి హితవు :

రాష్ట్ర వర్కింగ్ జర్నలిస్టుల ద్వైవార్షిక సమావేశం సమాప్త్యుత్సవంలో ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు ప్రసంగిస్తూ, పత్రికా రచయితలు సమస్యా పరిష్కారంలో ధైర్యంగా వ్యవహరించాలని ఉద్బోధించారు. ప్రజాస్వామ్యంలో పత్రికల బాధ్యత గురుతరమని, ప్రజలకు పాలకులకు మధ్య పత్రికలు వంతెనగా వుంటూ, ప్రభుత్వోద్దేశాలను ప్రజలకు తెలియజేస్తున్నందుకు ప్రశంసిస్తున్నానన్నారు. పత్రికా రచయితలు తమ మనస్సు చంపుకొని పని చేయనవసరం లేదని, యజమానులకు తలవంచిన నాడే పత్రికా రచయితలు తమ స్వాతంత్ర్యం కోల్పోతారని ముఖ్యమంత్రి నొక్కిచెప్పారు. ''మీరు ధైర్యంగా వ్యవహరించినంతకాలం యజమానులు మిమ్మల్ని మోసం చేయలేరు'' అని ఆయన ఉద్ఘాటించారు. సమాజాన్ని శాసించే శక్తి ఉన్న పత్రికా రచయితలు పత్రిక యజమానుల దౌర్జన్యాలను సహించనవసరం లేదని ముఖ్యమంత్రి అన్నారు. ''నేను మంచి చెడ్డలను లోతులుగా తరచి, విధికి తలవంచి అంతరాత్మ చెప్పినట్లు పని చేస్తున్నాను. పత్రికల విమర్శకి బాధ పడను. ధైర్యం ఉన్నంత కాలం ఎవ్వరికీ భయపడను'' అని ఆయన అన్నారు. సమాప్త్యుత్సవానికి రాష్ట్ర సమాచార శాఖ మంత్రి శ్రీ చేగొండి వెంకటహరి రామజోగయ్య అధ్యక్షత వహించారు. ఉత్సవం దేశోద్ధారక భవనంలో జరిగింది.

## ఉపశ్రుతి :

అధికార భాషగా తెలుగును కచ్చితంగా అమలుపరుస్తున్నాము. పొట్టి సంతకంకూడా తెలుగులోనే చేయాలన్నానుగదా. ఎల్. జె. అని ఎందుకు చేశారు ? – అని గర్జించాడు పై అధికారి కింద ఉద్యోగి మొహాన. అయ్యా! నా పేరు లంకా జగన్నాథం. పొడి అక్షరాలతో పొట్టి సంతకం చేస్తే లం. జ. అని అపార్థం వస్తుందండీ! – అన్నాడు కింది ఉద్యోగి సవినయంగా. ఛీ! ఛీ! ఛీ! అలా అయితే ఎల్. జె. అనే చేయండి సంతకం – అన్నాడు నాలుక కొరుక్కున్న పై అధికారి.

— తిరుమల రామచంద్ర ★


*Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3 Editor: S. Radhakrishna.*


"రోషగాడు"లో
సిల్క్ స్మిత

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక



## వజ్రోత్సవ సంచిక

## [16-9-1983]

## వినాయక చవితి సంచిక

ఆంధ్ర సచిత్ర వారపత్రిక 1908లో స్థాపించినప్పటి నుంచి నేటి వరకు ప్రవర్ధమాన మవుతూ 75 సంవత్సరాలు పూర్తిచేసుకొని వజ్రోత్సవ సంవత్సరంలో అడుగు పెడుతోంది.

ఈ సందర్భములో ఆంధ్ర సచిత్ర వారపత్రిక వినాయక చవితి సంచిక జన్మదిన సంచికగా ప్రముఖుల రచనలు, చిత్రాలు, వ్యాసాలు, కార్టూన్లు, మరియు అనేక విశేషాలతో సర్వాంగ సుందరంగా, పూర్తి ఆఫ్ సెట్ ముద్రణతో యెక్కువ పుటలతో వెలువడనున్నది.